బ్రహ్మర్షి పత్రీజీ దివ్య ఆశీస్సులతో...

# ఆత్మశాస్త్రం

తటవర్తి వీరరాఘవరావు

అనుబంధం :
బ్రహ్మర్షి పత్రీ గారి
ధ్యాన వేమన,
చతుర్విధ పురుషార్థాలు,
ముక్తి మార్గం

ఉద్ధరేదాత్మనాత్మానం

# ఆత్మశాస్త్రం



రచన:

**తటవర్తి వీర రాఘవరావు**

తటవర్తివారి వీధి,  భీమవరం - 534 201. ప॥గో॥జిల్లా.

ఫోన్ : 08816 - 234353, సెల్ : 9440309812

email : balajipyramid.bvrm@gmail.com

# ఆత్మశాస్త్రం


రచన & ప్రచురణ : **తటవర్తి వీర రాఘవరావు**

మొదటి ముద్రణ : ఏప్రిల్, 2010
ప్రతులు : 3,000

రెండవ ముద్రణ : ఆగస్టు, 2011
ప్రతులు : 3,000

మూడవ ముద్రణ : నవంబరు, 2012
ప్రతులు : 3,000

వెల : **రూ. 70/-లు**

డిజైనింగ్ & ప్రింటింగ్ : చైతన్య గ్రాఫిక్స్,
తటవర్తి వారి వీధి, భీమవరం-534201.
సెల్ : 9848393179, 9849393179



**కాపీలకు :**

## తటవర్తి వీర రాఘవరావు

**తటవర్తివారి వీధి, భీమవరం - 534 201. ప॥గో॥జిల్లా.**

**ఫోన్ : 08816 - 234353, సెల్ : 9440309812**

email : balajipyramid.bvrm@gmail.com


**పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ మూవ్‌మెంట్ - ఇండియా**

ధ్యానం గురించి మరింత సమాచారం కొరకు ఈ క్రింది వెబ్‌సైట్‌లను దర్శించండి.
**1) www.pssmovement.org, 2) www.meditationeverywhere.org,**
**3) www.pyramidvalley.org, 4) www.pyramidseverywhere.org,**
**5)www.thepyramidradio.com**

తెలుగులో సమాచారం కొరకు **http://pssmovement.org/telugu/**

# ఉపోద్ఘాతము

ఆత్మ విద్యనే ఆధ్యాత్మిక విద్య అని కూడా అంటారు. ఇది మృత్యువును శాశ్వతంగా దూరం చేసే విద్య. చచ్చి పుట్టే జీవితం కాకుండా చావు పుట్టుకలు లేని జీవితాన్ని ప్రసాదించే విద్య. 'ఆత్మ విద్యే' సరైన విద్య. వ్యక్తిని సరిచేసే విద్య. నిత్యానందాన్ని ఇచ్చే విద్య.

విద్ అనే సంస్కృత ధాతువు నుండి వచ్చినదే విద్య. విద్ అంటే తెలుసు కోవడం. 'విద్య' అంటే తెలుసుకోదగినది.

మరి తెలుసుకొనదగినది ఏది? మనం అన్నిటినీ తెలుసు కుంటున్నాము. ఎన్ని తెలుసుకున్నా మన బాధలు తీరడం లేదు. దుఃఖం తప్పడం లేదు. శోకం పోవడం లేదు. కష్టాలు తొలగడం లేదు. కన్నీళ్ళు ఆరడం లేదు. కారణం ఏది తెలుసుకుంటే సర్వమూ తెలియ బడుతుందో దానిని మనం తెలుసుకోవడం లేదు. ఆ విద్యను మనం అభ్యసించడం లేదు. ఆ విద్యే 'ఆధ్యాత్మిక విద్య'. దానినే 'ఆత్మ విద్య' అని కూడా అంటారు. 'ఆత్మ విద్య' అభ్యసిస్తే సమస్త దుఃఖాలు తొలగిపోతాయి.

ఆధ్యాత్మికమంటే నీ స్వభావమే. ప్రతీ వ్యక్తిలో అంతర్యామియై, ప్రత్యగాత్మయై వెలిగే పరమాత్మే, 'ఆత్మ' అని పిలువబడుచున్నాడు. 'ఆత్మే' పరమాత్మ అని తెలుసుకొనే జ్ఞానమే ఆధ్యాత్మికం. 'ఆత్మే' నీ స్వరూపము. అందుకే "స్వస్వరూపాను సంధానమే ముక్తి లేక మోక్షమని" అన్నారు.

ఇది ఉన్నదే కానీ కొత్తది కాదు. మనం మరిచిన ఈ విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకోవడమే కాని, కొత్తగా కనుగొన్నది కాదు. పూజ, భజన, ప్రార్థన, జపాది కర్మలైన సాధనల ద్వారా, జ్ఞాన స్వరూపమైన 'ఆత్మ' అనుభవానికి అందదు. 'ఆత్మ'ను ఒక్క 'ధ్యాన సాధన' ద్వారా మాత్రమే అనుభవానికి తెచ్చుకోగలం.

మానవుల దుఃఖ నివృత్తికి మూలమైన 'ఆత్మ జ్ఞానాన్ని' పొందాలంటే 'ఆత్మశాస్త్రాన్ని' అధ్యయనం చెయ్యవలసిందే. 'ఆత్మ' యొక్క గొప్పతనాన్ని తెలుసుకోవలసిందే. అంతటి గొప్పదైన 'ఆత్మ' అంటే భగవంతుని గురించిన జ్ఞానాన్ని అందించేదే ఈ "ఆత్మశాస్త్రం". ముముక్షువులు దీనిని అధ్యయనం చేసి, అర్థం చేసుకొని "ధ్యానం" ద్వారా ఆత్మానుభవం పొంది తరిస్తారని ఆశిస్తున్నాను. ముముక్షువులారా చదవండి.

**- తటవర్తి వీరరాఘవరావు**



# ధ్యానం చేసే పద్ధతి శ్వాసమీద ధ్యాస



ఎవరికి తగిన సుఖాసనంలో వారు హాయిగా కూర్చుని... చేతులు రెండూ కలిపి... కళ్ళు రెండూ మూసుకుని... ప్రకృతి సహజంగా జరుగుతున్న ఉచ్ఛ్వాస, నిశ్వాసలను గమనిస్తూ వుండాలి!

మధ్యమధ్యలో అనేకానేక ఆలోచనలు వస్తున్నా వాటిని ఎప్పటికప్పడు 'కట్' చేస్తూ... మళ్ళీ, మళ్ళీ శ్వాస మీదకే... ధ్యాస మరల్చుతూ వుంటే.. క్రమ క్రమంగా... ఆలోచనా రహిత స్థితి కలుగుతుంది.... చిత్తవృత్తులు నిరోధించబడతాయి... మనస్సు నిర్విషయం, శూన్యం అయిపోతుంది. మనస్సు శాంతిస్తుంది. ఇదే ధ్యాన స్థితి.

ఈ ఆలోచనా రహిత స్థితిలో కలిగే అనేకానేక శారీరక, నాడీ మండల, ఆత్మానుభవాలను గమనిస్తూ వుండాలి. ఆ స్థితిలో విశ్వమయ ప్రాణశక్తి. అపారంగా శరీరంలోకి ప్రవేశించి నాడీ మండలాన్ని శుద్ధి చేస్తుంది. ఆ శక్తి వల్ల రోగాలన్నీ తగ్గుతాయి. నాడీమండల శుద్ధి వల్ల కర్మలు పోతాయి.

ప్రతిరోజూ ఎవరి వయస్సు ఎంతుంటుందో... కనీసం అన్ని నిమిషాలు... తప్పనిసరిగా... రోజుకి రెండు సార్లుగా... ధ్యానం చెయ్యాలి.

## పిరమిడ్ ధ్యానుల తత్వ సారం








ఆత్మే పరబ్రహ్మం

| | |
|---|---|
| జీవుడే దేవుడు | దేహమే దేవాలయం |
| శ్వాసే గురువు | సమయమే సాధన |
| సహనమే ప్రగతి | అనుభవమే జ్ఞానం |
| దానమే ధర్మం | ధర్మమే పుణ్యం |

www.pss.org

ధ్యానం .. అంటే .. శ్వాసధార .. మీద ..ధ్యాసధార

# విషయ సూచిక

## అనుబంధం

# "ధనమే ప్రధానమా?"

సహజంగా మానవుడు సుఖాన్ని కోరుకుంటాడు. దుఃఖం వద్దనుకుంటాడు. కాని గమనిస్తే కోరుకున్న సుఖం అనుభవించలేకపోతున్నాడు. వద్దన్న దుఃఖాన్నే అనుభవించవలసి వస్తుంది. మానవుడు ఎంత ప్రయత్నించినా తాను అనుకున్న దానికి విరుద్ధంగానే జరుగుతుంది. తన శక్తియుక్తులు ఏమాత్రం ఉపయోగపడటం లేదు.

దీనికి ముఖ్య కారణం మానవుడు సరిగా ఆలోచించకపోవడమే. ఎందుచేతనంటే మానవుడు ముఖ్యంగా ధనం వుంటే చాలు, ఎలాంటి సుఖాలనైనా అనుభవించవచ్చని భావిస్తున్నాడు. అలాగే ధనంతో ఎలాంటి దుఃఖాన్నైనా నివారించుకోవచ్చని కూడా భావిస్తున్నాడు. ధనంతో ఏదైనా సాధించవచ్చని బలంగా నమ్ముతున్నాడు. మానవుని ఆలోచనా విధానం ఇలాగే వుంది. అందుకే ధన సంపాదనకు ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తున్నాడు. ఎక్కువ సమయం కూడా కేటాయిస్తున్నాడు. తన శక్తి, యుక్తి, అన్నీ ధన సంపాదనకే వినియోగిస్తున్నాడు. జీవితమంతా కేటాయిస్తున్నాడు. ఇంచుమించు అంతా అలాగే జీవిస్తున్నారు.

కానీ ఎంత సంపాదించినా, ఎన్ని సుఖాలు సమకూర్చుకున్నా, చివరకు దుఃఖాల పాలై ఆ సుఖాలను అనుభవించలేకపోతున్నాడు. ఎన్నో తెలివితేటలు ఉన్నాయని భావించే మానవుడు తన దుఃఖాలను మాత్రం నివారించుకోలేకపోతున్నాడు. దీనికి ముఖ్య కారణం మానవుడు ఆలోచించవలసింది ఆలోచించకపోవడమే. మానవుడు తాను అనుకున్నట్టు జీవించాలంటే ముఖ్యంగా 'పాప, పుణ్యాల' గురించి ఆలోచించాలి.

మానవుడు ఈ 'పాప, పుణ్యాల' గురించి ఆలోచించకుండా ఎంత ధనం సంపాదించినా తాను అనుకున్నట్టు జీవించలేడు. అంటే సుఖంగా వుండలేడు. దుఃఖం నివారించుకోలేడు. అందుచేత ముఖ్యంగా 'పాప, పుణ్యాలు' గురించి ఆలోచించాలి. ఎందుచేతనంటే పాపం వల్లే దుఃఖం వస్తుంది. దుఃఖం వుంటే ఎంత ధనం వున్నా, ఎన్ని సుఖాలు వున్నా అనుభవించలేడు. జీవితం నరకమవుతుంది. అందుచేత ఏది పాపమో తెలుసుకోవాలి. ఎందుకు పాపం చెయ్యకూడదో తెలుసుకోవాలి. ఎందుకు పుణ్యం చెయ్యాలో తెలుసుకోవాలి. అప్పుడే

మానవ జీవితం తాను అనుకున్నట్టు వుంటుంది.  అంతే తప్ప ఎన్ని పూజలు చేసినా, ప్రార్ధనలు చేసినా, నమాజులు, భజనలు చేసినా ప్రయోజనం ఉండదు. అందుచేత ముఖ్యంగా మానవుడు ఆలోచించ వలసింది 'పాప, పుణ్యాల' గురించే కాని, ధన సంపాదన గురించి కాదు. ధనం ఎంత సంపాదించినా దుఃఖం పోదు. అందుచేత 'ధనమే ప్రధానం కాదని' తెలుసుకోవాలి.

ఒక చిన్న వస్తువు కొనటానికి ఎంతో ఆలోచిస్తాం. ఎన్నో షాపులు తిరిగి, నాణ్యతను పరిశీలించి మాత్రమే కొంటాం. మరి కర్మలు చేసేటపుడు ఎందుకు ఆలోచించం? అలా ఆలోచించకుండా కర్మలు చేస్తే దుఃఖం పొందమా?

పాప, పుణ్యాలు అంటే మానవుడు చేసే మంచి, చెడు పనులు. వాటినే కర్మలు అని కూడా అంటారు. చెడు పనులను పాపాలు, మంచి పనులను పుణ్యాలు అంటారు. చెడు పనులంటే ఇతరులకు హాని, కష్టం, నష్టం కలిగించేవి. మంచి పనులంటే ఇతరులకు లాభం, సుఖం, ఆనందం కలిగించేవి.

మరి చెడు ఎందుకు పాపం? మంచి ఎందుకు పుణ్యం ?

ఇతరులు, ఇతర ప్రాణులు అని అనుకుంటాం కానీ అవి కూడా మనం ఇష్టపడే, మనం ప్రార్థించే, మనం పూజించే, మనం అర్థించే భగవంతుడే అని తెలుసుకోవాలి.

అన్నమాచార్యుల వారు "బ్రహ్మమొక్కటే! పరబ్రహ్మమొక్కటే! అని అన్నారు కదా! ఆయన ఇంకా కందువగు హీనాధికము లెందులేవు! అందరికీ శ్రీ హరే అంతరాత్మ! అని కూడా అన్నారు. అంటే చూద్దామంటే సృష్టిలో హీనమైనవి, అధికమైనవి లేనేలేవు. అంటే అన్నీ సమానమే, అన్నీ ఒక్కటే. కారణం అందరికీ శ్రీహరి అంటే భగవంతుడే అంతరాత్మ అని స్పష్టంగా చెప్పారు. అంటే సమస్త జీవులలో, జంతువులలో ప్రాణులలో, మానవులలో వున్న అంతరాత్మే భగవంతుడు అంటే శ్రీహరి అని స్పష్టంగా చెప్పారు.

మరి భగవంతుడు సర్వవ్యాపి, సర్వాంతర్యామి కదా! అటువంటి భగవంతుని హింసించడమే పాపం. ఆయనను ఆనందపరచడమే పుణ్యం. అందుచేత భగవంతుణ్ణి ఆనందపరిచే పనులు పుణ్యాన్ని, ఆయన్ను బాధించే పనులు పాపాన్ని కలుగచేస్తాయని తెలుసుకోవాలి.

కారణం మనల్ని అనుగ్రహించవలసింది ఆయనే కాబట్టి. అందుచేత

ఆయన అనుగ్రహం కావాలంటే ఆయన్ను ఆనందపరచాలి. ఆయన్ను ఆనంద పరిస్తే ఆయన మనల్ని ఆనందపరుస్తాడు. ఆయన్ను హింసిస్తే ఆయన విధించే శిక్ష అనుభవించాల్సి వస్తుంది. అందుచేత పాప, పుణ్యాల విషయంలో మన వివేకం ఉపయోగించాలి. మనం చేసే కర్మలు ఆలోచించి చెయ్యాలి. ముందు అసలు భగవంతుడెవరో తెలుసుకోవాలి. ఆయన్ను ఏ పనులు ఆనంద పరుస్తాయో తెలుసుకోవాలి. అవి తెలుసుకోకుండా, అసలు భగవంతుడెవరో తెలుసుకోకుండా ఆయన్ను ఎలా ఆనందపరుస్తాం? ఏ పనులు ఆయన్ని ఆనంద పరుస్తాయో ఎలా తెలుస్తుంది?

అసలు భగవంతుని గురించి మానవులు తెలుసుకోగలిగితే వారు ఇన్ని పాపాలు చెయ్యరు. ఇన్ని కష్టాలు పడరు. ఏం చెయ్యాలో తెలుసుకోగలుగుతారు. ఎలా జీవించాలో అలాగే జీవిస్తారు. కారణం ఆయన సమస్త మానవులలో, జంతువులలో అంతర్యామిగా ఆత్మ రూపంలో వున్నాడు. అందుకే ఆయనను సర్వాంతర్యామి అంటారు. సర్వులలో అంతర్యామిగా వున్న ఆయనను ఆనందపరచాలంటే అందరినీ గౌరవించాలి. అన్నిటికీ సేవ చెయ్యాలి. ధ్యానం ద్వారా ఆత్మ మీద అంటే భగవంతుని మీద దృష్టి వుంచాలి.

ధ్యానం చేసే కొద్దీ భగవంతుడెవరో తెలుసుకుంటాం. పాపాలు చెయ్యం. మంచి పనులే చేస్తాం. పాపకర్మలు రహితం చేసుకుంటాం. దుఃఖం నుంచి బయటపడతాం.

**" దేని పట్ల శ్రద్ధ ఉంటే అలాంటి జ్ఞానం వస్తుంది "**

**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "కోరికల వల్ల నష్టం!"

మనం కోరికలు నెరవేర్చుకోవటానికి కర్మ చేస్తాం. కర్మ చేసిన తరువాత, దాని ఫలితం కోసం అంటే కోరిక తీరిందా? లేదా? అని చూస్తాం. తీరితే తాత్కాలికమైన అల్ప సంతోషం పొందుతాం. తీరకపోతే దుఃఖం పొందుతాం. ఆలోచిస్తే అసలు ఎన్ని కోరికలు తీరుతున్నాయి? చాలా స్వల్పమే కదా? అంటే కోరికలు దుఃఖానికి దారి తీస్తుందని అర్థం చేసుకోవచ్చు. అంటే తీరని కోరికలన్నీ దుఃఖాన్ని కలిగించేవే కదా?

కోరిక వుంటేనే కదా పనిచేసేది అని కొంతమంది అంటారు. "కోరికతో పని చెయ్యాలి, కానీ పని పూర్తి అయిన తరువాత దానిని మర్చిపోవాలి". లేకపోతే పనిచెయ్యటానికి ఎంత శక్తి ఖర్చు పెడతామో, మన చేతులో లేని ఫలితం కోసం అంతకన్నా ఎక్కువ ఆలోచనా శక్తిని ఖర్చు పెట్టవలసివస్తుంది.

ఆలోచనా శక్తిని వృధా చేయకూడదు. అనారోగ్యాలకు అదే మూలం. ఫలితం గురించి మనం ఆలోచించినా, ఆలోచించకపోయినా వచ్చే ఫలితం వస్తుంది, లేనిది రాదు. దాని కోసం ఖర్చు చేసే ఆ శక్తిని ఇంకొక మంచి కార్యానికి వినియోగించవచ్చు. ఎందుచేతనంటే ఫలితం మన చేతిలో లేదు కనుక. ఎంతసేపూ మనం చేయగలిగింది పని చెయ్యడమే. అందుచేత మన శక్తి పని మీద వుంచాలి. ఏ పనిచెయ్యాలి? ఎలాంటి పని చెయ్యాలి? ఎంత చెయ్యాలి? అన్న దాని మీద శక్తి ఖర్చు పెట్టాలి.

కోరికల వల్ల అంతా నష్టమే. అందుకే కోరికలు కోరకూడదు. 'నిష్కామ కర్మే' చెయ్యాలి. మరి కోరేది ఎవరు? ఎందుకు కోరుతున్నాం? కోరేది మనస్సు, ఆలోచించేది మనస్సు. తద్వారా శక్తిని హరింపచేసేది మనస్సు. అలాంటి మనస్సును ధ్యానం ద్వారా అదుపులో వుంచుకోవాలి. కోరికలకు మూలమైన మనస్సు అదుపులో వుంటే కోరికలు కూడా అదుపులో వుంటాయి. కోరికలు అదుపులో వుంటే! దుఃఖమే వుండదు, శక్తిని కోల్పోము. ఆ శక్తిని ఇంకొక మంచి కార్యానికి వినియోగిస్తాం. భవిష్యత్తులో లాభం పొందుతాం.

**"భూమి మీద భగవంతుడు మానవుల అవసరాలకు సరిపడా వుంచాడు కానీ, కోరికలకు సరిపడా వుంచలేదు"**

మించి ఆశించడం అంటే కోరడం అసమంజసం. ఒకరి కోరిక తప్పనిసరిగా ఇంకొకరికి కష్టాన్ని కలిగిస్తుంది. ఒకరి లాభం ఇంకొకరికి నష్టాన్ని కలిగించినట్టే. సృష్టిలో ఒకరు నష్టపోకుండా ఇంకొకరు లాభపడలేరు. అందుచేత లాభ పడాలనుకోవడం, కోరికలు కోరడం ఇంకొకళ్ళను నష్టపరచడమే, ఇంకొకళ్ళను కష్టాలు పాలు చెయ్యడమే.

**'ఒకరి వినోదం ఇంకొకరి విషాదం కాకూడదు'. ఇంకొకరికి విషాదం కలిగించకుండా వినోదించాలి. ఇంకొకరి 'విషాదంతో వినోదించడం అధర్మం'.**

ఒక టేబుల్‌పై 100 చాక్లెట్లు ఉంచబడ్డాయి. అక్కడ వందమంది వున్నారు. అందరినీ తలా ఒకటి తీసుకోమంటే, కొందరు 2, కొందరు 5 చొప్పున తీసుకుంటే తప్పనిసరిగా కొంతమందికి లేకుండా పోతాయి. అంటే ఇతరులవి మనం తీసుకున్నామన్న మాట. ఇతరులకు లేకుండా చేశామన్నమాట. ఇది అన్యాయం, అక్రమం, అధర్మం. ఇదే విధంగా మనం భూమి మీద ప్రవర్తిస్తున్నాం. ఇంకొకరిది ఆశిస్తున్నాం. భగవంతుడు ఇంకొకరికి కేటాయించింది కోరుతున్నాం.

అందుచేత భూమి మీద ఎవరు ఎంత ఎక్కువ పోగుచేస్తారో వారు అంత ఇతరులకు లేకుండా చేసిన వారే. అందుచేత వుందని మురిసిపోయేవారు, గర్వించేవారు ఇతరులు లేమికి కారకులయ్యారని తెలుసుకోవాలి.

అందుకే రమణమహర్షి, రామకృష్ణ పరమహంస లాంటి యోగులు అవసరాలకే పరిమితమయ్యారు. అవసరాలకు మించి కొద్దిగా కూడా ఆశించలేదు. కానీ భోగులైన సామాన్య మానవులు అవసరాలకు మించి ఆశిస్తారు. కోరతారు. కోరికలు తీర్చుకోవడానికి తప్పులు చేస్తారు, పాపాలు చేస్తారు, అధర్మంగా ప్రవర్తిస్తారు. ఇది సృష్టి ధర్మానికి విరుద్ధం కాబట్టి వారు  కష్టాల పాలవుతారు. అందుచేత కోరికలు కోరవద్దు. కోరికలకు బానిస కావద్దు.

ఒకవేళ ఎవరికైనా అవసరానికి మించి ఇవ్వబడినా అది అందరిదీ అని తెలుసుకోవాలి. అందుచేత తమ దగ్గర వున్నవి అందరికీ పంచాలి. అందరికీ ఇవ్వాలి. ఇది కూడా సృష్టిధర్మమే. ఇది అతిక్రమించి దాచుకుంటే ఎవరైనా చివరకు కోల్పోవలసిందే. ఈ ధర్మాన్ని గుర్తించి పంచితే, వారు పై లోకాలలో నే కాదు భూలోకంలో కూడా పెంచబడతారు. ధ్యానం చేస్తే ఎవరైనా ఇలాంటి ధర్మాలు తెలుసు కోగలరు. ఆచరించగలరు. అంతేకాదు కోరికలు అదుపులో వుంచుకోగలరు.



# "కోరిక- కృషి!"

లోకంలో ఎవరిని చూసినా కోరడానికే అలవాడు పడ్డారు, ఎక్కడ చూసినా కోరికలు కోరేవారే కనిపిస్తారు, కాని కృషి చేసేవారు చాలా తక్కువ. ఏది కావాలనుకున్నా వెంటనే తమకు ఇష్టమైన దేవుళ్ళను కోరుతుంటారు.

అలా కొంతమంది పూజ చేసి కోరితే, ఇంకొంతమంది ప్రార్థన చేసి కోరతారు. మరికొంతమంది నమాజు చేసి కోరతారు. మరి కొంతమంది భజన చేసి కోరతారు. ఇలా ఎక్కడ చూసినా కోరడం కనిపిస్తుంది కాని, కృషి కనిపించదు. ఏ చిన్న అవసరం వచ్చినా, ఏ చిన్న కష్టం వచ్చినా, వెంటనే దేవుళ్ళని కోరడం అందరికీ అలవాటైపోయింది. దీనికి ముఖ్యకారణం 'కోరడం తేలిక – కృషి చేయడం కష్టం'. మానవుడు ఎప్పుడూ తేలికైన మార్గాలు వెతుకుతూ వుంటాడు.

గమనిస్తే కోరడం తేలికే, కాని భగవంతుని సృష్టిలో కోరుకున్నంత మాత్రాన ఏదీ లభించదు. ఎవరికైనా కృషి చేస్తేనే ఏదైనా లభిస్తుంది. అందుకే **"చేసుకున్నవాడికి చేసుకున్నంత మహాదేవ!" అన్నారు. అంతే కాని "కోరుకున్న వాడికి కోరుకున్నంత మహాదేవ!"** అనలేదు. కాని మానవుడు ఇది అర్థం చేసుకోకుండా కృషి చేయడానికంటే కోరుకోవడానికే ప్రాముఖ్యం ఇస్తున్నాడు. ప్రపంచంలో ఇది ఎందుకు అలవాటయ్యిందో అర్థం కాదు.

కొంచెం మన వివేకం ఉపయోగించి ఆలోచిస్తే ఈ విషయం అర్థమవుతుంది. ఒక ఉదాహరణ చూద్దాం. ఒకడు రోజూ పూజ చేసి, నేను పరీక్ష ఫస్టులో పాస్ కావాలని కోరుతూ వుంటాడు. కాని చదవడు, చదవటానికి కృషి చెయ్యడు. మరొకడు చదువుతాడు అంటే కృషి చేస్తాడు. కాని పూజ చెయ్యడు. ఇద్దరిలో ఎవరు పాస్ అవుతారు? అని ప్రశ్నిస్తే కృషి చేసినవాడే పాసవుతాడని ఖచ్చితంగా చెపుతాం.

అలాగే సంగీతం రావాలని కోరుతూ ప్రార్థన చేసే వాడికి సంగీతం వస్తుందా? రోజూ సంగీత సాధన చేస్తూ కృషి చేసే వాడికి సంగీతం వస్తుందా? అంటే ఖచ్చితంగా కృషి చేసిన వాడికే సంగీతం వస్తుందని మనమే చెపుతాం.

అలాగే క్రికెట్ ఛాంపియన్ కావాలని పూజ, ప్రార్థన చేసి కోరేవాడు

ఛాంపియన్ అవుతాడా? ప్రతీరోజు కష్టపడి ప్రాక్టీస్ చేసేవాడు ఛాంపియన్ అవుతాడా? అంటే ఖచ్చితంగా కృషి చేసేవాడే అని చెపుతాం.

అలాగే ఒక నది దాటాలన్నా, ఒక పెద్ద కొండ ఎక్కాలన్నా అక్కడ ఒక ఫోటో పెట్టి పూజ చేసి ఆ నదిని దాటించు! ఆ కొండ ఎక్కించు! అని ఎన్నాళ్ళు కోరినా ఆ నదిని దాటడం కాని, కొండను ఎక్కడం కాని జరుగదు. కాని ప్రయత్నం చేస్తే ఖచ్చితంగా సాధించగలం.

వీటిని బట్టి **"కోరిక కాదు కృషే ముఖ్యమని", అలాగే "పూజ కాదు ప్రయత్నమే ముఖ్యమని", అలాగే "ప్రార్ధన కాదు సాధనే ప్రధానమని"** అర్ధం చేసుకోవాలి. కృషి చెయ్యటానికి ప్రాముఖ్యం ఇవ్వాలి. అందుకే **"కృషి వుంటే మనుషులు ఋషులవుతారు"** అంటారు. ఏదైనా లోకంలో కష్టపడిన వారికే ఫలితం దక్కుతుంది. అందుకే **"కష్టేఫలి"** అన్నారు. అంతేకాని కష్టపడకుండా, కృషి చెయ్యకుండా పూజిస్తూ, ప్రార్థిస్తూ, నమాజులు చేస్తూ కూర్చుంటే ప్రయోజనం లేదని తెలుసుకోవాలి.

ఇదే విషయాన్ని భగవద్గీతలో కృష్ణ భగవానుడు కూడా తెలియచేసారు. ఆయన **'నిష్కామకర్మ'** చెయ్యమన్నారు. అంటే ఏ పని చేసినా ప్రతిఫలం ఆశించవద్దన్నారు. అంటే కోరవద్దనేగా అర్థం. అంటే కృషి చెయ్యమనే కాని కోరమని ఆయన చెప్పలేదు.

ఆయన ఇంకా **'కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచనా!'** అన్నారు. అంటే కర్మ చెయ్యటానికే నీకు అధికారం వుంది కాని, ఫలితం ఆశించటానికి నీకు అధికారం లేదు! అని స్పష్టంగా చెప్పారు. అంటే నీకు కోరే అధికారం లేదు అని స్పష్టంగా చెప్పారు. అందరూ శ్రీకృష్ణుడు గొప్పవాడని పూజిస్తారు, ఆరాధిస్తారు కాని ఆయన చెప్పింది అర్థం చేసుకోరు. ఆచరించరు. కోరవద్దంటే కోరికల కోసమే పూజలు చేస్తారు. మరి ఆయన వద్దన్నది చేస్తే కోరికలు ఎలా నెరవేరతాయి?

కాని భగవంతుని గురించి భగవంతుని సృష్టి గురించి తెలుసుకుంటే ఇది అర్థమవుతుంది. ఎందుచేతనంటే భగవంతుడు ఈ సృష్టిలో ఒక ఏర్పాటు చేసాడు. అదేమిటంటే! ఆయన ఈ సృష్టిలో అన్నీ వుంచాడు, లేనిదంటూ ఏమీ లేదు. కాని వాటిని పొందాలంటే ఎవరైనా సరే 'కృషి' చెయ్యాలి. అదే ఆయన

చేసిన ఏర్పాటు. కోరితే పొందే ఏర్పాటు ఆయన చేయలేదు. ఆయన ప్రత్యేకించి పూజ ఎవరు చేస్తున్నారు.? ప్రార్థన ఎవరు చేస్తున్నారు? నమాజు ఎవరు చేస్తున్నారు? వీడు కొబ్బరికాయ ఇచ్చాడా? అరటిపళ్ళు ఇచ్చాడా? కొబ్బరికాయకు ఏమి ఇవ్వాలి? అరటిపళ్ళకు ఏమి ఇవ్వాలి? అని చూసి 'శాంక్షన్' చేయడు. ఆ అవసరం లేకుండా ప్రకృతిలో అన్ని ఏర్పాట్లు ఆయన చేసాడు. ఆ ఏర్పాటు ఏమిటంటే, **"ఎవరు ఏది చేసుకుంటే అది పొందే ఏర్పాటు"** అంటే **"చేసుకున్న వాడికి చేసుకున్నంత!"**. అంటే **"మంచి చేసుకున్న వాడికి మంచి, చెడు చేసుకున్నవాడికి చెడు"** జరిగే ఏర్పాటు వుంది. **"ఎవరు ఏది చేసుకుంటే అది, ఎంత చేసుకుంటే అంత, ఎలాంటిది చేసుకుంటే అలాంటిది"** పొందే ఏర్పాటు మాత్రమే భగవంతుని సృష్టిలో వుంది.

అంటే కష్టం కలిగిస్తే కష్టం, నష్టం కలిగిస్తే నష్టం, హింస చేస్తే హింస, అలాగే ఆనందం కలిగిస్తే ఆనందం, శాంతి కలిగిస్తే శాంతి , లాభం కలిగిస్తే లాభం కలిగే ఏర్పాటు వుంది. అంటే జీవితంలో **మనకి ఏది కావాలో అది చెయ్యాలి. ఏది అక్కరలేదో అది చెయ్యకూడదు.** అంతేకాదు ఒకటి చేసి, ఇంకోటి రమ్మన్నా రాదు. కొంచెం చేసి ఎక్కువ కావాలన్నా రాదు. మనం **'ఏ విత్తనం నాటితే ఆ పండే కోసుకుంటాం'** కదా? అందుచేత అర్థం చేసువాలి **"కోరితే రాదు, కృషి చేస్తేనే వస్తుంది"** అని అర్థం చేసుకోవాలి. ఈ కృషి అన్నది ప్రస్తుతమైనా చేసుకోవాలి. లేక గత జన్మలలోనైనా చేసుకోవాలి. అలా గత జన్మలలో కానీ, గతంలో కానీ చేసుకున్న దానినే మనం 'అదృష్టం' అని కూడా అంటాం. కారణం ఆ కృషి మనకు కనబడదు కనుక. దీనినే ఇంకా కొంతమంది 'దేవుని దయ' అని కూడా అంటారు.

భగవంతుడు చేసిన ఏర్పాటు ఎలాంటిదంటే మానవుడు ఏర్పాటు చేసిన బ్యాంకు **A.T.M.** లాంటిది. **A.T.M.** చూడండి అక్కడ బ్యాంకు మేనేజరు కాని, క్లర్కు గానీ, క్యాషియరు కాని వుండరు. కాని ఎవరైనా 24 గంటలలో ఎప్పుడు వెళ్ళినా, కార్డు వుంచితే అర్హతను బట్టి డబ్బు తెచ్చుకోవచ్చు. అక్కడ కూడా గతంలో మనం వేసుకున్న అర్హతను బట్టే వస్తుంది అంటే రూ.5000లు వేసుకుంటే రూ.5,000/- మాత్రమే వస్తుంది. దానికి మించి రూ.1/- కూడా రాదు. అంటే 5001/- రాదు. బ్యాంకులో వేసు కోకుండా, అర్హత లేకుండా మీరు వెళ్లి

A.T.M.ను పూజించినా, ప్రార్థించినా, ఒక్క రూపాయి కూడా బయటకు రాదు. కొబ్బరికాయ కొట్టినా, అరటి పళ్ళు ఇచ్చినా, మా కష్టాలు తీర్చమని దీనంగా మొర పెట్టుకున్నా ప్రయోజనం ఉండదు. ఇది మీరు ప్రయత్నించి చూస్తే తెలుస్తుంది.

ఇక్కడ కొంచెం ఆలోచించండి. ఎవ్వరూ లేకుండా ఏ సమయంలో వెళ్ళినా అర్హతను బట్టి పొందే ఏర్పాటు మానవుడే చెయ్యగలిగినపుడు, అనంత శక్తి స్వరూపుడైన ఆ భగవంతుడు, సృష్టిలో అలాంటి ఏర్పాటు అంటే ఎవరు ఏది చేసుకుంటే అది పొందే ఏర్పాటు చెయ్యలేడా? ఖచ్చితంగా చెయ్యగలడు. కాని మనమే ఇది అర్థం చేసుకోలేకపోతున్నాం. కృషి చేయకుండా అర్హత సంపాదించకుండా కోరుతున్నాం. కాని కోరితే పొందే ఏర్పాటు సృష్టిలో లేదు. అందుకే పూజించినా, ప్రార్థించినా, నమాజు చేసినా, భజనలు చేసినా, మొక్కులు చెల్లించినా ఎవరికి ఏమీ లభించటం లేదు. ఒక వేళ ఎవరికైనా ఏమైనా సిద్ధించినా, అది వారు గతంలో కాని గత జన్మలలో కాని చేసుకున్నదే. అందుచేత తెలుసుకోండి **"మానవుడి A.T.M. నుండి రావాలంటే 'వేసుకోవాలి' ".** అలాగే **"భగవంతుని సృష్టినుండి రావాలంటే 'చేసుకోవాలి' ".**

మానవుడు ఏర్పాటు చేసింది బుల్లి A.T.M. అయితే, భగవంతుడు ఏర్పాటు చేసింది మానవుడు వూహించలేనంత అతి పెద్ద A.T.M. అందుచేత ప్రతి ఒక్కరూ తెలుసుకోండి **'పూజ చేయడం కాదు ప్రయత్నం చెయ్యాలి'. 'ప్రార్థన చేయడం కాదు సాధన చెయ్యాలి'. 'కోరడం కాదు కృషి చెయ్యాలి'.** అప్పుడే మానవుడు ఏదైనా సాధించగలడు. మరి కృషి అంటే ఏమి చెయ్యాలి?

ఒకరకంగా పూజ అన్నా, ప్రార్థన అన్నా కోరడమే. కాని 'ధ్యాన సాధన' చెయ్యడమంటే కష్టపడి కృషి చెయ్యడం. అందుచేత కష్టపడి 'ధ్యాన సాధన' చెయ్యండి. అర్హత సంపాదించుకోండి. కోరకుండానే అన్నీ పొందండి. ఆనందంగా జీవించండి.

**" తనకు లేకపోయినా ప్రక్కవాళ్ళకు సాయం చేయడమే సాహసం !"**

**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "భోగము కాదు యోగము ముఖ్యం!"

ఇహంలో పొందే తాత్కాలిక ఆనందాన్ని 'భోగము' అంటారు. కానీ పరంలో పొందే శాశ్వత ఆనందాన్ని 'యోగము' అంటారు. భోగం క్షణికమైనది, కానీ యోగము శాశ్వతమైనది. భోగాలు ఎన్ని అనుభవించినా యోగానికి సరికావు. భోగి గొప్పవాడు కాదు. యోగే గొప్పవాడు. శ్రీ కృష్ణ భగవానుడు కూడా అర్జునుని యోగి అవ్వమనే చెప్పాడు కానీ, భోగి అవ్వమని చెప్పలేదు. అందుచేత తనకున్న భోగాలు చూసి మురిసిపోయే వాడు మూర్ఖుడు. యోగి కావడానికి ప్రయత్నించే వాడే విజ్ఞుడు.

భోగాలు అనేక రకాలు. ధనధాన్యాలు పుష్కళంగా వుంటే భోగము. పాడి, పంట పుష్కలంగా వున్నా, ఐశ్వర్యం, సుఖాలు వున్నా భోగమే. మంచి ఉద్యోగం, మంచి వ్యాపారం ఉన్నా భోగమే. పదవులు, పేరు ప్రఖ్యాతులు వున్నా భోగమే. ప్రశంసలు, సన్మానాలు భోగమే. గౌరవమర్యాదలు, కీర్తి ప్రతిష్ఠలు భోగమే. సంసారం, భార్యాపుత్రులు భోగమే. ఆరోగ్యమున్నా భోగమే. పదవులు అంటే తాను ఏ రంగంలో నాయకుడుగా వున్నా భోగమే. అందరూ తన మాటను, తనను గౌరవించినా భోగమే. స్త్రీ, పురుషుల పొందు భోగమే. ఇలా ఇహంలో ఏది పొందినా భోగమే. ఇలాంటి ఇహలోక భోగాలు సుఖాన్ని కలిగిస్తాయి. కానీ అవి తాత్కాలికం. అవి అనుభవిస్తున్నంతసేపే కానీ, తరువాత ఆ ఆనందం అదృశ్యమైపోతుంది. అలాంటి భోగం మరల మరల అనుభవిం చాలని వుంటుంది. అలా జీవితాంతం అనుభవించాలని వుంటుంది. అలా ఎన్ని జన్మలెత్తినా అంతం వుండదు. ఇంకా, ఇంకా అని, అనిపిస్తూనే వుంటుంది.

అలాంటి భోగాలకు దాసుడైనవాడు ఆ భోగాలు దూరమయితే తట్టుకోలేడు. ఉండలేడు. వాటినే మరల, మరల కోరుకుంటాడు. వాటి కోసం ప్రయత్నాలు చేస్తూ వుంటాడు. అటువంటి ప్రయత్నంలో ధర్మాన్ని తప్పుతాడు. నీతి తప్పి ప్రవర్తిస్తాడు. సత్యాన్ని గుర్తించడు. చివరకు పతనమవుతాడు. దుఃఖితుడవుతాడు. అందుచేత "భోగము కంటే యోగము" ముఖ్యమని తెలుసుకోవాలి. యోగి కావటానికి ప్రయత్నించాలి.

మరి 'యోగంలో' పురోగతి సాధించాలంటే కొన్ని విషయాలలో జాగ్రత్త వహించాలి. ముఖ్యంగా భోగలాలసులు యోగంలో పురోగతి సాధించలేరు. ఒకవేళ ఎవరైనా యోగంలో పురోగతి సాధించగలిగినా భోగాపేక్ష వల్ల మరల పతనమవుతారు. అందుచేత యోగమార్గంలో పురోగతి కోరుకునేవారు. ముఖ్యంగా మూడింటి విషయంలో జాగ్రత్త వహించాలి. అవేమిటంటే "కీర్తి, కాంత, కనకం" వీటి విషయంలో, అంటే ఈ మూడు భోగాల విషయంలో జాగ్రత్త వహించకపోతే ఎలాంటివారైనా, అంటే యోగమార్గంలో ఎంత ఉన్నత స్థితికి ఎదిగినా, వాటికి

బానిసై పతనమవుతారు. యోగ సామ్రాజ్యాన్ని చేరుకోలేరు. శాశ్వతానందాన్ని పొందలేరు.

ముఖ్యంగా చాలా మంది ధనం విషయంలో ఆకర్షితులవుతారు. ధనం విషయంలో తమకు తెలియకుండానే ప్రలోభాలకు లోనై తప్పులు చేస్తారు. తమ యోగ మార్గానికి తూట్లు పెట్టుకుంటారు. చివరకు పతన మవుతారు. ఒకవేళ ఎవరైనా ధనం విషయంలో అధిగమించగలిగినా, స్త్రీ భోగంలో చిక్కుకుంటారు. తమ బలహీనతలు అధిగమించలేకపోతారు. వారికి ఆకర్షితులై కొన్ని తప్పులు చేస్తారు. ఇలాంటి వారు యోగ మార్గంలో ఎంత పురోగతి సాధించినా ఎలాంటి వారైనా చివరకు పతనమవుతారు. మొదటికే వస్తారు. అలా పతనమయ్యామన్న సంగతి కూడా వారికి తెలియదు. గుర్తించలేరు.

పై రెండింటినీ అధిగమించగలిగినా చివరిగా కీర్తి అనే భోగానికి ఎటువంటి వారైనా దాసులవుతారు. అంటే అందరిచేతా ప్రశంసలు పొందాలని, సన్మానాలు చేయించుకోవాలని, అందరిలో ఉన్నత ఆసనం పొందాలని, అందరి చేతా పాదాభివందనాలు పొందాలని. అందరికంటే ఆధిక్యత కలిగి వుండాలని అనుకుంటారు. ఇంకా అందరి పూజలు కూడా అందుకోవాలని భావించే వారు కూడా వున్నారు. దీని కోసం వారు సత్యాన్ని మరుస్తారు, ధర్మాన్ని తప్పుతారు. ఎంతసేపూ ఇతరుల ప్రశంసల కోసం వారికి నచ్చేటట్టు ప్రసంగాలు చేస్తారు. సత్యాన్ని దాస్తారు. అధర్మాన్ని ఖండించరు. ఎంతసేపూ వినే వారికి నచ్చేటట్టు, వారు మెచ్చేటట్టు చెప్తారు. అలాంటి పనులే చేస్తారు. అంతేకానీ ధైర్యంగా సత్యాన్ని బోధించి వారిలో మార్పు తీసుకు రావడానికి, వారిని సత్యమార్గంలో నడిపించడానికి ప్రయత్నించరు.

వారికి నచ్చే మార్గమే బోధిస్తూ, తన కీర్తి భోగాన్ని అనుభవిస్తూ వుంటారు. ఎంత ఎక్కువ మందిలో తనకు కీర్తి వస్తుందా? అని ఎదురు చూస్తారు. అంతే కానీ ఎంత ఎక్కువ మందిని సత్యమార్గంలోకి, ధర్మమార్గంలోకి నడిపించగలిగానా? అని ఆలోచించరు. ఇతరులు ఏమై పోయినా సరే తన భోగమే చూసుకుంటారు. ఆ శిష్యుల, భక్తుల సేవలు పొందుతూ ఆ భోగం అనుభవిస్తూ మురిసిపోతూ వుంటారు. వారందరికంటే తానే అధికుడనని పొంగిపోతూ లోలోన గర్విస్తూ వుంటారు. చివరకు అహంకార పూరితులు అవుతారు. యోగమార్గంలో ఎంత ఎత్తుకు ఎదిగినా చివరకు పతనమవుతారు. అధోగతి పాలవుతారు. నష్టపోతారు.

ఎవరైనా గ్రహించవలసింది, తెలుసుకోవలసింది, **"తాత్కాలిక భోగాలు కాదు. శాశ్వత యోగం".** 'యోగమే' గొప్పది. అందుచేత పొగడ్తలు, ప్రశంసలు కోసం చూడకూడదు. ధనానికి దాసులు కాకూడదు, స్త్రీ, పురుషుల వ్యామోహం లో పడకూడదు. 'యోగాన్ని' ఆశ్రయించాలి. 'యోగులు' కావాలి. దానికి ముఖ్యంగా ధ్యానం, స్వాధ్యాయం, సజ్జన సాంగత్యం అవసరం. వీటి ద్వారానే సాధించాలి. ఆచార్య సాంగత్యం కూడా చెయ్యాలి. ధ్యాన మార్గంలో బాగా కృషి చెయ్యాలి. ధ్యానాన్ని వదలకూడదు.

# "మానవుడు తెలివైనవాడా?"

సహజంగా తాను సాధించిన విజయాలు, తాను కనిపెట్టిన వాటిని చూసి మానవుడు తాను తెలివైన వాడినని భావిస్తాడు. అంతేకాదు. 84 లక్షల జీవులలో తానే అన్నిటికన్నా మిన్న అని, ఏ జీవులు సాధించలేనివి తాను సాధించగలుగుతున్నానని భావిస్తాడు. ఎన్నెన్నో కనిపెడుతూ, ఎన్నో గ్రహాలకు చేరుకుంటూ తన మేధస్సు అమోఘమని పొంగిపోతూ వుంటాడు. అలా సామాన్యుల నుంచి సైంటిస్టుల వరకు ప్రతీ ఒక్కరూ ఏదో ఒకటి సాధించి నేను తెలివైన వాడినని మురిసిపోతూ వుంటారు.

కానీ ఇన్ని సాధిస్తున్నా మానవులు సృష్టిలో ఏది శాశ్వతం? ఏది అశాశ్వతమో తెలుసుకోలేకపోతున్నారు. ఏది ఉండేదో? ఏది ఉండనిదో? తెలుసుకోలేకపోతున్నారు. అన్నీ ఉన్నట్టుగా కనిపిస్తున్నాయి. చివరకు అన్నీ అదృశ్యమయిపోయేవే అని, ఆఖరికి తాము కూడా అదృశ్యమై పోయేవారమని తెలుసుకోలేకపోతున్నారు. అంతా మాయే అని గ్రహించలేక పోతున్నారు. మరి ఇవన్నీ గ్రహించలేని మానవుడు తెలివైన వాడు ఎలా అవుతాడు?

మానవుని తెలివి మాయను అధిగమించలేకపోతుంది. పైగా తెలివైన వాడినని విర్రవీగుతూ వుంటాడు. ఎంత విచిత్రం. అసలు సత్యం తెలుసుకోలేని వాడు, మాయే గొప్పదని భావించేవాడు, తెలివైన వాడు ఎలా అవుతాడు? ఉండనివన్నీ పోగేసుకుని గర్వించేవాడు, మాయమైపోయేవన్నీ చూసి మురిసి పోయేవాడు తెలివైనవాడు ఎలా అవుతాడు? అదృశ్యమయ్యే వాటి కోసం తాపత్రయపడేవాడు, వాటి కోసం జీవితాన్నంతా వృథా చేసుకునేవాడు, అవి పొందలేకపోయానని, సంపాదించలేకపోయానని బాధపడేవాడు తెలివైనవాడు ఎలా అవుతాడు? అది తెలివి ఎలా అవుతుంది?

అందుచేత "ఉన్నది ఉన్నట్లుగా, లేనిది లేనట్లుగా భావించగలిగే వాడే తెలివైనవాడు". అంతే కాని "లేనిది ఉన్నట్లుగా, ఉన్నది లేనట్లుగా భావించేవాడు తెలివైన వాడు కాదు". ధ్యానం చేసే యోగులే ఈ సత్యాన్ని తెలుసుకోగలరు. నిజానికి వారే తెలివైన వారు. వారు ఉండేదానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తారు. ఉండని వాటికి తక్కువ ప్రాముఖ్యం ఇస్తారు. వారు 'ధ్యానం' చేసి ఉండే దానిని సంపాదించుకొని జీవితాన్ని ధన్యం చేసుకుంటారు. అందుచేత ధ్యానం చేసి మీ జీవితాన్ని ధన్యం చేసుకోండి. మీ తెలివిని ప్రదర్శించండి.

# "పేరు నువ్వా?"

నువ్వు ఎవరు? అంటే అంతా పేరు చెబుతారు. అలాగే పేరు పెట్టి తిడితే బాధపడతారు. పేరుతో పొగిడినా, పేరు పేపర్లో పడినా పొంగిపోతారు. అలా తనకున్న పేరునే తానని అంతా భావిస్తారు. అసలు పేరు తానా? ఆలోచించండి.

తాను పుట్టాడు. తరువాత పేరు పెట్టబడింది. అంటే పేరు పెట్టిందే కానీ పుట్టింది కాదు. పుట్టింది నువ్వు. పేరు తల్లిదండ్రులు పెట్టారు. అంటే పేరు నువ్వు కాదు కదా? కానీ పేరే నువ్వనుకుంటున్నావు. మరి నువ్వు కాని ఆ పెట్టిన పేరుకు ఎందుకు అంత ప్రాముఖ్యం ఇస్తావు? నువ్వు కాని ఆ పేరుకి, పేరు కోసం ఎందుకు తాపత్రయం? ఎందుకు ఆరాటం ?

పోనీ అది నీ శాశ్వతమైన పేరా? అది ఈ జన్మలో నీకు పెట్టబడింది. ఈ జన్మలో ఆ పేరు వుంటే, మరో జన్మలో ఇంకోపేరు. ఏ పేరు నీది? ఒక జన్మలో పేరుకు ప్రశంసలు వస్తే, ఇంకొక జన్మలో పేరుకు విమర్శలు, అవమానాలు వస్తాయి. ఏవి నీవనకుంటావు? ఏవీ నీవి కావు. అందుచేత పేరు గురించి ఆలోచించద్దు. నీ గురించి ఆలోచించు. నిన్ను మరిచావు. నువ్వు ఎవరో తెలుసుకో? నిన్ను ఉద్ధరించుకో. నీ పేరుకి, పేరు కోసం ప్రాకులాడవద్దు. నీ ఉన్నతి చూసుకో. నీవు కానిదానికి ప్రాముఖ్యం ఇవ్వవద్దు.

గుర్తుంచుకో! దేహం నువ్వు కాదు. దేహంలో వున్నది నువ్వు. దేహంలో వున్నది ఎవరు? 'ఆత్మ'. అంటే 'ఆత్మే నువ్వు'. 'ఆత్మ' నువ్వయినప్పుడు దేహం నువ్వు కాదు కదా? అప్పుడు ఆ దేహానికి పెట్టిన పేరు నువ్వు ఎలా అవుతావు? అందుచేత నిత్యం నిరంతరం గుర్తుంచుకోవలసింది **"దేహం నేను కాదు, ఆత్మే నేను"** అని. అందుచేత నీ గురించి చూసుకో, పేరు గురించి కాదు.

నీ గురించి చూసుకోవాలంటే ధ్యానం చెయ్యాలి. ధ్యానం ఒక్కటే నీకు సంబంధించినది. అంటే ఆత్మకు సంబంధించినది. అదే నీ ఉన్నతికి లాభించేది.



# "క్షోభ!"

మానవునకు మనస్సు, ఆత్మ రెండూ వున్నాయి. అందుచేత క్షోభ రెండు రకాలు

(1) మానసిక క్షోభ

(2) ఆత్మక్షోభ

1) మానసిక క్షోభ :- మనస్సు కోరుకున్నవి పొందలేనపుడు, మనస్సు అనుకున్నది అవ్వనపుడు మనస్సు క్షోభిస్తుంది. అలాంటి సందర్భాలలో మనస్సు తాను అనుకున్నది జరగడం కోసం తప్పులు చేయిస్తుంది. పాపాలు చేయిస్తుంది. అందుకే మానసిక క్షోభకు గురైన వారు తప్పులు, పాపాలు చేస్తారు. మనస్సు ఇహలోక లాభాలే కోరుకుంటుంది. కారణం మనస్సు దేహానికి సంబంధించినది. దేహంతో పాటు వస్తుంది. దేహంతో పాటు పోతుంది.

2) ఆత్మక్షోభ :- పాపాలు చేస్తే ఆత్మ క్షోభిస్తుంది. ఆత్మకు లాభం కలిగించని పనులు చేసినపుడు, ఆత్మోన్నతికి కావలసిన పనులు చేయనపుడు ఆత్మ క్షోభిస్తుంది. ఆత్మ పరానికి సంబంధించినది. పరలోక లాభాలే చూసుకుంటుంది.

కోరిక తీరకపోతే మనస్సు క్షోభ పడుతుంది. కానీ మనస్సు కోరికల కోసం చేసే తప్పులు ఆత్మకు క్షోభ కలిగిస్తాయి. మనస్సు తన కోరికలు నెరవేర్చుకోవడం కోసం తప్పులు చేయిస్తుంది. అలా **"తప్పులు చేయకపోతే మనస్సు క్షోభ పడుతుంది. కానీ తప్పులు చేస్తే ఆత్మ క్షోభిస్తుంది".**

రెండు రకాల క్షోభలూ మానవునికి నష్టమే. మనో క్షోభకు కారణం కోరికలు. కోరికల్ని అంటే మనస్సును అదుపు చేస్తే అంటే ధ్యానం చేస్తే మనోక్షోభ తగ్గుతుంది. తప్పులు, పాపాలు చెయ్యరు. ధర్మంగా జీవిస్తారు. అప్పుడు ఆత్మక్షోభ కూడా తగ్గుతుంది. అందుచేత రెండు రకాల క్షోభకు ధ్యానమే పరిష్కారం.

**" ధ్యానం అందరినీ**
**మిత్రులుగా చేస్తుంది! "**

**- బ్రహ్మర్షి పత్రీజీ**

# మనోధైర్యం- ఆత్మస్థైర్యం

మనోధైర్యం వేరు. ఆత్మస్థైర్యం వేరు. మనసుకు సంబంధించిన దానిని ధైర్యం అంటారు. ఆత్మకు సంబంధించిన దానిని స్థైర్యం అంటారు. మనోధైర్యం కన్నా ఆత్మస్థైర్యం గొప్పది.

మనసు, మనం తీసుకునే ఆహారాన్ని బట్టి, కుటుంబ వాతావరణాన్ని బట్టి, తల్లిదండ్రుల పెంపకాన్ని బట్టి, సమాజము, పరిసరాలను బట్టి ప్రవర్తిస్తూ ఉంటుంది. వాటన్నిటి యొక్క ప్రభావం మనసుపై వుంటుంది. కాని ఆత్మ ఉనికి ధ్యానాన్ని బట్టి వుంటుంది. సామాన్యులలో, సంసారులలో మనసు ప్రముఖ పాత్ర వహిస్తుంది. అందుకే వాడికి మనోధైర్యం ఎక్కువ అంటారు. కానీ యోగులలో వుండేది ఆత్మస్థైర్యం.

ఎవరైనా ఏ పనైనా చేయడానికి భయపడినా, వెనకడుగువేసినా, సంశయించినా, వెనక్కు తగ్గినా వాడు చాలా పిరికివాడు. వాడికి ధైర్యం లేదు అంటారు. అంటే భయపడకుండా, సంశయించకుండా ఎవరైనా ఏ పనైనా చేస్తే వాడిని ధైర్యస్తుడు అంటారు. కాని ఎంతటి ధైర్యస్తుడైనా కొన్ని విషయాలలో భయపడుతూ వుంటాడు. ఎందుచేతనంటే ధైర్యస్తుడు అంటే అన్ని విషయాలలో ధైర్యం ప్రదర్శించాలి అంతే కాని కొన్ని విషయాలలో ధైర్యం ప్రదర్శించి కొన్ని విషయాలలో భయపడితే వాడు ధైర్యస్తుడెలా అవుతాడు?

చాలామంది అవసరం లేని వాటిలో ధైర్యం ప్రదర్శిస్తూ వుంటారు. అవసరమైన వాటిలో భయపడుతూ వుంటారు. సాధారణంగా ఏ క్రూరజంతువుని కానీ, విషజంతువులను కానీ ఎదుర్కొని చంపినా, తనకన్నా బలమైన వారిని ఎదుర్కొన్నా, కొత్త ప్రదేశాలలో ధైర్యంగా మాట్లాడగలిగినా, విపత్కర పరిస్థితులలో సాహసవంతమైన కార్యాలు చేసినా, తన ప్రాణం కూడా లెక్కచేయకుండా పనులు, సాహసాలు చేసినా వారిని ధైర్యస్థులు అంటారు. మనోధైర్యం కలవారు అంటాం.

అలాగే కొంతమంది ఆలోచన లేకుండా ఎదుటివారి మీద గొడవలకు దిగడం, గొడవలు పడడం, ఎంతటివారినైనా దూషించడం, నాశనమైనా ఫరవాలేదు వాడు పోవాలి అంటూ చేసే పనులు ఆవేశం అవుతుంది. కాని ధైర్యం కాదు.

అలా చాలామంది తాము ధైర్యస్థులమనుకుంటారు. కాని చాలా చిన్న

విషయాలలో భయపడుతూ వుంటారు. కాని నిజమైన ధైర్యస్థుడు ఏ విషయంలో భయపడడు, సంశయించడు.

గమనిస్తే ఎంత ధైర్యస్థుడైనా నిజం పలికే విషయం వచ్చేసరికి భయపడతాడు. అంతటి ధైర్యం ఏమవుతుందో తెలియదు. అందుచేత ఎల్లప్పుడూ నిజాన్ని పలికేవాడే ధైర్యస్థుడు. ఇంకా ఇతరులు ఏమనుకుంటారోనని ఆలోచించని వాడే ధైర్యస్థుడు. స్వతంత్రంగా జీవించగలిగినవాడే ధైర్యస్తుడు. తనకు లేకపోయినా ఇతరులకు ఇచ్చేవాడే ధైర్యస్థుడు. దగ్గరివారు దూరమైనా శోకించని వాడే ధైర్యస్థుడు. కష్టాలు వచ్చినా చింతించని వాడే ధైర్యస్థుడు. కాన్సరు పుండు వేసినా రమణ మహర్షిలా పట్టించుకోని వాడే ధైర్యస్థుడు. శిలువ వేస్తున్నా జీసస్‌లా చిరునవ్వుతో ఉండగలిగినవాడే ధైర్యస్థుడు. బట్టలు లేకుండా మహావీరుడిలా నలుగురిలో తిరిగగలిగిన వాడే ధైర్యస్థుడు. ఇవన్నీ ఆత్మస్థైర్యం వున్నవారు ప్రదర్శించగలరు. కానీ మనో ధైర్యమున్న వారికి సాధ్యం కాదు. మనో ధైర్యంతో కొన్నే చేయగలరు. కానీ ఆత్మస్థైర్యంతో ఏదైనా సాధించగలరు.

కాని 'ధ్యానం' ద్వారా 'ఆత్మస్థైర్యం' పెంచుకున్నవారు ఎలాంటి పరిస్థితులనైనా ఎదుర్కొంటారు. భయపడరు. జీవితంలో ఏం జరిగినా కుంగిపోరు. జయాపజయాలలోనే కాదు మానావమానాలలో కూడా సమ స్థితిలో వుంటారు. మామూలుగా ప్రవర్తిస్తారు. తప్పులు పాపాలు చెయ్యరు. కష్టాలు ఎదుర్కొంటారు. ఒకళ్ళ మీద ఆధార పడరు. ఎవరినీ ప్రార్థించరు.

గమనిస్తే మనోధైర్యం కలఎంతటి వీరుడైనా యుద్ధానికి బయలుదేరే ముందు ఇష్టదైవాన్ని ప్రార్థిస్తాడు. కాని ఆత్మ స్థైర్యమున్నవాడు ఎవరినీ ప్రార్థించడు. అన్నిటినీ తన ఆత్మ శక్తితోతోనే ఎదుర్కొంటాడు. తన భోగం గురించి ఆలోచించడు. అందరికి ఉపకారం చేస్తాడు. అందుచేత మనోధైర్యం కంటే ఆత్మస్థైర్యం గొప్పదని తెలుసుకోవాలి.

ఆత్మస్థైర్యం 'ధ్యానం' ద్వారా మాత్రమే కలుగుతుంది. అందుచేత అందరూ ధ్యానం చెయ్యండి. ఆత్మస్థైర్యాన్ని పెంచుకోండి. గొప్పవారు కండి.



# "విద్యలో రెండు రకాలు!"

లోకంలో మానవులు విద్యకు ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తారు. ఎవరిని చూసినా తమ పిల్లలు మంచి విద్యావంతులవ్వాలని కోరుకునేవారే కనిపిస్తారు. అంతేకాదు తమ పిల్లలను మంచి విద్యావంతులుగా చేయడానికి ఎంతో కృషి చేస్తారు. ఎంతో ధనాన్ని ఖర్చు పెడతారు. ప్రస్తుతం తల్లిదండ్రులు తమ సంపాదనలో ఎక్కువ భాగం తమ పిల్లల చదువులకే వినియోగిస్తున్నారు. తమ శక్తియుక్తులు కూడా వారి విద్య మీదే ఎక్కువ పెడుతున్నారు. ప్రస్తుతం లోకంలో విద్యకు అంత ప్రాధాన్యం వుంది.

కానీ విద్యలో రెండు రకాలు వున్నాయన్న సంగతి తల్లిదండ్రులకు తెలియదు. పిల్లలకు రెండు రకాల విద్యలూ ముఖ్యమన్న సంగతి తల్లిదండ్రులకు తెలియదు. ఎంతసేపూ బాగా చదివి బాగా సంపాదిస్తే సుఖపడతారు అన్న ఆలోచనే కానీ, ఎంత సంపాదించి ఎన్ని సుఖాలు సమకూర్చుకున్నా, దుఃఖం వుంటే జీవితంలో ఆనందం పొందలేరన్న సంగతి గ్రహించలేకపోతున్నారు. ధనాన్ని సంపాదించి పెట్టే విద్యతో పాటు, దుఃఖాన్ని నివారించగల విద్య కూడా జీవితానికి చాలా ముఖ్యం అన్న అవగాహన తల్లిదండ్రులకు లేదు. అందుచేత విద్యలో రెండు రకాలు వున్నాయని ప్రతీ ఒక్కరూ తెలుసుకోవాలి. అవి (1) అక్షర విద్య, (2) క్షర విద్య. అక్షర విద్య అంటే నశింపు లేని దానికి సంబంధించిన విద్య. దీనినే "ఆధ్యాత్మిక విద్య, పరా విద్య" లేక ఆత్మ విద్య అని కూడా అంటారు.

క్షర విద్య అంటే నశించి పోయే వాటికి సంబంధించిన విద్య. దీనినే ప్రాపంచిక విద్య. అపరా విద్య లేక దేహ విద్య అని కూడా అంటారు.

అక్షర విద్య కనపడని పరానికి సంబంధించిన విద్య. పరలోక జ్ఞానాన్ని ఇస్తుంది. దుఃఖాన్ని వారిస్తుంది. బంధ విముక్తుల్ని చేస్తుంది. కానీ క్షర విద్య కనబడే ఇహానికి సంబంధించిన విద్య. ఇహలోక ధనాన్ని సంపాదించి పెట్టే విద్య. భుక్తినిస్తుంది, సుఖాలనిస్తుంది. బంధాన్ని కలిగిస్తుంది.

అక్షర విద్య శ్రేయస్కరమైనది. ఆనందాన్ని ఇస్తుంది. కానీ క్షర విద్య సుఖకరమైనది. దుఃఖాల్ని కలిగిస్తుంది.

అక్షర విద్య శాశ్వతమైన పరోక్ష విద్య. ఆత్మకు సంబంధించినది. కాని

క్షర విద్య తాత్కాలికమైన ప్రత్యక్ష విద్య. భౌతికానికి సంబంధించినది.

అక్షర విద్య యోగులు అభ్యాసం చేసే విద్య. అజ్ఞానాన్ని తొలగిస్తుంది. అందుకే అక్షర విద్యను నివృత్తి విద్య అంటారు. క్షర విద్య భోగులు అభ్యాసం చేసే విద్య. అజ్ఞానం తొలగించలేదు. అందుకే క్షర విద్యను ప్రవృత్తి విద్య అంటారు. అందుచేత మానవులకు అక్షర విద్యే శ్రేయోమార్గం. క్షర విద్య ప్రేయో మార్గమని తెలుసుకోవాలి.

ఏది ఏమైనా సుఖాలు వున్న జీవితం కంటే, దుఃఖం లేని జీవితం గొప్పది. కారణం ఎన్ని సుఖాలు వున్నా దుఃఖం వుంటే అనుభవించే యోగ్యత వుండదు. అనుభవించలేరు కానీ దుఃఖం లేని వారు కొద్దిపాటి సుఖాలు వున్నా అనుభవించగలరు. అందుచేత సుఖాలనిచ్చే, "క్షర విద్య"తో పాటు దుఃఖాన్ని తాత్కాలికంగానే కాదు, శాశ్వతంగా నివారించే "అక్షర విద్య"కు కూడా ప్రాముఖ్యం ఇవ్వండి. జీవితంలో ఆనందాన్ని పొందండి.

ఒక రకంగా చెప్పాలంటే 'అక్షర విద్య' భగవంతునికి సంబంధించినది. 'క్షర విద్య' భగవంతుని సృష్టికి సంబంధించినది. భగవంతునికి సంబంధించిన 'అక్షర విద్య' ధ్యానం చెయ్యడం. యోగుల పుస్తకాలు చదవడం. సత్యం తెలిసిన వారి సాంగత్యం చెయ్యడం ద్వారా ఎవరైనా నేర్చుకోవచ్చు. దీనికి వయస్సుతో సంబంధం లేదు. చిన్న వయస్సు నుండే "అక్షర విద్య" నేర్చుకున్న వారు భగవత్ సాక్షాత్కారం పొందగలరు. చివరకు ముక్తులు కాగలరు.

**" ప్రతి కార్యం వెనుక**
**ఒక కారణం ఉంటుంది! "**

**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "నాటకం !"

షేక్స్పియర్ "ఈ ప్రపంచం అంతా ఒక నాటకరంగం, అందులో మనమంతా పాత్రధారులం. మనం మన పాత్రలు పోషించి చివరకు నిష్క్రమిస్తాం" అని అన్నారు.

అంటే ఈ భూమే ఒక పెద్ద నాటకరంగమని, అందులో మనమంతా పాత్రధారులం మాత్రమేనని, ఎవరి పాత్రలు వారు పోషించి చివరకు అంతా నిష్క్రమించవలసిన వారమేనని షేక్స్పియర్ అన్నారు. నిష్క్రమిస్తాం కూడా.

కానీ భూమి మీద ఎవ్వరూ కూడా తమది ఒక పాత్ర అని భావించడం లేదు. అంతా నిజమనుకుంటున్నారు. తాను ఈ కులస్తుడనని, మతస్తుడనని, ప్రాంతస్తుడనని, దేశస్తుడనని, జమీందారునని, నాయకుడునని, అందగాడినని, ఆటగాడినని, స్త్రీనని, పురుషుడనని, పేదవాడినని, కురూపినని, భార్య అని, భర్త అని, తల్లి అని, తండ్రి అని భావిస్తున్నారు. దానికి తగ్గట్టు గానే ప్రవర్తిస్తున్నారు. కానీ ఎవ్వరూ కూడా తాము ఈ నాటకంలో అలాంటి పాత్ర పోషిస్తున్నాను అని భావించడం లేదు.

ఎందుచేతనంటే తాను ధనవంతుడు అనుకుంటున్నాడు కానీ, ధనవంతుని పాత్ర పోషిస్తున్నానని అనుకోవడం లేదు. అందుకే గర్విస్తున్నాడు. అహంకరిస్తున్నాడు. ఈ మతస్తుడనని అనుకుంటున్నాడు కానీ మతస్తుడి పాత్ర పోషిస్తున్నానని అనుకోవడం లేదు. అందుకే ఇతర మతస్తులను ద్వేషిస్తున్నాడు. కలహిస్తున్నాడు. అలాగే ఫలానా కులస్తుడని అనుకుంటున్నాడు కానీ ఆ కులస్తుని పాత్ర పోషిస్తున్నాను అనుకోవడం లేదు. అందుకే ఇతర కులస్తులను ద్వేషిస్తున్నాడు, అంటరాని వారిగా చూస్తున్నాడు. అలాగే పురుషుడనని భావిస్తున్నాడు కానీ పురుషుని పాత్ర పోషిస్తున్నాను అనుకోవడం లేదు. అందుకే అధికారం చెలాయిస్తున్నాడు. స్త్రీలపై ఆధిపత్యం చేస్తున్నాడు. అలాగే నేను స్త్రీ అని భావిస్తున్నారు కానీ స్త్రీ పాత్ర పోషిస్తున్నాను అని భావించడం లేదు. అందుకే అబలననుకుంటూ అణిగి మణిగి వుంటున్నారు. అన్నీ సహిస్తూ వుంటారు. ఏమీ చేయలేననుకుంటారు.

అలాగే నేను తల్లిని అనుకుంటూ, తండ్రిని అనుకుంటూ భార్య

అనుకుంటూ, భర్త అనుకుంటూ వారు నావారు అనుకుంటూ వారి కోసం రాగద్వేషాలు ప్రదర్శిస్తూ, వారి కోసం చేయకూడని పనులు చేస్తూ, ఇతరులను ద్వేషిస్తూ, ఇవన్నీ శాశ్వతం అనుకుంటూ, అన్నిటిని కూడబెడుతూ, అధర్మంగా ప్రవర్తిస్తూ, పాపాలు చేస్తూ కష్టాల పాలవుతున్నారు.

కష్టాలకు బాధపడుతూ, కుటుంబంలోని వారంతా స్వంత వారనుకుంటూ, వారు దూరమవుతే దుఃఖిస్తూ... ఇలా పడరాని పాట్లు పడుతున్నారు. కానీ అందరూ పాత్రధారులే, అందరూ ఈ నాటకంలో ఒక పాత్ర పోషించడానికి వచ్చిన వారేనని ఎవరూ భావించడం లేదు. ఎవరి పాత్ర పూర్తయితే వారు నిష్క్రమించవలసి వస్తుందని భావించడం లేదు.

నాటకంలో రాజు, నేను రాజును అని భావిస్తే ఎలా వుంటుందో! నాటకంలో జమీందారు నేను జమీందారునని, కలెక్టరు నేను కలెక్టరునని, మినిస్టర్ నేను మినిస్టర్‌నని భావిస్తే ఎలా వుంటుందో! భూలోక నాటక రంగంలో మానవులు ఉన్నదంతా నిజమనుకుంటే అలాగే వుంటుంది. కారణం నాటకంలో రాజు నాటకం వున్నంత వరకే రాజు. నాటకం పూర్తవగానే రాజు కాదు కదా! అలాగే జమీందారు, కలెక్టరు, మినిష్టరు కూడా. అలాగే భార్య, భర్త, తల్లి, తండ్రి కూడా.

గమనిస్తే ఒక నాటకంలో వున్న పాత్ర మరో నాటకంలో వుండదు. ఎందుచేతనంటే ఒక నాటకంలో రాజుగా పాత్ర పోషించిన వాడు ఇంకొక నాటకంలో సేవకుడిగా పాత్ర పోషించవలసివస్తుంది. అలాగే ధనవంతుడిగా ఒక నాటకంలో పోషించినవాడు ఇంకొక నాటకంలో అడుక్కునేవాడిగా పాత్ర పోషించవలసి వస్తుంది. అలాగే ఈ నాటకంలో భార్యగా పోషించిన ఆవిడ ఇంకొక నాటకంలో తల్లిగా నటించవలసి రావచ్చు. అలాగే ఈ నాటకంలో భర్తగా నటించినవాడు, ఇంకొక నాటకంలో కొడుకుగా పోషించవలసిరావచ్చు. అంటే నాటకాలు మారినపుడు పాత్రలు మారుతూ వుంటాయి. ఏ పాత్ర శాశ్వతం కాదు. అదే పాత్ర ప్రతీ నాటకంలో వుండదు. అన్నీ మారేవే, మార్పు చెందేవే. అలాగే భూమి మీద ప్రస్తుతం ప్రతీ ఒక్కరి పాత్ర కూడాను. ఎవరు ఎలా వున్నారో శాశ్వతంగా అలాగే వుండరు. ఎవరికి ఏమి వున్నాయో అవి శాశ్వతంగా వుండవు. అన్నీ ఆ పాత్ర వున్నంత వరకే. మరల పాత్ర మారితే అన్ని మారిపోతాయి.

అందుకే పత్రీజీ **"పాత్రలో జీవించు, కానీ అది పాత్ర అని మాత్రం**

**మరచిపోకు"** అని అంటారు. అంటే పాత్రలో లీనమయినట్టుగా చూసేవాడికి కనిపించాలి కానీ, తాను మాత్రం పాత్రలో లీనం కాకూడదు. ఎందుకంటే ఆ నాటకంలో పోషిస్తున్నది పాత్రే కానీ తాను కాదు కాబట్టి. అంటే భర్తగా, భార్యగా నీ పాత్ర పోషించు, జీవించు, కానీ నేను భర్త పాత్రను పోషిస్తున్నాను, భార్య పాత్రను పోషిస్తున్నాను అని మరచిపోకు.

పాత్ర పోషిస్తున్నాను అని భావించేవాడు దుఃఖపడడు, దుఃఖపడుతున్న ట్టుగా కనబడుతాడు. అలాగే జీవితంలో భర్త దూరమైనా, భార్య దూరమైనా, కొడుకు దూరమైనా అందులో లీనమవ్వడు. కారణం అందరివీ పాత్రలే అన్న సత్యం తెలుసు కనుక. కానీ నిజమనుకున్నవాడు అంతులేని దుఃఖానికి లోనవుతాడు. నా జీవితం వ్యర్థం అనుకుంటాడు. ఇక జీవించలేను అనుకుంటాడు. ఒక్కొక్కసారి ఆత్మహత్య కూడా చేసుకోవాలనుకుంటారు.

జీవితంలో యాక్షన్ వల్ల కర్మకు బద్ధులు కాము. నేను అనుకుంటేనే కర్మలో చిక్కుకుంటాము. ఆ పాత్ర తాను కాదు, అది పాత్రే అని అనుకుంటూ పాత్ర పోషిస్తే ఏదీ తనకు అంటదు. అది తానే అనుకుంటే కర్మ బంధిస్తుంది. అందుకే గీతలో కృష్ణభగవానుడు "కతృత్వ భావం లేకుండా చేయమన్నారు" అంటే నేను చేస్తున్నాను అన్న భావం లేకుండా చెయ్యమన్నారు.

గుర్తుంచుకోండి **"నాటకంలో తండ్రిపోతున్నాడు కానీ, తన తండ్రిపోవ ట్లేదు".** అలాగే **"నాటకంలో చనిపోతున్నాడు కానీ తాను చావట్లేదు".** ఇది సత్యం.

నాటకంలో భార్య వస్తే భర్త అవుతాడు, చెల్లి వస్తే అన్న అవుతాడు, కొడుకు వస్తే తండ్రి అవుతాడు, మనవడు వస్తే తాత అవుతాడు. మరి వీటిలో తానెవడు? వీటిలో తాను ఏదీ కాదు. ఇవన్నీ పాత్రలే, కానీ తాను తానే.

అలాగే శ్రీరాముడు కూడా నాటకంలో పాత్ర పోషించాడు. అంటే అది ఆ నాటకంలో ఆయన పాత్ర కాని, ఆయన కాదు. ఎవరైనా వారి పాత్ర వారు ఎలా అవుతారు? మనం పాత్రని పట్టుకున్నాం. ఆయన్ను వదిలేశాం.

గుర్తుంచుకోండి మనమంతా భూలోకమనే నాటకరంగంలో రకరకాల పాత్రలు పోషిస్తున్నాం. ప్రస్తుతం ఉన్నది కూడా పాత్రే. ఇదంతా తెలుసుకోవాలంటే ఎవరైనా ధ్యానం చెయ్యవలసిందే.



# "సంసార వ్యామోహం!"

మానవుడు సమకూర్చుకున్న, తయారుచేసుకున్న వస్తువు మానవుని దగ్గరే వుంటుంది. కాని తాను కన్నపిల్లలు మాత్రం తన దగ్గర వుండరు. కొన్నాళ్ళకు దూరం అవుతారు. శాశ్వతంగా కూడా దూరం కావచ్చు. కారణం వారు తాను తయారు చేసుకున్న వారు కాదు కాబట్టి. తాను తయారుచేసుకోని వారు తనవారు ఎలా అవుతారు? తనవారు కానపుడు వారిమీద మమకారం ఎందుకు? వారికి తాము దేహాన్ని మాత్రమే ఇచ్చారు. వారి పిల్లలు మాత్రం వారి కార్యం నెరవేర్చుకోవటానికి, వారి కర్మలు తెచ్చుకుని వచ్చారు. అలాంటి వారు వీరివారు ఎలా అవుతారు? వారు (పిల్లలు) వారి గురించే చూసుకుంటారు. వీరి (తల్లిదండ్రులు) గురించి ఆలోచించరు. శరీరం ఇచ్చినందుకు కాస్త అభిమానాన్ని చూపిస్తారు. అందుచేత వస్తువులలా, నా అనుకోకూడదు. అనుకుని మమకారం పెంచుకున్నవారు చివరకు దుఃఖానికి లోనవుతారు.

తమ పిల్లలు కూడా తమలాంటి ఆత్మలే, అన్న సంగతి మరచి పోకూడదు. వారు సృష్టిక్రమంలో, తమ పాత్ర పోషించడానికి వచ్చిన పాత్రధారులు మాత్రమే. వారు తమ పాత్ర పోషించి నిష్క్రమిస్తారు. వస్తువులా శాశ్వతంగా మన దగ్గరే వుండరు. మనం చెప్పినట్టే వినరు. అందుచేత భాధ్యత అంటూ వారిమీదే దృష్టి వుంచి మిమ్మల్ని మరచిపోకూడదు. మీ గురించి కూడా ఆలోచించాలి.

మానవుడు **"తన తర్వాత తరాల (పిల్లలు, మనవలు) గురించి ఆలోచిస్తున్నాడు, శ్రమిస్తున్నాడు. కాని తన తర్వాత జీవితం గురించి ఆలోచించడం లేదు, శ్రమించడం లేదు".**

**"సంసార వ్యామోహం కాదు, మోక్ష వ్యామోహం వుండాలి". "సంసారం కోసం పాటుపడడం కాదు మోక్షం కోసం పాటుపడాలి". అపుడే దుఃఖ నివృత్తి.**

**"సంసారం కోసం కృషి చేస్తే దుఃఖం పెరుగుతుంది", "మోక్షం కోసం కృషి చేస్తే దుఃఖం నివృత్తి అవుతుంది".** అందుచేత మోక్షమార్గాన్ని వెతుక్కోవాలి. మోక్షానికి ప్రయత్నించాలి. సంసార వ్యామోహంలో పడకూడదు. మరి ఆ మోక్ష మార్గమే యోగమార్గం. అదే ధ్యానం.

ఏనుగుదంతం ఎంతో విలువైనది. దానితో ఎన్నో విలువైన వస్తువులు

తయారుచేయవచ్చు. కాని మానవుని దంతం దేనికి ఉపయోగపడదు. పారవేయ వలసిందే. పులిచర్మం ఆసనంగా ఉపయోగపడుతుంది. జంతువుల చర్మాలు చెప్పులుగా, అనేక వస్తువులుగా ఉపయోగపడుతున్నాయి. కానీ మానవుని చర్మం దేనికీ ఉపయోగపడదు. జంతువుల, కుక్కల రోమాలు వస్త్రాలుగా ఇంకా చామరం క్రింద కూడా ఉపయోగిస్తున్నారు. కాని మానవుని రోమాలు ఉపయోగపడవు.

గోధుమలు మిషనులో వేస్తే గోధుమపిండి వస్తుంది. బియ్యం వేస్తే బియ్యం పిండి వస్తుంది. కాని మానవదేహంలో ఎన్ని మధురమైన పదార్థాలు వేసినా పనికిరాని మలమే వస్తుంది. చనిపోయిన తరువాత మానవ దేహం దేనికి పనికి రాదు. కాల్చాలి. లేదా కప్పెట్టాలి. అలా భౌతికంగా చూస్తే మానవ దేహానికి విలువ కనబడదు. విలువ లేనట్టుగా వుంటుంది.

కానీ అదే దేహంతో మానవుడు 84 లక్షల జీవులలో ఏ జీవి సాధించలేనివి ఎన్నో సాధించవచ్చు. సాధిస్తున్నాడు కూడా. ఎన్నో సృష్టించవచ్చు. సృష్టిస్తున్నాడు కూడా. లోకానికి ఎంతో మేలు చేయవచ్చు. లోకోపకారమైన పనులు ఎన్నో చేయవచ్చు. చనిపోయిన తరువాత విలువ లేనిదిగా కనిపించినా, ఉన్నప్పుడు మాత్రం మానవదేహం అత్యంత విశిష్ఠమైనది. విలువ కట్టలేనిది. కారణం ఒక్క మానవదేహానికే ధ్యాన సాధన చెయ్యగల అవకాశం వుంది. 84 లక్షల జీవులలో ఏ దేహానికి ఈ శక్తి లేదు. ధ్యాన సాధన ద్వారా దైవ స్థితి కూడా పొందవచ్చు. మోక్షాన్ని పొందవచ్చు. అందుచేత "సంసార వ్యామోహం"లో పడి విలువైన దేహాన్ని వృధా చెయ్యకూడదు. యోగులులా ధ్యాన సాధనకు ఉపయోగించి దైవత్వాన్ని పొందండి.

**" తపోలోకానికి వెళ్ళాలంటే తపస్సు కావాలి !**
**సత్యలోకానికి వెళ్ళాలంటే సత్యం కావాలి ! "**
**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "పారపోయకూడదు-పోగుచేసుకోవాలి!"

మానవులు తమ జీవితాన్ని పారపోసుకుంటున్నారు. కాని పోగు చేసుకోవట్లేదు. అంటే జీవితాన్ని వ్యర్థం చేసుకుంటున్నారు గానీ, సద్వినియోగం చేసుకోవట్లేదు.

అంటే వృధాగా గడిపేస్తున్నారు. ఫలితం లేని పనులు చేస్తున్నారు. వారి సమయాన్ని, శక్తిని, వాక్కును, మేథస్సును, ఆఖరుకు జీవితాన్ని కూడా ఎంతో వ్యర్థం చేసుకుంటున్నారు.

మానవులకు ఇవ్వబడిన జీవితం సద్వినియోగం చేసుకుని లాభపడ టానికే కాని వ్యర్థం చేసుకుని నష్టపోవటానికి కాదు. వ్యర్థం చేయడమంటే నష్టపోవడమేనని తెలుసుకోవాలి. కాలక్షేపం కోసం చేసే పనులు, వినోదం కోసం చేసే పనులు అన్నీ వ్యర్థమైనవే. కానీ లోక కళ్యాణకరమైన పనులు, మంచి పనులు, ఆత్మోన్నతికి చేసే పనులు అన్నీ లాభించేవే! లాభం చేకూర్చేవే. ఆ విధంగా జీవించేవారు తమకు ఇవ్వబడిన జీవితాన్ని సద్వినియోగం చేసుకున్నట్టే! దీనినే పోగుచేసుకోవడమంటారు.

ప్రతీ ఒక్కరూ బాగా ఆలోచించాలి. ఏదీ వ్యర్థం కాకూడదు. ప్రతీదీ మనకు లాభించాలి. ఎవరైనా పోగు చేసుకుని కూడబెట్టిన వారు ఆనందంగా జీవించగలరు. ఆనందాన్ని పొందగలరు.

జీవితమన్నది మానవునకు ఇవ్వబడిన అమూల్య అవకాశం, దానిని పారపోయకూడదు. అంటే వృధా చేయకూడదు. దుర్వినియోగం అసలే చేయకూడదు. దుర్వినియోగం అన్నది నష్టాన్నే కాదు, కష్టాల్ని కూడా కలగ చేస్తుంది. అందుచేత చిన్న చిన్న మంచి పనులతో పుణ్యాన్ని పోగుచేసుకోవాలి.

అన్నిటికంటే గొప్ప పనులు ఏవంటే ఆత్మ కార్యాలు, ఆత్మ సేవలు. కారణం ఆత్మే భగవంతుడు కనుక. భగవంతుని కార్యాలు , భగవంతుని సేవలే చాలా గొప్పవి. శాశ్వతమైనవి. మరి ఆత్మ కార్యాలు ఏవంటే ధాన్యం చెయ్యడం, ధ్యానాన్ని అందరికీ పంచడం. ధ్యాన కార్యక్రమాలలో పాల్గొనడం, నిర్వ హించడం.

అందుచేత ధ్యానం చేస్తూ, ధ్యాన ప్రచారం చేస్తూ ఆ కార్యక్రమాలలో పాల్గొంటూ జీవితాన్ని సద్వినియోగం చేసుకోవాలి. అంటే పోగు చేసుకోవాలి. జీవితాన్ని పారపోసి వ్యర్థం చేయకూడదు.

# "మంచి - చెడు!"

ఎవరినైనా ఆ మంచి పని ఎందుకు చెయ్యడం లేదు అంటే? మాకు తెలియదు అంటారు. మాకెవ్వరూ చెప్పలేదు. మాకెలా తెలుస్తుంది ? అంటారు. అలా అంటూ చెడే చేస్తూంటారు. మరి చెడు చేయడం ఎలా తెలిసింది? చెడు చెయ్యమని ఎవరు చెప్పారు? చెడు ఎలా తెలుసుకున్నారు? చెడు చేస్తున్నారుగా? చెయ్యడమే కాదు. చేసిన చెడును ఎంతో తెలివిగా సమర్ధించుకుంటారు. దాస్తారు. ఎవరికి తెలియకుండా జాగ్రత్త పడతారు కూడా. అంతే కాదు అందులోంచి బయటపడటానికి తన తెలివి రకరకాలుగా వుపయోగిస్తున్నారు. 'రికమండేషన్స్' చేయిస్తారు. పలుకుబడిని ఉపయోగిస్తారు. దౌర్జన్య పద్ధతులు ఉపయోగిస్తారు. బెదిరిస్తారు. లంచాలు, ఇచ్చి బయట పడటానికి ప్రయత్నిస్తారు. మరి ఇవన్నీ తెలివితేటలు కాదా?

ఇన్ని తెలివితేటలు వున్నవారికి మంచి గురించి ఎందుకు తెలియదు? మంచి చెయ్యాలని ఎందుకు తెలియదు? తెలియకపోతే తెలుసుకోవటానికి ప్రయత్నిస్తే తెలియదా? ప్రయత్నం చెయ్యడం లేదంటే మంచి చెయ్యడం ఇష్టం లేదనేగా?

ఇష్టంలేదని చెప్పకుండా మాకు తెలియదనడం మూర్ఖత్వం కాదా? అలా చెప్పి ఎవరిని మభ్యపరుస్తారు? అలా మభ్యపరచడం వల్ల తమకు కలిసి వచ్చేదేమిటి?

అలా తమను రకరకాలుగా సమర్ధించుకుంటూ మంచి చెయ్యకుండా తప్పులు, పాపాలు చేస్తూ పోతే నష్టపోయేదెవరు? కష్టాలు పాలయ్యేదెవరు? బాధపడేదెవరు? దుఃఖపడేదెవరు? ఇన్ని ఆలోచించేవారు ఈ మాత్రం ఆలోచించలేరా?

ఆలోచించాలి ఆలోచించకపోతే తన్నుతాను మోసగించకున్న వారవుతారు. తమను తాము నష్టపరచుకున్నవారవుతారు. అందుచేత మంచి చెయ్యడం తెలీదు అని అనవద్దు. మంచి చెయ్యటానికి ప్రయత్నించాలి.

మానవుడు చెడు చెయ్యటానికి, మంచి చెయ్యకపోవటానికి కారణం మంచిచెయ్యటం తెలియక కాదు. మానవుడికి అన్నీ తెలుసు . మంచి తెలుసు,

చెడు తెలుసు, తాను చేసింది చెడు అని కూడా తెలుసు. చెడు చెయ్యకూడదు అని కూడా తెలుసు. మరి మంచి ఎందుకు చెయ్యడం లేదు? కారణం **"మంచి చెయ్యడం చాలా కష్టం. చెడు చెయ్యడం చాలా తేలిక".**

అందుచేత మానవుడు **"కష్టమైన మంచిని చెయ్యడం మానేస్తున్నాడు. కాని తేలికైన చెడే చేస్తున్నాడు".**

కాని గమనిస్తే సృష్టిధర్మం ప్రకారం "కష్టమని మంచి చెయ్యడం మానేస్తే జీవితంలో లాభం పొందలేరు సరికదా నష్టపోతారు. అలాగే తేలికని చెడు చేస్తే తాత్కాలిక లాభాలు కలిగినట్టు కనిపించినా చివరకు జీవితంలో కష్టాల పాలవుతారు. దుఃఖాన్ని పొందుతారు". ప్రస్తుతం లోకంలో మంచి కంటే చెడు ఎక్కువగా వుండటానికి ముఖ్యకారణం ఇదే. **"చెడు చెయ్యడం తేలిక. మంచి చెయ్యటం కష్టం".**

భగవంతుడు అంతరాత్మ రూపంలో ప్రతీఒక్కరికీ మంచి గురించి, మానవుడు ఆచరించవలసిన ధర్మాల గురించి బోధిస్తూనే వున్నాడు. కాని మానవుడే వాటిని పట్టించుకోకుండా తప్పులు చేస్తున్నాడు. కష్టాలు కొని తెచ్చుకుంటున్నాడు. తనకన్ను తన వేలుతో తానే పొడుచుకుంటున్నాడు. తన జీవితాన్ని తానే నాశనం చేసుకుంటున్నాడు.

దీనిని బట్టి మానవులకు మంచి తెలియకపోవడం కాదు. 'అంతరాత్మ' రూపంలో తెలుస్తూనే వుంది. కానీ సమస్య ఏమిటంటే తెలిసిన మంచి ఆచరించలేకపోతున్నారు. కారణం మానవులకు ఆ శక్తి లేకపోవడమే, మరి ఆ శక్తి పొంది మంచి ఆచరించాలంటే ప్రతీ ఒక్కరూ ధ్యానం చేయాలి. ధ్యానం చేస్తే శక్తి పెరుగుతుంది. 'అంతరాత్మ' అంటే 'భగవంతుడు' బోధించే ధర్మాల్ని, మంచిని ఆచరించగలుగుతారు. జీవితాన్ని ధన్యం చేసుకుంటారు.

**" నేను ఆత్మ అని**
**తెలుసుకున్నవాడు ఎప్పుడూ ఏడవడు! "**
**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "ధర్మం - అధర్మం!"

మహాభారతమంతా రెండు విషయాలమీదే నడిచింది. అది పాండువులు, కౌరవుల మధ్య జరిగిన యుద్ధం కాదు. అది ధర్మానికి, అధర్మానికి మధ్య జరిగిన యుద్ధం. అది ధర్మం యొక్క గొప్పతనం, ధర్మాచరణ వల్ల కలిగే లాభం తెలియపరిచింది. అంతేకాదు అధర్మం యొక్క పర్యవసానాన్ని బోధించిన అద్భుత కావ్యం. అది ధర్మాన్ని అనుసరించిన పాండవులకు, అధర్మాన్ని ఆశ్రయించిన కౌరవులకు మధ్య జరిగిన యుద్ధాన్ని బోధించింది! అంటే 'ధర్మాధర్మాల' మధ్య జరిగిన యుద్ధాన్ని, పర్యవసానాన్ని బోధించింది.

అధర్మాన్ని ఆశ్రయించిన కౌరవుల వద్ద సైనిక బలం అధికంగా వుంది. అతి రథ మహారధులైన మహాయోధులంతా వున్నారు. కానీ పరాజితులయ్యారు. ధర్మాన్ని ఆశ్రయించిన పాండవులకు సైనిక బలం తక్కువ. పైగా అతిరధ మహారధులు కూడా తక్కువ. కానీ చివరకు విజయం సాధించారు.

కౌరవులకు కృష్ణుని సైనిక బలమంతా ఇవ్వబడింది. కానీ దైవబలం లేదు. కానీ ధర్మాన్ని కాపాడిన పాండవుల పక్షాన మాత్రమే దైవబలం వుంది. అంటే దైవం వున్నాడు. అంటే కృష్ణుడు వున్నాడు.

ధర్మాన్ని ఆశ్రయించిన పాండవులు తాత్కాలికంగా మొదట్లో కష్టాలు పడినట్లు కనిపించారు కానీ చివరకు విజయం సాధించారు. సుఖించారు. అధర్మాన్ని ఆశ్రయించిన కౌరవులు మొదట్లో భోగాలు పొందినట్లు కనిపించినా చివరకు పరాజయం పాలయ్యారు, నాశనమయ్యారు.

దీనిని బట్టి ఎంతటివారైనా అధర్మాన్ని ఆశ్రయించినా, అధర్మాన్ని సమర్థించినా, అధర్మం పక్షాన వున్నా, ధర్మం తెలిసి కూడా అధర్మం పక్షాన వున్నా నాశనమవుతారని, శిక్షింపబడతారని, ధర్మాన్ని ఆశ్రయించిన వారికి దైవశక్తి తోడుగా వుంది. వారిని ఎల్లప్పుడూ ఆపత్ సమయాలలో దైవ శక్తి కాపాడుతూ వుంటుంది అన్నదే మహాభారతంలోని అంతరార్థం. అధర్మాన్ని ఆశ్రయించిన వారి వైపు దైవం ఉండదు సరికదా, దైవం దూరమవుతుంది. దైవంచే శిక్షింపబడతారు కూడా.

ధుర్యోధనుడు, శకుని, కర్ణుడు వీరికి ధర్మం తెలుసు కానీ అధర్మాన్నే ఆశ్రయించారు. అలాగే భీష్ముడు, ద్రోణుడు లాంటి వారికి కూడా ధర్మం తెలుసు కానీ అధర్మాన్ని చూస్తూ ఊరుకున్నారు. అందుకే అంతా నాశనమయ్యారు.

శిక్షింపబడ్డారు. పాండవులకు ధర్మం తెలుసు. ధర్మాన్ని రక్షించారు. చివరకు రక్షింపబడ్డారు. అందుకే "ధర్మోరక్షతి రక్షితః" అన్నారు.

ఈ భారత గాధ యొక్క సందేశం ప్రతీ ఒక్కరిని ధర్మాన్ని రక్షించమని. మరి ధర్మమంటే ఏమిటి? 'ధర్మమంటే' ఎవరయితే ఈ సృష్టిని సృష్టి చేశారో, ఆయన ఏర్పాటు చేసిన నియమాలు. ఈ సృష్టిలోని జీవులు, జీవరాసులు ప్రవర్తించవలసిన నియమాలు. ప్రతీ జీవి ఎలా జీవించాలి? ఎలా నడుచుకోవాలి? అని తెలిపేదే ధర్మం. భగవంతుని సృష్టిలోని సమస్త జీవులూ ఆనందంగా జీవించడానికి ఏర్పాటు చేయబడ్డవే ధర్మాలు.

ధర్మం ఎంత గొప్పదంటే ఒక ఏనుగు పాదముద్రలో అన్నీ జంతువుల పాదముద్రలు ఎలా ఇముడుతాయో అలాగే ఒక్క ధర్మంలోనే సమస్తమూ ఇమిడి వుంది. కారణం ప్రతీ చర్య ధర్మాన్ని అనుసరించే వుంటుంది. అందుచేత ప్రతీ ఒక్కరూ ధర్మాన్ని అనుసరించాలి. కాపాడాలి. ఇదే ప్రకృతి ధర్మం. మరి ధర్మాన్ని ఎలా కాపాడాలి?

**"ధర్మమనేది బయట వారు మనకు చెప్పేది కాదు. మన అంతరాత్మలో నుంచి పైకి సహజంగా ఉబికేది"** అని పత్రీజీ చెప్పారు.

ధర్మాన్ని నిర్దేశించింది భగవంతుడే కనుక, ధర్మం ఆయనకే తెలుసు. అందుచేత ఆయన చెప్పినట్టు వినాలి, నడుచుకోవాలి! ఎలా? భగవంతుడు అందరిలో ఆత్మ రూపంలో వుండి, అందరికీ వారి వారి ధర్మాల్ని తెలియచేస్తున్నాడు. ప్రతీ విషయంలో, ప్రతీ పనిలో, ప్రతీ క్షణం హెచ్చరిస్తూనే వున్నాడు. అందుచేత అంతరాత్మ చెప్పిన విధంగా నడుచుకున్న వాడు ధర్మాన్ని ఆచరించినట్టే. ధర్మాన్ని కాపాడినట్టే. అలా "ధర్మం" అంతరంలో నుంచి పైకి రావాలంటే ధ్యానం చెయ్యవలసిందే. ధ్యానం చేసే వారే అంతరాత్మ చెప్పినట్టు నడుచుకోగలరు. ధర్మాచరణ చెయ్యగలరు. అందుచేత "ధ్యానం చెయ్యండి. ధర్మాన్ని కాపాడండి". ముక్తిని పొందండి.

**"సృష్టి చేసిన ఆత్మకు సృష్టి ధర్మాలు తెలుస్తాయి కానీ, సృష్టింపబడిన మనస్సుకు సృష్టి ధర్మాలు తెలియవు".**

మానవుడు ఆత్మను అనుసరించాలి. కానీ మనస్సును కాదు. దానికి ధ్యానమే మంచి మార్గం. కారణం ధ్యానం చేసిన వాడు మనస్సును జయించి అంతరాత్మను వినగలుగుతాడు. అందుచేత ధ్యానాన్ని విశేషంగా చెయ్యాలి.



# "ప్రకృతి పట్ల మానవుల ధర్మం!"

మానవుల ధర్మాలలో ఒక ముఖ్య ధర్మం 'ప్రకృతిని కాపాడే ధర్మం'. ఆ **"ధర్మాన్ని మనం కాపాడితే! ఆ ధర్మమే మనల్ని కాపాడుతుంది". అంటే "ప్రకృతిని మనం కాపాడితే! ఆ ప్రకృతే మనల్ని కాపాడుతుంది!".**

మరి 'ప్రకృతి' అంటే ఎవరు? ఒక రకంగా ప్రకృతి అంటే 'భగవంతుడే'. కారణం ప్రకృతిలో పంచ భూతాలు ఉన్నాయి. అవి "భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం". ఇవన్నీ భగవంతుని నుంచే ఏర్పడ్డాయి. అలాగే సకల చరాచర సృష్టి, పంచభూతాల నుండి ఏర్పడ్డాయి. అందుచేత ప్రకృతిలో వుండే సకల జీవులు, ప్రాణులు కూడా ప్రకృతిలో భాగమే, అంటే భగవంతుడే.

మనం ప్రకృతిని ప్రేమించాలి. ప్రేమతో చూడాలి. స్నేహం చెయ్యాలి. సహ జీవనం చెయ్యాలి. ప్రకృతి నిర్ణయాలు గౌరవించాలి, కాపాడాలి. అంతేకాని ప్రకృతిని నాశనం చెయ్యకూడదు, ద్వేషించకూడదు, హింసించకూడదు, భాధించకూడదు. ప్రకృతి నిర్ణయాలను విమర్శించకూడదు. ఇదీ ప్రకృతి పట్ల మానవుల ధర్మం. దీనికి విరుద్ధంగా ప్రవర్తిస్తే ప్రకృతి విరుద్ధంగా ప్రవర్తించినట్లే. అంటే భగవంతునికి విరుద్ధంగా ప్రవర్తించినట్టే. దాని ఫలితం అనుభవించ వలసిందే.

ప్రకృతిలో భాగమైన వృక్ష జాతి పంచభూతాలలోని నీటితో ఏర్పడింది. అలాగే క్రిమి కీటకాలు, సర్ప జాతి "భూమి, నీటి"తో ఏర్పడింది. పక్షి జాతి "నీరు, అగ్ని, వాయువులతో" ఏర్పడింది. జంతుజాతి "భూమి, నీరు, అగ్ని, వాయువులతో" ఏర్పడింది. అలాగే మానవజాతి "పంచభూతాలతో" ఏర్పడింది. అంటే ప్రకృతి. ప్రకృతిలో వున్న సమస్త జీవులు ప్రకృతిలో భాగమని మనకు తెలుస్తుంది. అందుచేత ఎవరిని హింసించినా అంటే ఏ జీవిని, ఏ ప్రాణిని, ఏ మానవుని హింసించినా ప్రకృతిని హింసించినట్టే.

కానీ మానవులు ఇది గుర్తించక తమ స్వార్థం కోసం, తుచ్ఛమైన తమ కోరికలు నెరవేర్చుకోవడం కోసం ప్రకృతిని, ప్రకృతిలోని జీవులను నిత్యం ఎన్నో రకాలుగా హింసిస్తున్నారు. ప్రతీరోజు తమ రుచి కోసం ఎన్నో లక్షల జంతువులను క్రూరంగా చంపి భక్షిస్తున్నారు. రక్తపాతం సృష్టిస్తూ ప్రకృతికి బాధ కలిగిస్తున్నారు.

చెట్లను, అడవులను తమ ఇష్టానుసారం నరుకుతూ నాశనం చేస్తున్నారు. జంతువుల మధ్య పోటీలు పెట్టి, అవి బాధపడుతుంటే తాము వినోదిస్తున్నారు. పక్షులను, చిలుకలను పంజరాలలో పెట్టి, చేపలను తొట్టెలలో పెట్టి, తమ ఆనందం కోసం వాటికి స్వేచ్ఛ లేకుండా చేస్తున్నారు.

అంతే కాదు సాటి మానవులను, బలహీనులను, స్త్రీలను హింసిస్తున్నారు. దౌర్జన్యం చేస్తున్నారు. అమాయకులను, సామాన్యులను మోసగిస్తున్నారు. అలా ఎక్కడ చూసినా ప్రకృతి మీద హింస, దౌర్జన్యాలు పెరిగిపోయాయి. మోసాలు, గుండాయిజం పెరిగిపోయాయి. ఎవరికి వారు తమ గురించి చూసుకుంటు న్నారు కానీ ఇతరుల గురించి ఆలోచించడం లేదు. అందరూ తమ లాంటి వారే. అన్ని జంతువులు తమ లాంటివేనని ఆలోచించడం లేదు. అలా ప్రకృతి మీద హింస రోజు రోజుకూ అనేక రకాలుగా పెరిగిపోయింది.

ఎవరూ ప్రకృతి గురించి ఆలోచించడంలేదు. అసలు ప్రకృతి అంటే ఎవరు? ప్రకృతి పాత్ర ఏమిటి? ప్రకృతి వల్ల ప్రయోజనమేమిటి? ప్రకృతి వల్ల తాను పొందుతున్న లాభాలేమిటి? ప్రకృతి పట్ల తన ధర్మం ఏమిటి? అని ఎవరూ ఆలోచించడం లేదు. ప్రకృతి పట్ల తన ధర్మం నిర్వర్తించకపోతే ఏం జరుగుతుంది? వాటి వల్ల తనకు కలిగే నష్టం ఏమైనా వుందా? వుంటే ఎలా వుంటుంది? అసలు మానవులు ఇవేమీ లోచించడం లేదు. కానీ ఆలోచించాలి.

ఎందుచేతనంటే ప్రకృతి మానవులకు తల్లిలాంటిది. తల్లివడిలో బిడ్డలా మానవులు ప్రకృతిలో వడిలో జీవిస్తున్నారు. మనమంతా ప్రకృతికి తల్లి వడిలో వుండే పసిపిల్లలలాంటి వారం. పిల్లలకు తల్లి అన్ని అవసరాలు ఎలా చూస్తుందో ప్రకృతి తల్లి మనకు అన్నీ సమకూరుస్తుంది. మన అవసరాలకు, ఆనందాలకు కావలసినవన్నీ సమకూరుస్తుంది.

తల్లిపాలిచ్చి, ఆకలి తీర్చి, బొమ్మలతో ఆడిస్తూ ఆనందపరుస్తుంది. పిల్లవాడి ఆనందం చూసి పరవశించిపోతుంది. ముద్దాడి మురిసిపోతుంది.

అలాగే ప్రకృతి తల్లి తన అందాలైన హిమాలయాలు, జలపాతాలు, నదులు, రమణీయ దృశ్యాలు లాంటి వాటితో మనల్ని ఆనందపరుస్తుంది. సస్యాలు, పళ్ళు, కాయగూరలతో ఆకలి తీరుస్తుంది. నీటిని ఇచ్చి దాహం తీరుస్తుంది. గాలిని ఇచ్చి హాయిని చేకూరుస్తుంది. పుష్కలమైన పంటలు ఇస్తుంది. సకాలంలో

వర్షాలు కురిపిస్తుంది. చెట్లు, మొక్కలు, విరగ కాసేటట్లు చేస్తుంది. పూసేటట్లు చేస్తుంది. అందరూ ఆనందంగా వుంటే మురిసిపోతుంది. అంతా తనని ప్రేమిస్తుంటే పరవశించిపోతుంది.

తల్లిపాలు త్రాగితే తల్లి ఆప్యాయంగా నిమురుతుంది. కానీ తల్లిపాలు త్రాగుతూ రొమ్ము కొరికితే, గుద్దితే తల్లి ఆగ్రహిస్తుంది. దండిస్తుంది. పిల్లవాని చర్యలు మితి మీరితే పాలే ఇవ్వనంటుంది. అపుడు పిల్లవాడు తల్లడిల్లుతాడు.

అలాగే మనం విపరీత చేష్టలు అంటే జీవహింస, మాంసభక్షణ లాంటివి చేస్తే, ప్రకృతి తన ఆగ్రహాన్ని వైపరీత్యాల ద్వారా అంటే భూకంపాలు, వరదలు, సునామీలు, తుఫానులు, అడవుల దహనం లాంటి వాటి ద్వారా మనకు బుద్ధి చెబుతుంది. వర్షాలు పడవు. కరువు, కాటకాలు ఏర్పడతాయి. మానవులు తల్లడిల్లుతారు. అందుచేత భూమి మీద వున్న చరాలు కానీ, అచరాలు కానీ ప్రకృతిలో భాగమే. వేటినీ హింసించకూడదని తెలుసు. అన్నిటినీ ప్రేమించాలి. అవసరాలకు ఉపయోగించుకుంటూ, అంతవరకు మాత్రమే పరిమితమవ్వాలని తెలుసు కోవాలి.

పాలు త్రాగితే తల్లి చనిపోదు. తల్లికి బాధకలుగదు. భారం తగ్గుతుంది. అలాగే చెట్లకున్న పళ్ళు, కూరగాయలు కోస్తే చెట్లు చనిపోవు. చెట్ల భారం తగ్గుతుంది. అందుచేత కూరగాయలు, పళ్ళు కోసుకోండి. కానీ చెట్లను నరకకండి. కొమ్మలు విరవకండి. పూలను కోయకండి. అన్ని విషయాలలో అవసరాలకు పరిమితమవ్వండి. పరిమితులు పాటించండి.

**"ప్రకృతిని హింసిస్తే తల్లిని హింసించిన దానితో సమానం".** ప్రకృతి నుండి **అన్ని అవసరాలు తీర్చుకుంటూ ప్రకృతిలోని వాటిని హింసించడమంటే తల్లి పాలు త్రాగి తల్లి రొమ్ము గుద్దినట్టే.** వాడికంటే ద్రోహి ఎవరూ వుండడు. వాడు శిక్షార్హుడు. అలా భూమి మీద జరుగుతుండడం వల్లే ఈ ప్రకృతి వైపరీత్యాలు జరుగుతున్నాయి.

**"ప్రకృతి వైపరీత్యం అంటే మానవుల బాధలు సహించలేని, ఓర్చుకోలేని ప్రకృతి తల్లి ఆగ్రహించడమే".** తన బిడ్డలను శిక్షించడమే. వారికి బుద్ధి చెప్పడమే. ప్రకృతి వైపరీత్యాలు వస్తున్నాయంటే మానవులు ప్రకృతి పట్ల తమ ధర్మం నిర్వర్తించడం లేదనే అర్థం.

అంతేకానీ ప్రకృతి ప్రకోపించింది. కోపగించింది. కృష్ణమ్మ ఉగ్రరూపం దాల్చింది. మళ్ళీ శాంతిస్తుంది అనుకుంటూ, అదేదో సహజమనుకుంటూ, ప్రకృతిలో అలా అప్పుడప్పుడు జరుగుతాయనుకుంటూ నిర్లక్ష్యంగా మళ్ళీ హింస చేస్తే మానవులు మరల ప్రకృతి ఆగ్రహానికి బలి కావలసిందే.

తల్లి అస్తమాను బిడ్డను శిక్షించదు కదా? ఓర్చుకోలేనపుడే శిక్షిస్తుంది. అలాగే ప్రకృతి అస్తమాను తన కోపాన్ని ప్రదర్శించదు. మానవుల ప్రవర్తన మితిమీరినప్పుడే శిక్షిస్తుంది.

ప్రకృతి కోపిస్తే మానవుడు విలవిలలాడిపోతాడు. ఆర్తనాదాలు చేస్తాడు. తట్టుకోలేడు. అందుచేత గుర్తుంచుకోండి. ప్రకృతి పట్ల మన ధర్మాన్ని తెలుసుకోవాలి. ప్రకృతిని ప్రేమించాలి. హింసించకూడదు. అంటే జంతువులను చంపకూడదు. మాంస భక్షణ చేయకూడదు. స్త్రీలను గౌరవించాలి. బలహీనులను, అల్పులను రక్షించాలి. ఇదే ప్రకృతి పట్ల మన ధర్మం.

ఈ ధర్మాన్ని తెలుసుకోవాలన్నా, ఆచరించాలన్నా ఎవరైనా 'ధ్యానం' చెయ్యవలసిందే. 'ధ్యానం' విశేషంగా చేస్తే ప్రకృతి గురించి ప్రకృతి ధర్మాల గురించి తెలుసుకోగలుగుతారు. ప్రకృతికి అనుగుణంగా జీవించగలుగుతారు. ప్రకృతి అంటే భగవంతుని సహకారంతో ఆనందంగా జీవించగలుగుతారు.

**" అపజయం కూడా విజయంలో**
**ఒకానొక ముఖ్యమైన మెట్టే! "**

**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "యజ్ఞమే ముక్తికి మార్గం!"

శ్లో॥ యజ్ఞ శిష్టాశిన స్సన్తోముచ్యన్తే సర్వకల్బిషైః
భుఞ్జతే తే త్వఘం పాపాయే పచ న్త్యాత్మకారణాత్!!

భ॥గీ॥ (3–13)

తా:– "యజ్ఞంలో మిగిలిన దానిని తినే సజ్జనులు సమస్త పాపాల నుంచి విముక్తులు అవుతారు; అయితే ఏ పాపులు తమ స్వంత శరీర పోషణ నిమిత్తమే అన్నం వండుకుంటున్నారో వారు పాపాన్నే తింటున్నారు.

యజ్ఞం అంటే లోకకళ్యాణార్థమై చేసే పని.

మానవులలో రెండురకాల వాళ్ళు ఉంటారు. (1) తమ కోసం కర్మలు చేసేవారు. (2) లోక కళ్యాణం కోసం కర్మలు చేసేవారు.

యజ్ఞం చేసేవారికి యజ్ఞ ప్రసాదం లభిస్తుంది. అంటే లోకకళ్యాణకరమైన పనులు చేసినపుడు, అంటే ఇతరులకు ఆనందం కలిగించే పనులు చేసినపుడు వారు సంతుష్టులై ఇచ్చే దాన్నే, యజ్ఞ ప్రసాదం అంటారు. అలా యజ్ఞ ప్రసాదంతో జీవించేవారు ముక్తిని పొందుతారు. అలా కాక తమ కోసం జీవించే వారు తమకు తాము వండుకుని తినాలి. అలా తమకు తాము వండుకుని తినేది పాపపు కూడు అవుతుంది. అలాంటి వారు బంధంలో చిక్కుకుంటారు. దుఃఖం పొందుతారని పై శ్లోకం ద్వారా శ్రీ కృష్ణ భగవానుని సందేశం.

తమకు తాము వండుకునేది పాపపు కూడా ఎలా అవుతుంది? అన్న సందేహం కలగవచ్చు. కానీ ఎవరికి వారు వండుకునేది కూడా పాపపు కూడే అవుతుంది. కారణం బ్రతకాలంటే కూడు అవసరం. కూడు సంపాదించడానికి కృషి అవసరం. కృషి చేసేటప్పుడు తెలియకుండానే ఎన్నో పాపాలు చేస్తుంటాం. అంటే పొలం దున్నేటప్పుడు ఎన్నో పురుగులు, కీటకాలు, చనిపోతూ వుంటాయి. ఎలుకల్ని చంపుతూ వుంటాం. మందులు చల్లేటప్పుడు ఎన్నో జీవులు చనిపోతూ వుంటాయి. వీటి వల్ల పాపం వస్తుంది. బంధం కలుగుతుంది. బ్రతుకు తెరువు కోసమే చేస్తున్నా, సంపాదిస్తున్నా, వండుకుంటున్నా, తింటున్నా, అది పాపం చేస్తూ సంపాదించడం వల్ల పాపపు కూడు అయ్యింది. అందుచేత ఎవరికి వారు వండుకు తినేది పాపపు కూడే అవుతుంది.

మరి ముక్తి పొందాలంటే, యజ్ఞ ప్రసాదంతో జీవించాలి. యజ్ఞ ప్రసాదం అంటే ఇతరులకు ఆనందం కలిగించే పనులు చేసినపుడు వారు సంతుష్టులై

ఇచ్చేది. అందుచేత **"మన కోసం మనం జీవిస్తే బంధం. ఇతరుల కోసం జీవిస్తే ముక్తి అని తెలుసుకోవాలి".**

తన కోసం జీవించేవాడికి ఎన్నో కావాలి, ఎన్నో సమకూర్చుకోవాలి. ఆహారం కావాలి, ఇల్లు కావాలి, బట్ట కావాలి, ఇంటిలో సౌకర్యాలు కావాలి. ఇలా ఎన్నో కావాలి. వీటి కోసం పాపాలు చెయ్యడం తప్పనిసరి. ఇల్లు వున్నవాడు ఇంటిని శుభ్రం చేసుకోవాలి. తప్పదు. మరి ఇల్లు శుభ్రం చేసేటపుడు ఎన్ని చీమలు, దోమలు, బొద్దింకలు, ఎలుకలు లాంటివి చంపుతామో. ఎంత పాపం మూటకట్టుకుంటామో! అలా బంధంలో చిక్కుకోవడం వల్ల ఎన్ని బాధలు అనుభవించవలసి వస్తుందో! ఆలోచించండి.

బ్రతకటానికే ఎన్నో పాపాలు చేయవలసి వస్తుంటే మరి వినోదం కోసం, విలాసం కోసం, తుచ్ఛమైన కోరికల కోసం, సరదాల కోసం ఎన్ని పాపాలు చేస్తున్నావెూ? జంతువుల్ని చంపి మాంసం తింటే! ఎంత పాపం మూటకట్టుకుంటామో! ఎప్పటికి ఈ బంధం నుంచి బయటపడతాం చెప్పండి. అందుచేత మన కోసం కాదు లోకం కోసం జీవించాలి. అలా లోకం కోసం జీవించే వాళ్ళకు ఈ పాపాలు చేసే అవకాశమే లేదు.

కారణం లోక కళ్యాణ కరమైన పనులు చేసేవాడు! అంటే యజ్ఞాలు చేసేవాడికి వాడి ఆహారం వాడు సంపాదించుకోనక్కరలేదు. వాడికి పురుగు మందులు చల్లవలసిన పని లేదు. వేటినీ చంపవలసిన పని వుండదు. అన్నిటినీ చంపి పాపం మూట కట్టుకోవలసిన పని లేదు. అందరి ఇళ్ళు అతనివే. వారంతా శుభ్రం చేసి అమర్చిన ఇంటిలో విశ్రమిస్తాడు. దానికి పాపాలు చెయ్యవలసిన అవసరమే వుండదు. అంటే పాపం చెయ్యడు. పైగా అందరికీ ఉపకారమే చేస్తుంటాడు. **"పాపాలు చెయ్యకుండా ఉపకారం చేసేవాడు ఖచ్చితంగా ముక్తి పొందుతాడు".**

అంతేకానీ **"ఉపకారం చెయ్యకుండా పాపాలు చేస్తూంటే దుఃఖం కలగకుండా ఎలా వుంటుంది?"** అందుచేత ధ్యానం చెయ్యండి. ధ్యానం అందరికీ చెప్పండి. ధ్యానం నేర్పించడమే అందరికీ అన్ని రకాలుగా ఉపకారం కలిగించే పని. ధ్యాన ప్రచారం చేసే వారికి ఎక్కడికి వెళ్ళినా ఆదరణ లభిస్తుంది. అందరూ గౌరవంగా చూస్తారు. ఆదరిస్తారు. ప్రేమతో ఆశ్రయమిస్తారు. అదే "యజ్ఞ ప్రసాదం". అంతకు మించిన గొప్ప యజ్ఞం లేదు. అందుచేత ధ్యానం చేస్తూ, చెప్తూ, అందరికీ ఉపకారం చేస్తూ, యోగిలా జీవించండి. ముక్తిని పొందండి.

# "గుడి - ధ్యాన మందిరం!"

గుడి దేనికి? ధ్యాన మందిరం దేనికి? అన్న ప్రశ్నకు పత్రీజీ చెప్పిన వివరణ.

గుడి హరిద్వారము లాంటిది. ధ్యానమందిరం హరిధామములాంటిది. హరిద్వారము అంటే హరి వుండే ప్రదేశాన్ని సూచించేది. హరిధామము అంటే హరి వుండే ప్రదేశం. హరి ధామములోనే హరి వుంటాడు కాబట్టి హరిధామం లోనికి వెడితేనే హరి కనిపిస్తాడు. అంతే కానీ హరిద్వారం దగ్గర హరి ఉండడు, కనిపించడు.

హరిద్వారం ఎందుకు? అంటే లోపల హరి ఉంటాడని చెప్పడానికి మాత్రమే. హరి ద్వారమే లేకపోతే హరి ఎక్కడ వుంటాడో కూడా తెలియదు. అసలు హరి వున్నాడో లేడో కూడా తెలియదు. అందుకే లోపల వున్న ఆలయాలకు కూడా ఎక్కడో వీధి మొదట్లో ద్వారాలు ఏర్పాటు చేస్తారు.

అంటే గుడులు దేనికి అంటే ధ్యాన మందిరాలను చూపించడానికి, ధ్యానమందిరాలలో ప్రవేశించడానికి. అక్కడ 'ధ్యానం' చేయించి భగవత్ సాక్షాత్కారం కలిగించడానికి. గుడి దేనికి అంటే భగవంతుడనే వాడు వున్నాడని తెలియజెప్పడానికి. అసలు గుడే లేకపోతే భగవంతుడనేవాడు వున్నాడన్న సంగతే సామాన్య మానవులకు తెలియదు. అంతే కానీ గుడిలో భగవంతుడు ఉంటాడని కాదు.

ద్వారం దగ్గర దేవుడి బొమ్మలు పెడతారు. లోపల వున్నాడు అని చెప్పడానికి. అలాగే గుడి లోపల కూడా విగ్రహం పెడతారు. కారణం భగవంతుడు నీ లోపల వున్నాడని చెప్పడానికి.

దీని అంతరార్థం తెలుసుకుని గుడికి వెళ్ళిన ప్రతీ ఒక్కరూ ధ్యాన మందిరంలోకి వెళ్ళి, ధ్యానం చేసి అంతర్ముఖులై మీలో వున్న ఆ భగవంతుని సత్యరూపాన్ని దర్శించండి. తరించండి.

భగవంతుడు అంటే అందరిలో ఆత్మ రూపంలో వున్నాడని చెప్పడమే!

**" పరులకు అపకారం చేస్తే పాపం !**
**పరులకు ఉపకారం చేస్తే పుణ్యం !**
**మనకు మనం ఉపకారం చేసుకుంటే మోక్షం !"**
**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "పెద్దల వద్దకు రిక్త హస్తాలతో వెళ్ళకూడదు"

పెద్దల వద్దకు గాని, రాజు వద్దకు గాని, గురువు వద్దకు గాని, దైవం వద్దకు గాని వెళ్ళేటపుడు రిక్తహస్తాలతో అంటే ఖాళీ చేతులతో వెళ్ళకూడదు. ఏదో ఒకటి తీసుకు వెళ్ళాలి అంటారు.

ఏదో ఒకటి తీసుకు వెళ్ళడమంటే మనకు ఇష్టమైనది, మనకు నచ్చినది తీసుకు వెళ్ళటం కాదు. ఎవరి కోసం తీసుకు వెళుతున్నామో, వారు మెచ్చేది తీసుకు వెళ్ళాలి. ఎదుటి వారిని ఆనంద పరిచేది, వారి మనస్సును ఆకట్టుకునేది తీసుకు వెళ్ళాలి. సామాన్యంగా సామాన్యులు వస్తు రూపేణా సామాన్యమైనవే తీసుకు వెళ్ళగలరు. వస్తువులు ఏవైనా గొప్పవారికి సామాన్యమైనవే అవుతాయి. అవి వారికి అల్పమైనవి అవుతాయి. వాటికి వారు ముగ్ధులు కాలేరు. ఆనందం పొందలేరు. వస్తువులు గొప్పవారిని రంజింప చేయలేవు. అందుచేత సామాన్యులు గొప్పవారి దగ్గరకు తీసుకు వెళ్ళవలసినవి గొప్పవై వుండాలి.

అందులోను భగవంతుని దగ్గరకు తీసుకు వెళ్ళవలసినవి ఇంకా గొప్పగా వుండాలి. అంతేగానీ సామాన్యమైన కొబ్బరికాయలు, అరటి పళ్ళు లాంటివి కాదు. గురువులను, భగవంతుని ఆకర్షించేవి ధనం, కానుకలు, పళ్ళు కాదు. మనం చేసే మంచిపనులు, మన మంచి గుణాలు, మంచి ప్రవర్తన. లోకకళ్యాణకరమైనవి మాత్రమే. అలాంటి పనులు చేసి వారి దగ్గరకు వెళ్ళినపుడు వారు తప్పక ఆనందపడతారు. సంతుష్టి చెందుతారు. మనం అడగకపోయినా మనకు కావలసినవి అనుగ్రహిస్తారు. అందుచేత రిక్తహస్తాలతో కాదు, మంచి కార్యాలు చేసి, వారి ఆశయాలకు అనుగుణంగా ప్రవర్తించి వాటిని కానుకగా సమర్పించాలి. ఈ కానుకలు పైకి కనిపించకపోయినా వారిని ఆనంద పరుస్తాయి. వారికి తృప్తినిస్తాయి.

కానీ స్వార్థ గురువులు, స్వార్థపరులైన పెద్దలు వస్తువులను, కానుకలను ఆశిస్తారు. ఎంత విలువైనవి ఇస్తారా! అని చూస్తారు. ధనాన్ని ఆశిస్తారు. అలాంటి అల్ప కానుకలు ఆశించేవారు అల్పులు కాక ఏమవుతారు?

అదే భగవంతుడయితే ఏది ఇచ్చాము? అని చూడడు. అది ఇవ్వటానికి మన ఉద్దేశ్యం ఏమిటని చూస్తాడు. స్వార్థ బుద్ధితో, ఆశించి ఇస్తున్నామా? లేక ఏమీ ఆశించకుండా భక్తి భావంతో ఇస్తున్నామా? అన్నదే చూడబడుతుంది. భావం శుద్ధమైతేనే భగవంతుడు ప్రీతితో ఏదైనా స్వీకరిస్తాడు. అంతేకాని పెద్ద కానుకకు

పెద్ద ఫలితం, ఇంకా పెద్ద కానుక ఇస్తే ఇంకా పెద్ద ఫలితం వస్తుందని ఆశించేవారికి ఆశాభంగమే కలుగుతుంది.

ఇదే విషయం గీతలో ఈ క్రింది శ్లోకం ద్వారా చెప్పబడింది.

**శ్లో॥ పత్రం, పుష్పం, ఫలం, తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి**
**తదహం భక్త్యుపహృతం అన్నామిప్రయాతాత్మనః (భ.గీ.9-26)**

తా:- ఎవడు నాకు భక్తితో ఆకును కానీ, పువ్వును కానీ, పండుని కానీ, జలమును కానీ సమర్పిస్తే దానిని నేను ప్రీతితో స్వీకరిస్తాను.

అంటే ఏ స్వల్ప వస్తువైనా సరే భక్తితో సమర్పించినపుడు నేను సంతుష్టి చెందుతాను అని తెలియజేయడం జరిగింది.

అంటే ఇక్కడ వస్తువు కంటే కూడా ఆ వస్తువు సమర్పించడానికి గల భావానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడుతుందని మనం అర్థం చేసుకోవచ్చు.

అన్నింటికంటే 'నేను'ను సమర్పిస్తే భగవంతుడు వెంటనే పూర్తిగా వశమవుతాడు. సత్యభామ అహంకార భావంతో టన్నుల బంగారం సమర్పించినా భగవంతుడు ఒరగలేదు. కానీ అహంకారం లేని రుక్మిణీదేవి 'తులసీదళం' సమర్పించగానే భగవంతుడు వశుడయ్యాడు.

అలాగే గజేంద్రమోక్షంలో గజరాజు ఇంక నా వల్ల కాదు 'నేను' లేను, అంతా నువ్వే అన్నపుడు; ద్రౌపది చేతులు జోడించినపుడు భగవంతుడు వెంటనే ఆదుకున్నాడు. అందుచేత సమర్పించవలసింది అల్పమైన కానుకలు అంటే అరటిపళ్ళు, కొబ్బరికాయలు, మొక్కులు కాదు. సమర్పణ అంటే తన్ను తానే సమర్పించుకోవాలి. అంటే 'నేను'ను సమర్పించాలి. 'నేను' అనేదే మనస్సు. అందుచేత 'రిక్త మనస్సు' సమర్పించాలి. అదే అన్నింటికంటే గొప్ప కానుక. కారణం 'నేను' అనే అహంకార పూరితమైన మనస్సు లేకపోతే ఉండేది 'ఆత్మ' దానిని సమర్పించాలి.

దానినే "ఆత్మ నివేదన అని, ధ్యానం అని కూడా"అంటారు. ధ్యానం చెయ్యడమంటే 'నేనును' సమర్పించడమే. అందుచేత ధ్యానం చెయ్యండి. భగవంతునికి ఇష్టులుకండి.



# "ఆత్మనివేదన!'

## (ఆలయాలలో కొబ్బరి నివేదనకు అంతరార్థం)

భక్తులను 9 రకాలుగా పేర్కొన్నారు. వారిలో (1) శ్రవణం చేసేవారు. (2) మననం చేసేవారు. (3) కీర్తనలు చేసేవారు. (4) పాద సేవలు చేసేవారు, (5) అర్చనలు చేసేవారు, (6) వందనాలు చేసేవారు, (7) దాస్యం చేసేవారు, (8) సఖ్యం చేసేవారు వున్నారు. కానీ వీరందరి కంటే కూడా 9వ వారైన 'ఆత్మ నివేదన' చేసే భక్తులంటే షిరిడి సాయిబాబాకు చాలా ఇష్టం. ఆత్మ నివేదనే ఆయనకు ప్రీతికరమైనది. మిగిలిన అన్ని రకాల భక్తుల కంటే ఆయనకు అత్యంత ప్రీతికరమైన వారు ఆత్మ నివేదన చేసే వారేనని ఆయన చెప్పడం జరిగింది.

మరి బాబాకు ఇష్టులు కావాలన్నా, ఆయనకు ఇష్టమైనది నివేదించాలన్నా, అంటే ఆయన ఇష్టపడేది సమర్పించాలన్నా, **'ఆత్మనే నివేదించాలి'.** నిజమైన భక్తుడు ఎవరు? అంటే, **"కష్టమైనదైనా దేవునికి ఇష్టమైనది సమర్పించినవాడే".** అంటే ఏ భక్తుడైనా సరే తనకు ఎంత కష్టమైనా దేవునికి ఇష్టమైన పని చేసినవాడే దేవునికి ఇష్టుడవుతాడు. అపుడే ఆయన అనుగ్రహం పొందగలుగుతాడు.

గుర్తుంచుకోండి దేవుని అనుగ్రహం కలగాలంటే **"మనకు దేవుడు ఇష్టమైతే సరిపోదు. మనం దేవునికి ఇష్టులు కావాలి"**. ఇదిముఖ్యం. అందుచేత మనకి ఇష్టమైనవి సమర్పించడం కాదు. దేవునికి ఇష్టమైనవి సమర్పించాలి. అది కష్టమైనా సరే!

మరి షిరిడీ సాయిబాబాకు ఇష్టమైనది ఏదీ అంటే "ఆత్మ నివేదన". మరి ఆత్మను నివేదించాలంటే ఎలా? ఏం చెయ్యాలి? ఒక్క సాయిబాబాకే కాదు, అందరి దేవుళ్ళకు ఇష్టమైన ఆత్మ నివేదనా మార్గాన్ని పూర్వకాలపు పెద్దలు మనకు కొబ్బరి నివేదన ద్వారా చూపించారు. అంటే ఆలయాలలో కొబ్బరి నివేదించటానికి కారణం, అంతరార్థం అదే. ఏ ఆలయాలలో చూసినా, ఎక్కడ చూసినా అన్నిటికంటే కొబ్బరి నివేదనకు ప్రాముఖ్యం ఇస్తారు. కొబ్బరి నివేదన, ప్రాముఖ్యం సంతరించుకోవడానికి అంతరార్థం ఇదే. కొబ్బరి నివేదనే ప్రశస్తమైనదని పూర్వీకులు పేర్కొనటానికి కారణం, అంతరార్థం ఇదే. కొబ్బరి నివేదనకు అర్థం 'ఆత్మ నివేదనే!' ఆత్మనివేదనను సూచించేదే కొబ్బరి నివేదన. అందుకే కొబ్బరికి అంత ప్రాశస్యత.

ఎందుచేతనంటే కొబ్బరికాయ లోపల (అంతరంలో) వున్న స్వచ్ఛమైన తెల్లటి కొబ్బరిని నివేదించాలంటే ముందు పైన వున్న తొక్కతియ్యాలి. తరువాత

పనికి రాని పీచు వలవాలి. తరువాత తెల్లటి కొబ్బరిపైన గట్టిగా వున్న పెంకును బద్దలు కొట్టాలి. అప్పుడు కొబ్బరి కనపడుతుంది. అప్పుడే దాన్ని నివేదించగలం. అప్పుడు తియ్యటి నీరు కూడా లభిస్తుంది.

అలాగే అంతరంలో వున్న స్వచ్ఛమైన, ప్రకాశవంతమైన 'ఆత్మ'ను నివేదించాలంటే మొదట పైన వున్న తొక్కలాంటి శరీరాన్ని వదలాలి. అంటే కళ్ళుముయ్యాలి. తరువాత లోపల మనసులో పనికి రాని 'అరిషడ్ వర్గాలు' అంటే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే గుణాలు అనే పీచును తొలగించాలి. ఆ తరువాత 'ఆత్మ'ను ఆవరించి గట్టిగా పెంకులా వున్న 'నేను' అనే అహంకారాన్ని పగలగొట్టాలి. అంటే తొలగించాలి. అప్పుడే మనకు కొబ్బరి లాంటి స్వచ్ఛమైన, ప్రకాశవంతమైన ఆత్మ సాక్షాత్కారమవుతుంది. అంటే కనబడు తుంది. అప్పుడే ఆత్మను నివేదించగలం. అప్పుడే మనకు తియ్యటి నీరు లాంటి అంతులేని ఆనందం కూడా లభిస్తుంది. శాశ్వతానందం లభిస్తుంది. జన్మధన్యమవుతుంది.

"కొబ్బరి నివేదించడమంటే అర్థం ఆత్మను నివేదించాలని". దేవుడు కొబ్బరి ఇష్టపడతాడు అంటే ఆత్మను ఇష్టపడతాడని అర్థం. మరి అలా ఆత్మను నివేదించా లంటే చేయవలసింది 'ధ్యానం'. 'ధ్యానం' ద్వారానే **"ఆత్మ నివేదన"** చెయ్యగలం.

ధ్యానంలో మొదట కళ్ళు మూస్తాం. దేహాన్ని వదులుతాం. తరువాత "శ్వాస మీద ధ్యాస" వుంచి మెల్లి మెల్లిగా మనసును నిశ్చలపరుస్తాం. మెల్లిగా మనస్సు శుద్ధి చేస్తాం అంటే నిర్మలం చేస్తాం. అరిషడ్ వర్గాల ప్రాముఖ్యం లేకుండా చేస్తాం. ఆ తరువాత నేను అన్న అహంకారాన్ని కూడా తొలగిస్తాం. ఆత్మ స్థితిలో వుంటాం. అలా ఆత్మను నివేదిస్తాం.

ధ్యానం చెయ్యనివారు కొబ్బరిని మాత్రమే నివేదించగలరు. అలా కొబ్బరిని నివేదించిన వారు దేవుని విగ్రహాన్ని మాత్రమే దర్శించగలరు. కానీ కొబ్బరి సమర్పించడంలోని అంతరార్థం గ్రహించి ధ్యానం ద్వారా ఆత్మను నివేదించినవారు ఆ దేవుని సత్య రూపాన్ని అంటే నిజమైన దేవుణ్ణే దర్శించగలరు.

అందుకే షిరిడీ సాయిబాబా ఆత్మ నివేదన చెయ్యమన్నారు. అంటే ధ్యానం చెయ్యమనే బాబా వారి సందేశం. అందుకే బాబా వారి ఆలయాలలో ధ్యాన మందిరాలు నిర్మించటానికి కారణం. అందుచేత గుళ్ళలో కొబ్బరికాయలు సమర్పించడంతో సరిపెట్టక, అక్కడే వున్న ధ్యాన మందిరంలో ధ్యానం చేసి, ఆత్మ నివేదన ద్వారా విగ్రహాన్ని కాకుండా, 'దేవుడ్నే' దర్శించండి. 'దేవుని'కి ఇష్టులు కండి. జీవితాలు ధన్యం చేసుకోండి. ఇదే బాబా సందేశం.

# "అంతా ఆయనే! - అన్నీ ఆయనే!"

భగవంతుని శక్తితోనే సమస్త జీవులు మనుగడ సాగిస్తున్నాయి. ఆ శక్తి లేకపోతే ఏ జీవి సృష్టిలో జీవించలేదు, మనుగడ సాగించలేదు. మానవుడు నడుస్తున్నా, పనిచేస్తున్నా, మాట్లాడుతున్నా, ఆలోచిస్తున్నా, చూస్తున్నా అన్నిటికి కారణం భగవంతుడే. ఆయన శక్తే. ఆ శక్తే లేకపోతే మానవుడు ఇవేమీ చేయలేడు. శరీరం శవమైపోతుంది.

అందుచేత మానవుడు ఏమి చేసినా దానికి కారణం భగవంతుని శక్తే. అందుచేత అన్నీ ఆయన చేయిస్తున్నట్టే. ఆయన వుంటేనే మానవుడు మాట్లాడతాడు లేకపోతే మాట్లాడలేడు. అంటే మాట్లాడుతున్నది ఆయనే కదా? చేస్తున్నది ఆయనే కదా? చూస్తున్నది ఆయనే కదా? అలా అంతా ఆయనే కదా?

ఆయన లేకపోతే ఏదీ జరగనపుడు జరుగుతున్నవన్నీ ఆయన వల్లే కదా? ఆయన చేస్తున్నట్లే కదా? ఆయన లేకపోతే ఒక దుష్టుడు హత్య చెయ్యలేడు. ఒక దొంగ అపహరించలేడు. ఒక వ్యాపారి మోసగించలేడు. ఒక సన్మార్గుడు మంచి చెయ్యలేడు. ఒక ధర్మాత్ముడు ధర్మం చెయ్యలేడు. ఒక మహాత్ముడు సేవ చెయ్యలేడు. అందుచేత అంతా ఆయనే! అన్నీ ఆయనే!

ఆయన లేకపోతే లోకమే లేదు. ఆయన లేకపోతే ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు. కొంతమంది అంటూంటారు అంతా ఆయనే, అన్నీ ఆయనే అయినపుడు లోకంలో ఆయన చెడు ఎందుకు చేయిస్తున్నాడు. దుర్మార్గాలు ఎందుకు జరుగుతాయి? మోసాలు ఎందుకు జరుగుతున్నాయి? ఆయన మోసాలు చేయిస్తాడా? దుర్మార్గాలు చేయిస్తాడా?

అంటే ఇక్కడ వున్నది అంతా ఆయనే అయినా, అంతా ఆయన వల్లే జరుగుతున్నా! మానవులు ఈ విషయం గ్రహించక 'నేనే' అనే అహంకారం 'నాదే' అనే గర్వంతో చేయకూడని పనులు, పాపాలు చేస్తున్నారు. అంతా ఆయనే అయినపుడు అంతా ఒకటే కదా? కానీ మానవులు అంతా వేరు వేరు అనే భావంతో జీవిస్తున్నారు. రాగ ద్వేషాలు ప్రదర్శిస్తున్నారు. అందుచేతే లోకంలో ఇంత అశాంతి, ఇన్ని మోసాలు, దౌర్జన్యాలు, కొట్లాటలు, తగవులు. మంచిపనులు చేసేవారు కూడా 'నేనే' చేస్తున్నాను అనే భావంలో వుంటున్నారు. మంచి చేస్తూ, మంచిగా ప్రవర్తిస్తూ 'నేనే' అన్న అహాన్ని ప్రదర్శిస్తున్నారు. వీరు కూడా అసలు సత్యాన్ని గ్రహించలేకపోతున్నారు.

ఇక్కడ అంతా జరుగుతుంది. అంతే కానీ ఎవరూ ఏమీ చేయటం లేదు. అంతా వుంది. అంతే కానీ ఎవరిదీ కాదు. ఇదే అసలు 'సత్యం'. అందుచేత ఏది చేసినా 'నేను' అనే భావం లేకుండా చెయ్యాలి. 'కతృత్వ భావం' లేకుండా చెయ్యాలి.

"ఈశ్వరుడి ఆజ్ఞ లేకుండా చీమైనా కుట్టదు" అంటారు. అంటే ఈశ్వరుడు లేకపోతే చీమ కూడా కుట్టలేదు అని అర్థం. చీమలాంటి చిన్న జీవైనా కుట్టాలంటే ఈశ్వరుని శక్తి వుండవలసిందే? ఆ శక్తే లేకపోతే చీమ కూడా శవమైపోతుంది. శవమైన చీమ ఎలా కుడుతుంది? అందుచేత ఈశ్వరుని ప్రమేయం వుంటేనే చీమ కుట్టగలదు. సృష్టిలో జరిగే ప్రతీ దానికి ఆయన ప్రమేయం వుంది. ఆయన లేకుండా ఏదీ జరగదు.

గమనిస్తే ఉద్భవించేవన్నీ లయమై పోతున్నాయి. అంటే అన్నీ శూన్యం లోంచి పుట్టి మరల శూన్యంలో లయమైపోతున్నాయి. అంటే చివరకు ఏదీ లేదు, కానీ అంతా ఉన్నట్టుగా వుంది. అంటే అంతా మాయే. అంతా శూన్యమే. అంతా భ్రమే.

గమనిస్తే ఒకసారి కనిపించిన దేహం, సృష్టిలో మరల ఉద్భవించడం లేదు. అంటే ఒక పేరుతో ఉన్నవారు మరల రావడం లేదు. ఎప్పుడూ కొత్తవారే. ఎప్పుడూ కొత్తదనమే. సృష్టిలో ఎప్పుడూ నూతనత్వమే. ఎప్పుడూ మార్పులే. ఏదీ శాశ్వతం కాదు. ఇదే సృష్టి ధర్మం.

అన్ని భగవంతుని నుంచి ఉద్భవించినవే. వాటినే 'ప్రకృతి' అంటాం. అన్నీ ఆయనచే నడపబడుతున్నాయి. ఆయననే 'పురుషుడు' అంటాం. ఈ సృష్టి అంతా 'పురుష, ప్రకృతి'ల కలయిక. మానవులు కూడా అంతే. కారణం పాంచ భౌతికమైనది మానవ దేహం. అంటే ప్రకృతిలోని పంచ భూతాలతో ఏర్పడింది. అటువంటి ఈ దేహాన్ని నడిపించేది. 'ఆత్మ' అంటే 'పురుషుడు'. అందుచేత "అంతా ఆయనే అన్నీ ఆయనే". ఇదే సృష్టి రహస్యం. ఈ సృష్టి రహస్యం ధ్యానం చేస్తేనే తెలుస్తుంది. ఇది తెలుసుకుంటే మోక్షం సిద్ధిస్తుంది.

**" గ్రంథాలు చదివితే పండితులు,**
**ధ్యానం చేస్తే ఋషులు "**

**- బ్రహ్మర్షి పత్రీజీ**

# నామస్మరణ అంటే?

"యస్య నామ మహద్యశః" అన్నారు అంటే ఎక్కడ నామం ఉంటుందో అక్కడ యశస్సు వుంటుందని అర్థం.

అలా అనటానికి ముఖ్య కారణం భగవంతుని ప్రతీ నామానికి విశేషమైన అర్థం వుంది. ఉదాహరణకు :-

బ్రహ్మము = అన్నిటికంటే గొప్పవాడు.
ఈశ్వరుడు = సామర్థ్యము కలవాడు.
పరమేశ్వరుడు = ఈశ్వరులకే ఈశ్వరుడు.
న్యాయశాలి= ఎప్పుడూ అన్యాయం చెయ్యనివాడు.
దయాళువు = అందరిపై కృపచూపేవాడు.
సర్వశక్తివంతుడు= తన సామర్థ్యంతో జగత్తుకు సృష్టి, స్థితి, లయాలు చేయగలవాడు.
బ్రహ్మ = జగత్తులోని వివిధ పదార్థాలు నిర్మించేవాడు.
విష్ణు = అంతటా, అన్నిటా, వ్యాపించి రక్షించేవాడు.
రుద్రుడు= ప్రళయాన్ని సృష్టించేవాడు.
మహాదేవుడు= సమస్త దేవతలకు దేవుడు.

ఇవన్నీ గుణ, కర్మాలు తెలిపేనామాలు. అలా పరమేశ్వరుని నామాల అర్థాలు తెలిసికొని, ఆయన గుణకర్మ స్వభావాలకనుగుణంగా తమ స్వభావాలు మార్చుకోవాలి. దానినే పరమేశ్వరుని "నామస్మరణ" అంటారు. స్వభావాన్ని మార్చేదే నామస్మరణ. స్వభావం మారకపోతే అది నామస్మరణే కాదు.

"హరేరామ, హరేకృష్ణ" "ఓం నమః శివాయ" అంటే పాపాలు తొలగవు, అలా తొలగితే లోకంలో పాపాత్ములే వుండరు. అంతేకాదు పాపాలు చెయ్యటానికి కూడా ఎవరూ భయపడరు. నామస్మరణలో పాపాలు తొలగు తాయనే మూఢవిశ్వాసంతో పాపాలు చేస్తూ, జీవితాన్ని నాశనం చేసుకుంటున్నారు. దాని వల్ల చివరకు జీవితం దుఃఖమయమవుతుంది.

తెలుసుకోండి **"స్మరణ కాదు, నామార్థానికి అనుగుణమైన ఆచరణ ముఖ్యం".** ముఖ్యంగా నామస్మరణ చేసేవారు, తమ స్వభావం తాను స్మరించే నామానికి అనుగుణంగా మారుతుందా? లేదా? అని గమనించుకోవాలి. అలా మార్పు రాని నామస్మరణ వల్ల ప్రయోజనం లేదు. ఇదే నామస్మరణలోని అంతరార్థం.

# తీర్థాలంటే?

లోకంలో చాలా మంది తీర్థయాత్రలు చేస్తుంటారు. దానికి ముఖ్య కారణం. తీర్థ యాత్రల వల్ల పుణ్యం వస్తుందని కొంతమంది, పాపాలు పోతాయని కొంతమంది, ఏదో మంచి కలుగుతుందని కొంతమంది భావిస్తారు. ఎంతో ధనాన్ని వెచ్చించి, ఎన్నో బాధలకు ఓర్చి తీర్థ యాత్రలు చేస్తుంటారు. ముఖ్య కారణం పై లాభాల కోసమే. కానీ 'తీర్థాలంటే' ఏమిటి? అన్నది తెలుసుకోరు. ఏ అర్థం తెలుసుకోకుండా చేసే పనులన్నీ వ్యర్థమే అవుతాయి.

అందుకే అన్నారు "జనౌయైరన్తివాని తీర్థాని!" అంటే, జనులు దేని వలన దుఃఖాన్నుండి తరిస్తారో అవే తీర్థాలు! అంటే "తరింప చేసేవే తీర్థాలు". అంతే కాని జలాలు, స్థలాలు, తీర్థాలు కావు.

వేదాలవంటి సత్యశాస్త్రాలను చదవటం, సజ్జన సాంగత్యం, పరోపకారం, ధర్మాచరణ, అహింస, వైరం లేకుండా ఉండడం, కల్మషం లేకుండా ఉండడం, సత్యాన్ని చెప్పడం, ఆచరించడం, జ్ఞానసముపార్జన లాంటివి దుఃఖం నుండి తరింపచేస్తాయి. అందుచేత వీటిని తీర్థాంలంటారు.

అంతేకానీ స్థలాలు తిరిగినా, జలశయాలలో మునిగినా పాపాలు పోవు. జలాలతో, స్థలాలతో పాపాలే కనుక పోతే, లేనివారికి ధనం, అంధులకు చూపు రావాలి కదా? కుష్టురోగులకు రోగం పోవాలి కదా? చెవిటివారికి వినికిడి రావాలి కదా? అలా ఎక్కడా జరగటం లేదు కదా? అలా జరిగితే ఈ హాస్పిటల్స్ అన్నీ దేనికి? మరి అలా జరగడం లేదంటే మానవుడు తరించలేదనేగా అర్థం. తరించలేదంటే అది తీర్థం కాదనేగా? మరి నిజంగా తరింపచేసే తీర్థాలేమిటో తెలుసుకుందాం.

ఎన్ని శాస్త్రాలు చదివినా, ఎన్ని సత్యబోధలు విన్నా, ఎన్ని సాంగత్యాలు చేసినా చివరకు తెలిసేదేమిటంటే మానవుడు దుఃఖం నుంచి తరించాలంటే (1)సత్యాన్ని ఆశ్రయించాలి, (2) ధర్మాన్ని ఆచరించాలి.

ధర్మం అంటే అహింసను పాటించాలి. అంటే జీవహింస చేయకూడదు. అలాగే సత్యాన్ని అంటే ఆత్మను ఆశ్రయించాలి. అంటే ధ్యాన సాధన చెయ్యాలి. యీ రెండే మానవుని తరింపచేసేవి. అందుచేత అవే నిజమైన తీర్థాలు.

# "జపమా? ధ్యానమా?"

భగవంతుడు ఓంకారరూపుడు అంటూ 'ఓంకారాన్ని' జపిస్తారు. కానీ 'ఓంకారాన్ని' జపిస్తే భగవంతుని జపించినట్లు కాదు. మనలో నిరంతరం ధ్వనించే ఆ 'ఓంకారాన్ని' వినాలి. అప్పుడే భగవంతుని దృష్టిలో వున్నట్టు.

మరి 'ఓంకారాన్ని' జపిస్తున్నాము కానీ అంతరంలోని 'ఓంకార' ధ్వని వింటున్నామా? అంటే లేదు కదా? అంతరంలోని ఓంకార నాదాన్ని వినలేని జపాల వల్ల ఫలితం శూన్యం. మరి అంతరంలోని 'ఓంకారాన్ని' వినాలంటే, అంతర్ముఖులై అంతర్ నిశ్శబ్దాన్ని సాధించాలి. అంతర్ నిశ్శబ్దం లేకుండా అంతరంలోని ఓంకార నాదం వినలేం. ఓంకార నాదం వినకుండా ఆత్మ సాక్షాత్కారం కలుగదు. జీవితం ధన్యం కాదు.

చాలా మంది జపం ద్వారా భగవంతుని పొందవచ్చు అనుకుంటారు. కానీ జపంతో అంతర్ నిశ్శబ్దం సాధించలేరు. కారణం లోపల ఏ శబ్దము లేకపోయినా నామ శబ్దం అవుతుంది. నిశ్శబ్ద స్థితి రాలేదు. అంటే అంతర్ నిశ్శబ్దం సాధించలేదు.

మరి అంతర్ నిశ్శబ్దం సాధించాలంటే ఏమి చెయ్యాలి? అంటే ధ్యానం చెయ్యాలి. ధ్యానమంటే అంతరంలో నిశ్శబ్దంగా వుండడం. అంతరంలో గందరగోళంగా వుండే మనస్సును పూర్తిగా శాంతపరచడం, విశ్రాంతినివ్వడం. ఇది "శ్వాస మీద ధ్యాస" ఉంచడం వల్ల మాత్రమే సాధించగలం. అప్పుడే అంతరంలోని ఆ ఓంకారాన్ని వినగలం. మెల్లిగా భగవత్ సాక్షాత్కారం పొందగలం.

**" నరుడు నుంచి నారాయణుడు**
**కావడమే అందరి జీవిత లక్ష్యం "**

**- బ్రహ్మర్షి పత్రీజీ**

# మానవుని కర్తవ్యం?

మానవుడు తన జీవితంలో ఎన్నో కర్తవ్యాలు నెరవేరుస్తున్నాడు. కానీ తన అసలు కర్తవ్యమేమిటో తెలుసుకోలేకపోతున్నాడు.

మానవుడు తన పట్ల నిర్వర్తించవలసిన కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నాడు. తిండి, బట్ట, ఇల్లు సమకూర్చుకోవడంలో, అలాగే సంసారం పట్ల నిర్వర్తించవలసిన కర్తవ్యం కూడా నిర్వర్తిస్తున్నాడు. భార్య పట్ల, పిల్లల పట్ల తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తున్నాడు. స్నేహితుల పట్ల, సమాజం పట్ల తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తున్నాడు. అన్నిటి పట్ల తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తున్నాడు. కానీ అసలైన కర్తవ్యాన్ని మరచిపోయాడు.

ఎందుచేతనంటే ఎవరి వల్ల తాను జీవించి వున్నాడో తెలుసుకోవడం లేదు. అలాగే జీవితంలో ఎన్నో రకాలుగా ఆనందాన్ని పొందుతున్నాడు. అంటే తనకున్న పంచ ఇంద్రియాల ద్వారా అంటే కళ్ళతో సినిమాలు చూస్తూ, టి.వి.లు చూస్తూ, ప్రకృతిలో సుందరమైన ప్రదేశాలు, దృశ్యాలు చూస్తూ ఎంతో ఆనందం పొందుతున్నాడు. అలాగే ప్రతీ పూట నచ్చినవి తింటూ రకరకాల పదార్థాలు, వంటకాలు ఆరగిస్తూ ఆనందాన్ని పొందుతున్నాడు. నచ్చిన పాటలు, వీనుల విందైన సంగీతం, ధ్వనులు వింటూ ఆనందిస్తున్నాడు. నచ్చినవి వాసన చూస్తూ సెంట్లు, అగరబత్తీలు, సువాసనలు చూస్తూ ఆనందిస్తున్నాడు. కానీ ఇవన్నీ ఎవరి వల్ల పొందగలుగుతున్నాడో తెలుసుకోలేకపోతున్నాడు. కానీ తెలుసుకోవాలి. వారి పట్ల తన కర్తవ్యమేమిటో కూడా తెలుసుకోవాలి. అవి తప్పనిసరిగా నిర్వర్తించాలి.

ఎందుచేతనంటే చూస్తున్నాడు కానీ ఎవరి వల్ల చూడగలుగుతున్నాడో తెలుసుకోవడం లేదు. తింటున్నాడు కానీ ఎవరి వల్ల తినగలుగుతున్నాడో తెలుసుకోవడం లేదు. మాట్లాడుతున్నాడు, పాడగలుగుతున్నాడు. కానీ ఎవరి వల్ల ఇవి చేయగలుగుతున్నాడో తెలుసుకోవడం లేదు. అలాగే వింటున్నాడు కానీ ఎవరి వల్ల వినగలుగుతున్నాడో తెలుసుకోవడం లేదు. వాసన చూస్తున్నాడు కానీ ఎవరి వల్ల వాసన చూడగలుగుతున్నాడో తెలుసుకోవడం లేదు. సృష్టిస్తున్నాడు కానీ ఎవరి వల్ల సృష్టించగలుగుతున్నాడో తెలుసుకోవడం లేదు.

కానీ తెలుసుకోవాలి ఆయన పట్ల తన కర్తవ్యమేమిటో కూడా

తెలుసుకోవాలి. తాను ఏమి చెయ్యాలో తెలుసుకోవాలి. ఎందుచేతనంటే తాను చూసినా, మాట్లాడినా, తిన్నా, విన్నా, వాసన చూసినా, స్పృశించినా, నడిచినా, పనిచేయగలిగినా అన్నిటికీ కారణం 'ఆత్మే'. 'ఆత్మ' వల్లే తాను ఈ పనులన్నీ చేయగలుగుతున్నాడు. ఆత్మ ఉండబట్టే తాను ఇన్ని రకాలుగా జీవితంలో ఆనందాన్ని పొందగలుగుతున్నాడు. 'ఆత్మే' లేకపోతే తాను ఒక్క పని కూడా చెయ్యలేడు. 'ఆత్మే' కనుక శరీరం నుంచి తప్పుకుంటే శరీరం శవమై పోతుంది. శవం చూడదు, మాట్లాడదు వినదు. తినదు, ఏమీ చెయ్యలేదు. అంటే అన్నిటికీ కారణం 'ఆత్మే'.

మరి అలాంటి 'ఆత్మ' పట్ల తన కర్తవ్యం ఏమిటో? తాను ఏమి చెయ్యాలో? తెలుసుకోవాలి కదా! అంటే నిత్యమూ 'ఆత్మ' వల్ల అన్నీ చేయగలుగుతున్నాడు కాబట్టి నిత్యమూ 'ఆత్మ'ను గుర్తుంచుకోవాలి. కారణం ఇన్ని లాభాలు కలిగిస్తున్న 'ఆత్మ' ఎవరో కాదు. అందరూ ఇష్టపడే ఆ "భగవంతుడే". అందుచేత ఎవరివల్లనవుతే కళ్ళు చూడగలుగుతున్నాయో ఆయనను చూడటానికి ఆ కళ్ళను ఉపయోగించడమే మానవుని కర్తవ్యం. అలాగే ఎవరి వల్లనయితే చెవులు వినగలుగుతున్నాయో ఆయన గురించి వినటానికి చెవులను వినియోగించడమే మానవుని కర్తవ్యం. అలాగే ఎవరి వల్ల నోరు మాట్లాడగలుగుతుందో ఆయన గురించి మాట్లాడటానికి నోటిని ఉపయోగించడమే మానవుని కర్తవ్యం. ఎవరి వల్ల చేతులు, కాళ్ళు పని చెయ్యగలుగుతున్నాయో ఆయన సేవలకు వాటిని ఉపయోగించడమే మానవుని కర్తవ్యం. ఎవరి వల్ల మనస్సు పని చేస్తుందో ఆయన మీద మనస్సు నిలపడమే మానవుని కర్తవ్యం.

అంటే **"భగవంతునికి ఈ జీవితం అంకితం చెయ్యడమే మానవుని కర్తవ్యం".** అంటే అన్యము మీద కాకుండా 'ఆత్మ' మీద దృష్టి వుంచడమే మానవుని కర్తవ్యం. అంతరంలో వున్న ఆత్మ మీద దృష్టి వుంచాలంటే ధ్యానం చెయ్యాలి. కాబట్టి **"ధ్యానం చెయ్యడమే మానవుని అసలైన కర్తవ్యం".** అంతేకానీ ధన సంపాదన కాదు. పేరు ప్రఖ్యాతులు పదవులు సంపాదించడం కాదు. అందుచేత "ధ్యానం" చెయ్యండి. మీ కర్తవ్యాన్ని నిర్వర్తించండి.



# "దేహసౌందర్యం- ఆత్మ సౌందర్యం!"

లోకంలో అందరూ ఎక్కువగా దేహానికి ప్రాముఖ్యం ఇస్తారు. కారణం దేహం తామనే భావన. అలా దేహ అందానికి, దేహ ఆరోగ్యానికి, దేహ సుఖానికి ప్రాముఖ్యం ఇస్తూ దానికోసం పాటు పడుతూ వుంటారు. అలా దేహాన్ని అలంకరించడానికి, దేహం సౌష్టవంగాను, బలంగాను, ఆకర్షణీయంగా వుంచుకోవడానికి రకరకాల ప్రయత్నాలు చేస్తూ వుంటారు.

ఆడవారు శరీరం సన్నగా, నాజూకుగా వుండేలా, మగవారు కండలతో బలిష్టంగా వుండేలా చూసుకుంటారు. దాని కోసం రోజూ ఎక్సర్‌సైజులు, యోగాసనాలు, బరువులు ఎత్తడం లాంటివి చేస్తూ, పుష్టికరమైన ఆహారం తీసుకుంటూ దేహ సౌందర్యాన్ని కాపాడుకుంటారు. తమ దేహ సౌందర్యం చూసుకుని మురిసిపోతూ వుంటారు. తామే అందంగా, బలంగా వున్నామని గర్వపడుతూ వుంటారు. ఇంచుమించు ప్రతీ ఒక్కరూ రోజూ అద్దం ముందు నిలబడి తమ సౌందర్యం పెంచుకునే ప్రయత్నం చేస్తూ వుంటారు. ఇంచుమించు చాలా మంది ఆలోచన ఇలాగే వుంటుంది.

కానీ మానవులు ఆలోచించవలసింది దేహ సౌందర్యం గురించి మాత్రమే కాదు. ఆత్మ సౌందర్యం గురించి కూడా ఆలోచించాలి. కారణం "దేహం మనం కాదు ఆత్మే మనం". మానవులలో రెండు రకాల వారు వున్నారు. 'భోగులు- యోగులు'. భోగులు దేహ సౌందర్యానికి ప్రాముఖ్యం ఇస్తారు. కానీ యోగులు ఆత్మ సౌందర్యానికి ప్రాముఖ్యం ఇస్తారు. కారణం యోగులు, ఆత్మ నేను అని తెలుసుకున్నవారు. వీరు దేహం ఎలా వున్నా పట్టించుకోరు. దేహం నల్లగా వున్నా, పొట్టిగా వున్నా, జుట్టు వున్నా లేకపోయినా, అంగవైకల్యం వున్నా వీరు పట్టించుకోరు.

ఈ విషయం పురాణాలలో అష్టావక్రుని ఉదంతం ద్వారా మనం తెలుసుకోవచ్చు. ఆయన ఎంత వంకరగా వున్నా, వికారంగా వున్నా మహాజ్ఞాని. దేహాన్ని పట్టించుకోలేదు. దాని గురించి ఆలోచించలేదు. ఎవరు ఏమనుకున్నా ఆయన లెక్క చేయలేదు. ఎంతసేపూ ఆత్మ తాను కాబట్టి ఆత్మ సౌందర్యానికే ప్రాముఖ్యం ఇచ్చాడు. గొప్పవాడయ్యాడు.

దేహాన్ని అందంగా వుంచుకోవడం వల్ల, చూసిన వారు మనం బాగున్నామని అనుకోగలరు. అంతకన్నా ప్రయోజనం లేదు. కానీ ఆత్మ సౌందర్యాన్ని పెంచుకునే యోగులు లోకానికి ఎంతో ఉపకారం చెయ్యగలరు. వారు అందరికీ ఎంతో జ్ఞానాన్ని, ఆనందాన్ని పంచగలరు. వారు తాము ఆనందంగా జీవిస్తారు. అందరికీ ఆనందం కలిగిస్తారు.

ఇంకా ఆలోచిస్తే దేహ సౌందర్యం తాత్కాలికం. వయస్సు పెరిగే కొద్దీ, ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా సౌందర్యం తగ్గిపోతూ వుంటుంది. కానీ ఆత్మ సౌందర్యం శాశ్వతం. వయస్సు పెరిగినా దాని వన్నె తగ్గదు. దాని పరిమళం వారి గుణాలలోను, వారి పనులలోనూ ప్రతిబింబిస్తూనే వుంటుంది.

దేహ సౌందర్యం రోగాలను, దుఃఖాన్ని నివారించలేదు. కానీ ఆత్మ సౌందర్యం వున్నవారు ఆరోగ్యంగా, ఆనందంగా వుంటారు. దేహసౌందర్యం వారి చెడు గుణాలను, అలవాట్లను మార్చలేదు. కానీ ఆత్మ సౌందర్యం పెరిగే కొద్దీ వారి చెడు గుణాలు తొలగిపోతాయి. వారి చెడుఅలవాట్లు పోతాయి.

దేహం ఎంత అందంగా వున్నా సత్యాన్ని గుర్తించలేరు. ధర్మాన్ని ఆచరించలేరు. కానీ ఆత్మసౌందర్యం వున్నవారు, ధర్మయుక్తంగా జీవిస్తారు. సత్యాన్ని అనుసరిస్తారు. అందుచేత ఆత్మ సౌందర్యమే గొప్పదని ప్రతీ ఒక్కరూ తెలుసుకోవాలి. ఆత్మ సౌందర్యం పెంచుకోవటానికి ప్రయత్నించాలి.

మరి దేహాన్ని అందంగా వుంచుకోవడం అందరికీ తెలుసు కానీ, 'ఆత్మ సౌందర్యం' పెంచుకోవడం, సామాన్యులకు తెలియదు. 'ఆత్మ సౌందర్యం' పెంచుకోవాలంటే ఒక్కటే మార్గం. అదే 'ధ్యానం'. యోగులంతా ధ్యానం చేసి తమ ఆత్మ సౌందర్యాన్ని పెంచుకున్నారు. ఏ మానవుడైనా ధ్యానం చేస్తే ఖచ్చితంగా వారి 'ఆత్మ సౌందర్యం' పెరుగుతుంది. 'ఆత్మ సౌందర్యం' పెంచుకోవడమంటే భగవంతుని లక్షణాలు. గుణాలు సంతరించుకోవడం.

మనకి దేహ సౌందర్యం కనిపిస్తుంది కానీ 'ఆత్మ సౌందర్యం' ఎలా కనిపిస్తుంది? అని సందేహం రావచ్చు. కానీ 'ఆత్మ సౌందర్యం' వారి మాటలు, పనులు బట్టి తెలుసుకోవచ్చు. వారి సంస్కారాన్ని బట్టి తెలుసుకోవచ్చు. వారి ఆలోచనలను బట్టి కూడా ఎవరికి వారు తెలుసుకోవచ్చు.

ఎందుచేతనంటే 'ఆత్మ సౌందర్యం' వున్నవారి మాటలు, పనులు

ధర్మయుక్తంగాను, సత్యపరంగాను వుంటాయి. వారు అందరినీ ప్రేమిస్తారు. ఎవరినీ ద్వేషించరు. నిస్వార్థంగా వుంటారు. కోరికలు వుండవు. తృప్తిగా నిర్భయంగా జీవిస్తారు. ఎప్పుడూ శాంతిగా, ఆనందంగా జీవిస్తారు. శీతోష్ణాలను లెక్క చేయరు. సుఖ దుఃఖాలు గురించి ఆలోచించరు. మానావమానాలు పట్టించుకోరు. జీవహింస చేయరు. అన్ని జంతువులను, ప్రాణులను ప్రేమిస్తారు. భూత దయ వుంటుంది. అంతా ఒక్కటే అన్నట్టుగా ప్రవర్తిస్తారు. ప్రాపంచిక విషయాలు మీద ఆసక్తి కనబరచరు. ధ్యాన సాధనకు, జ్ఞాన సముపార్జనకు, లోక సేవకు ప్రాముఖ్యం ఇస్తారు.

పై లక్షణాలు, గుణాలు ఆత్మ సౌందర్యానికి ప్రతీకలు ఇటువంటి ఆత్మ సౌందర్యాన్ని ప్రతిఒక్కరూ పెంచుకోవాలి. దానికి ధ్యానం చెయ్యాలి. అలా ప్రతీ ఒక్కరూ ధ్యానం చేసి "ఆత్మ సౌందర్యాన్ని" పెంచుకుంటే లోకమే ఒక స్వర్గంలా మారుతుంది. అందుచేత "దేహ సౌందర్యం కాదు. ఆత్మ సౌందర్యం గొప్పదని తెలుసుకోండి".

**" ఇతరుల దోషాలను చూడకుండా స్వంత దోషాలను సరిచేసుకోవాలి "**

**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "ఉప్పులాంటి వాడే యోగి!"

సముద్రపు నీటి మీద సూర్యకాంతి, వేడి పడితే తెల్లటి రుచినిచ్చే ఉప్పు వచ్చినట్టు, మానవుని మీద కూడా ధ్యానం, ఆత్మ తేజం పడితే, జ్ఞానం, స్వచ్ఛత కలిగిన యోగత్వం వస్తుంది.

సూర్యకాంతికి మేఘం అడ్డుపడితే ఉప్పు ఎలా తయారు కాదో? అలాగే ఆత్మకు మనస్సు అడ్డు పడితే మానవుడు యోగి కాలేడు.

ఉప్పు చవకైనా కూడా చాలా విలువైనది. అది లేకపోతే ఏ వంటకానికీ రుచి రాదు. అలాగే ఆత్మ తేజం పడినవాడు యోగిగా మారతాడు. చూడటానికి సామాన్యుడిలా వున్నా యోగి చాలా విలువైనవాడు. యోగి లేకపోతే ఏ ప్రాంతము పవిత్రం కాదు.

ప్రతీ ఒక్కరూ ఉప్పులా! అంటే యోగిలా ఉండాలి. అప్పుడే దుఃఖంతో వున్న వారి జీవితాలలో ఆనందం తీసుకురాగలరు. ఉప్పు వేసిన ఊరగాయలు ఎంతకాలమైనా చెడిపోవు. అలాగే యోగి వున్న ప్రాంతం ఎన్నాళ్లైనా పవిత్రంగా ఉంటుంది.

చెడగొట్టే స్వభావాన్ని ఉప్పుదూరం చేస్తుంది. అలాగే యోగి సమాజం పాడుకాకుండా చూడగలడు. చెడిపోకుండా చేస్తాడు. హింసాయుతం కాకుండా చెయ్యగలడు. నీవు ఉప్పువైతే అంటే యోగివైతే, చెడు నీ దరి చేరదు. చుట్టూ వున్న వారిని కూడా చెడు నుండి కాపాడగలవు.

సెంటు, అగరబత్తి గుప్పుమంటుంది కానీ కాసేపటికి వాసనే వుండదు. కానీ ఉప్పు గుప్పు మనకపోయినా ఎంతకాలమైనా దాని విలువ, రుచి తగ్గదు. దీర్ఘకాలం వుంటుంది. మరల మరల వేయనవసరం లేదు. అలాగే ధన అధికార బలం వున్నా ఆ గొప్పతనం కొంతకాలమే. కానీ యోగులు పైకి ఆర్భాటంగా కనబడకపోయినా వారి కీర్తి తగ్గదు.

అలా ఉప్పు లాంటి యోగిలా అవ్వాలంటే 'శ్వాస మీద ధ్యాస' వుంచాలి. ధ్యానం చెయ్యాలి. 'ధ్యానం' చేసి ఎంతోమంది యోగులయ్యారు. సమాజానికి మేలు చేశారు. అందుచేత అందరూ ధ్యానం చెయ్యాలి. "ఉప్పులాంటి సుగుణాలు కలిగిన యోగిలా తయారు కావాలి".

# "భగవంతుని గూర్చి తెలుసుకోవాలి!"

మానవుడు ఇంద్రియ సుఖాలకు బానిసై వాటి మీదే దృష్టి పెడుతున్నాడు. వాటి గురించే కృషి చేస్తున్నాడు. వాటి గురించే జీవిస్తున్నాడు. వాటికి బానిసై భగవంతుని తెలుసుకునే ప్రయత్నం చేయడం లేదు. ఆయన గురించి తెలుసుకోవటానికి సమయం కేటాయించడం లేదు.

ఏమైనా కాస్తో కూస్తో భగవంతుని తలచేది, తనకు సుఖాలు సమకూర్చమని, ఇంకా ఇంకా ఎక్కువ సుఖాలు సమకూర్చమని మాత్రమే. అంటే తన అవసరాలు, కోరికలు నెరవేర్చుకోవడానికి మాత్రమే. అంతే కానీ తన మొత్తం జీవితంలో  కొంతసమయం కూడా 'భగవంతుని' గురించి తెలుసుకోవడానికి కేటాయించడం లేదు.

తన విలాసాలకు ఎంతైనా సమయాన్ని కేటాయిస్తున్నాడు. ధనాన్ని ఖర్చు పెడుతున్నాడు. కానీ 'భగవంతుని' గూర్చి తెలుసుకోవటానికి ప్రయత్నించడం లేదు. ధనాన్ని ఖర్చుపెట్టడం లేదు.

మానవుడు కనుక తన వివేకం ఉపయోగిస్తే 'భగవంతుని' గూర్చి తెలుసుకోగలడు. సమస్తం 'భగవంతుడే' అని తెలుసుకోగలడు. ఈ విషయం తెలుసుకుంటే ఎవరినీ, ఏ ప్రాణిని, ఏ జీవిని హింసించడు. మోసగించడు. కష్టం కలిగించడు. నష్టపెట్టడు. పైగా అందరినీ ప్రేమిస్తాడు. సేవ చేస్తాడు. ఆనందపరుస్తాడు. అంటే పుణ్యాలే చేస్తాడు. నష్టపోడు, కష్టాల పాలు కాడు. తాను కూడా ఆనందంగా జీవిస్తాడు. అప్పుడు భూమే ఒక స్వర్గం అవుతుంది. అందుచేత అందరూ తమ వివేకాన్ని ఉపయోగించాలి.

ఎందుకంటే **"ప్రాముఖ్యం లేని విషయాల గురించి ఎంతో ఆలోచిస్తారు. కానీ సృష్టిలో అన్నిటి కంటే ప్రముఖమైన 'భగవంతుని' గురించి అసలు ఆలోచించడమే లేదు".** ఇదే అసలు మానవుని దుఃఖానికి కారణం, కష్టాలకు కారణం. ధ్యానం చేస్తే మానవుడు తన వివేకాన్ని ఉపయోగించగలడు. 'భగవంతుని' గూర్చి తెలుసుకోగలడు. జీవితంలో ఎన్నో లాభాలు పొందగలడు.



# "చెంతనే వుండే పరమగురువును గుర్తించండి!"

మూర్ఖ మానవులు అందరికంటే గొప్పవాడైన 'భగవంతుడు' తన చెంత, తన వెంట, తనకు అత్యంత సమీపంలో వుంటే ఆయన్ను గమనించలేక, ఆయన సలహాలు, సూచనలు గ్రహించక ఆయన చెప్పేది వినిపించుకోక ఇంకా ఎక్కడో ఏ స్వామీజీ చెపుతాడా? ఏ గురువు బోధిస్తాడా? ఏ అవధూత సలహా ఇస్తాడా? అని వెదుకుతూ వుంటారు. అన్వేషిస్తూంటారు. ఎలాగైనా తెలుసుకుంటే బాగుంటుందని ఆశపడుతూంటారు.

అలా తాపత్రయపడుతూ వుంటారు కానీ, అందరికంటే గొప్పవాడైన ఆ 'భగవంతుడు' చెప్పేది వినరు. ఆయన్ను గుర్తించరు. ఆయన్ను గమనించరు. ఆయన ప్రయత్నాన్ని తెలుసుకోరు.

ఆయన చెప్పే చిన్న చిన్న విషయాలు కూడా పాటించరు. పాటించలేరు. పైగా పెద్ద పెద్ద విషయాలు తెలుసుకోవాలనుకుంటారు. చిన్న విషయాలు పాటించలేనివారు. పెద్ద విషయాలు తెలుసుకుంటే మటుకు ప్రయోజనమేముంది? **"ఎన్ని తెలుసుకున్నామన్నది ముఖ్యం కాదు. ఎన్ని పాటిస్తున్నామన్నదే ముఖ్యం"** ఆచరణ లేనివి ఎన్ని తెలుసుకున్నా వ్యర్థమే.

గమనిస్తే అనంతమైన జ్ఞానం అంతరంలోని ఆత్మ నుంచి అంటే 'భగవంతుని' నుంచి అందుతూనే వుంటుంది. అంతరంలోనుంచి అన్ని ధర్మాలు బోధించబడుతూనే వుంటాయి. వాటిని గమనించిన వారికి ధర్మాలు తెలియకపోవడమంటూ వుండదు.

తెలుసుకోండి **"అంతరాత్మ రూపంలో వున్న భగవంతుని కంటే ధర్మసూక్ష్మాలు చెప్పగలవారెవరూ లేరు. భగవంతుని కంటే పరమ గురువులు ఎవరూ లేరు".**

అంతరాత్మను వినగలగడమే అన్నింటికంటే గొప్ప విశేషం. మానవులలో పరివర్తన కలుగుతుందంటే, మార్పు వస్తుందంటే ముఖ్య కారణం అంతరాత్మ ప్రబోధాన్ని, అంతరాత్మ సూచనలు పాటిస్తూ వుండడమే. అలా విన్నవారు అంతు లేకుండా ఎదుగుతూ వుంటారు. ఎన్నో ఆధ్యాత్మిక విజయాలు సాధిస్తారు. ఆధ్యాత్మికంగా ఎన్నో ఉన్నత శిఖరాలకు ఎదుగుతారు. వారు అందరినీ

ఆకర్షించగలుగుతారు. వారి మాటలు అందరికీ వేదవాక్కులలాగా అనిపిస్తుంటాయి.

కారణం వేదాలు కూడా ఆ 'పరబ్రహ్మ' నుంచి ఉద్భవించినవే. అందరికీ లోపల నుంచి సూచనలు చేసేది ఆ 'పరబ్రహ్మే'. అందుచేత ఎవరో గొప్పవారు. స్వామీజీలనుకుంటూ అక్కడకు ఇక్కడకు జ్ఞానం కోసం పరుగులు పెట్టనవసరం లేదు. అత్యంత సమీపంలో వున్న ఆ 'పరబ్రహ్మ'ను, ఆ 'భగవంతుని', ఆ 'సద్గురువును' ఆలకించడం, వినడం నేర్చుకోవాలి.

దానికి మార్గం మనస్సును ప్రశాంత పరచుకోవాలి. మనస్సులోని మాలిన్యాన్ని తొలగించుకోవాలి. మనస్సులో మాలిన్యాన్ని ఎంత తొలగించుకుంటే అంత ఎక్కువగా అంతరాత్మను అంటే 'పరమ గురువు'ను వినగలుగుతాం. ఆచరించగలుగుతాం.

అలా ఆచరించిన వారు జీవితంలో మంచి ఫలితాలు సాధిస్తారు. ఉన్నత శిఖరాలకు ఎదుగుతారు. వారికి తిరుగు వుండదు. చివరకు శాశ్వత ఫలితాలు కూడా సాధిస్తారు. గొప్ప యోగులవుతారు.

**"అత్యంత సమీపంలో వుండే 'పరమ గురువుని గుర్తించని వాడు పరమ మూర్ఖుడే అవుతాడు'. జీవితాన్ని నష్టపెట్టుకుంటాడు".**

ఇదే విషయాన్ని యాజ్ఞవల్క మహర్షి "ఈశావాస్యోపనిషత్"లో చెప్పడం జరిగింది.

**"ఎవరైతే ఆత్మ హంతకులో! అంటే తన స్వరూపమైన ఆత్మతత్వ సాక్షాత్కారం పట్ల నిర్లక్ష్యం చూపిస్తారో! అంటే ఆత్మను నిర్లక్ష్యం చేస్తారో వారు మరణానంతరం అజ్ఞానాంధకారం చేత ఆవరింపబడిన రాక్షసీయ జన్మలను పొందుతారు".**

ఈ సత్యాన్ని తెలుసుకుని చెంతనే వుండే ఆ పరమ గురువును గుర్తించండి. ధ్యానం ద్వారా అంతర్ముఖులైన వారే అంతరంలో వున్న ఆ 'పరమ గురువును'! అంటే 'ఆత్మను' అంటే 'భగవంతుని' గుర్తించగలుగుతారు. జీవితాన్ని ధన్యం చేసుకుంటారు. ధన్యులవుతారు. దివ్యులవుతారు. దివ్యత్వాన్ని పొందుతారు. పరమ పురుషులవుతారు. ఋషులవుతారు. బ్రహ్మర్షులవుతారు.



# "భగవంతుడు!"

'భగవంతుడు' అంటే 'శక్తి', అనంతమైన 'శక్తి'. కంటికి కనబడని 'రూపం లేని శక్తి'. ఆయన తన శక్తితో ఈ కనబడే సృష్టి చేశాడు. ఎన్నో జాతులు సృష్టించాడు. ఖనిజ జాతి, జంతు జాతి, మానవజాతి లాంటివన్నీ సృష్టించాడు. ఈ జాతులన్నీ మనుగడ సాగించడానికి, జీవించడానికి సరిపడా తన శక్తిని ఉంచాడు. వేటికి ఎంత అవసరమో అంతశక్తిని ఉంచాడు.

అలా వృక్ష జాతిలో కదలడానికి సరిపడా తన శక్తిని ఉంచాడు. అందుకే వృక్షాలు చలిస్తాయి. కానీ ఒక చోట నుండి ఇంకొక చోటుకు చరించలేవు. అదే జంతుజాతిలో ఇంకా ఎక్కువ అంటే చరించడానికి కావలసిన తన శక్తిని ఉంచాడు. అందుకే జంతువులు చలిస్తాయి, చరిస్తాయి. అలాగే మానవ జాతిలో పూర్ణశక్తిని వుంచాడు. అందుకే మానవుడు చలిస్తాడు, చరిస్తాడు, ఆలోచిస్తాడు.

ఖనిజాలలో అంటే రాళ్ళలో వున్న భగవంతుని శక్తి చాలా చాలా స్వల్పం. అందుకే రాళ్ళు కదలవు. అందుచేత రాళ్ళలో వున్న భగవంతుడు చాలా, చాలా చిన్నవాడు. రాళ్ళలో కంటే వృక్షాలలో భగవంతుని శక్తి ఎక్కువ వుంది. అందుకే రాళ్ళలోకంటే వృక్షాలలో వున్న భగవంతుడు పెద్దవాడు.

వృక్షాలలో వున్న భగవంతుని శక్తి కంటే, జంతువులలో వున్న శక్తి ఇంకా ఎక్కువ. అందుకే వృక్షాలలో వున్న భగవంతుడి కంటే, జంతువులలో వున్న భగవంతుడు ఇంకా పెద్దవాడు. అలాగే జంతువులలో వున్న భగవంతుని శక్తి కంటే, మానవులలో వున్న భగవంతుని శక్తి పూర్ణమైనది. అందుకే మానవులలో వున్న భగవంతుడు ఇంకా పెద్దవాడు.

రాయి కదలలేదు. మానవుడు అన్నీ చెయ్యగలుగుతున్నాడు. "ఎవరిలో భగవంతుని శక్తి ఎక్కువ వుంటే అదే పెద్ద భగవంతుడు". ఆ శక్తిని బట్టే ఆ జాతి పనితీరు వుంటుంది. భగవంతుని శక్తి ఎక్కువ వున్న వారే గొప్పవారు. అందుకే సృష్టిలో అన్నిటికంటే మానవుడు గొప్పవాడు. రాయికన్నా, వృక్షాల కన్నా, జంతువులకన్నా అన్నిటికన్నా మానవుడే గొప్పవాడు.

అందుకే రాళ్ళలో, వృక్షాలలో వున్న భగవంతుణ్ణి 'చైతన్యం' అంటారు. జంతువులలో, మానవులలో వున్న భగవంతుణ్ణి 'ఆత్మ' అని పిలుస్తారు. అంతేకాదు

జంతువులలో వున్నది 'సామూహిక ఆత్మలు' కానీ మానవుడిలో వున్నది 'ఏకాత్మ'. అంటే సృష్టిలో మనకు కనబడే అన్నిటి కంటే మానవుడే పెద్ద భగవంతుడు. మానవుని సృష్టే అత్యంత గొప్పది. భగవంతుడు అన్నిటిలో వున్నాడు. చైతన్యరూపంలో వున్నాడు. ఆ చైతన్యం వున్నవి కదులుతున్నాయి. లేనివి కదలడం లేదు.

అందుకే అంటారు "God sleeps in Stones, Awakes in Plants, Moves in Animals and Thinks in Man" అంటే రాళ్ళలో వున్న భగవంతుణ్ణి నిద్రావస్థతో పోలుస్తారు, అందుకే కదలవు. వృక్షాలలో వున్న భగవంతుడిని మెలకువ స్థితితో పోలుస్తారు. అందుకే కదులుతాయి. కాని నడవవు. అలాగే జంతువులలో వున్న భగవంతుణ్ణి చలించే స్థితితో పోలుస్తారు. అందుకే కదులుతాయి నడుస్తాయి. మానవులలో వున్న భగవంతుణ్ణి పూర్ణమైన స్థితితో పోలుస్తారు. అందుకే కదులుతాడు, నడుస్తాడు, ఆలోచిస్తాడు. అంతేకాదు ఎన్నో సృష్టించగలడు. సమస్త జీవులను తన ఆధీనంలో వుంచుకోవడమే కాదు, తన లాభాల కోసం వాటిని ఉపయోగించుకుంటున్నాడు కూడా. అందుకే 84 లక్షల జీవరాసిలో మానవుడే ఉన్నతమైన, శక్తివంతమైన వాడు. అలాగే సృష్టిలో ఖనిజ జాతి అంటే రాళ్ళు అన్నిటికంటే చాలా, చాలా తక్కువ శక్తి గల జాతి. వాటికి ఉనికే గానీ, చైతన్యం లేదు అంటే కదలలేవు.

మామూలు సైకిల్ ఉంటుంది కానీ ఇంజను శక్తి వుండదు. కానీ మోటారు బైక్‌కు కొద్దిపాటి ఇంజన్ శక్తి వుంటుంది. మోటార్ బైక్ కంటే కారు ఇంజన్ ఇంకా శక్తివంతమైనది. గొప్పది. కారుకంటే లారీ ఇంజన్ ఇంకా ఎక్కువ శక్తివంతమైనది. ఇంకా గొప్పది. ఇంజను శక్తిని బట్టి అది పనిచేసే విధానం, బరువులు లాగే సామర్థ్యం వుంటుంది.

ఇప్పుడు లారీ వచ్చి ఈ బరువు నేను లాగలేకపోతున్నాను. నువ్వు సాయం చెయ్యాలి నువ్వే దిక్కు అని సైకిల్‌కు మొరపెట్టుకుంటే సైకిల్ సాయం చెయ్యగలదా? లారీ చెయ్యలేని పని సైకిల్ ఎలా చేస్తుంది? అందుచేత లారీ తన పాట్లు తానే పడాలి.

అలాగే కదిలి, నడిచి, ఆలోచించి, ఎన్నో సృష్టి చేయగలిగిన మానవుడు తనకు వచ్చిన కష్టాలు తొలగించమని కదలలేని రాయిని ఆశ్రయిస్తే? రాయి ఏం

చేస్తుంది? అదే కదలలేక ఒక చోట పడి వుందే. అటువంటి రాయి వల్ల ఏమవుతుంది? మానవుణ్ణి రాయి ఎలా ఆదుకోగలదు? దాని శక్తి ఎంత? అసలు రాయిని అందమైన రూపంగా చెక్కింది, మార్చింది మానవుడేగా? విగ్రహంగా మార్చింది మానవుడే కదా? అంటే విగ్రహాన్ని సృష్టి చేసింది మానవుడే కదా? అంటే మానవుడే గొప్పవాడు కదా? అందుచేత మానవుడు తన పాట్లు తానే పడాలి.

భగవంతుని సృష్టిలో తక్కువ శక్తి కలిగింది రాయి మాత్రమే. అలాంటి రాయిని పూజించినా, ప్రార్థించినా ఫలితం వుండదు. అందుచేత భగవంతుడు ఎందులో, ఎలా వున్నాడో తెలుసుకోవాలి. దానికి తగ్గట్టు ప్రవర్తించాలి. మానవుడు తన కన్నా శక్తివంతుడైన భగవంతుని ఆశ్రయించాలి. ఆయన అందరిలో 'ఆత్మ' రూపంలో వున్నాడు. ఆయనను ఆశ్రయించాలంటే ధ్యానం ఒక్కటే మార్గం. కారణం "లో వున్నవాడు లోనికి వెళ్ళిన వాడికే లభిస్తాడు, దర్శనమిస్తాడు". బయట చూసేవాడికి అంతా గందరగోళమే. అందుచేత ధ్యానం చెయ్యండి. 'ఆత్మ సాక్షాత్కారం' అంటే "భగవత్ సాక్షాత్కారం" పొందండి. జీవితాన్ని ధన్యం చేసుకోండి.

అవగాహన కోసం భగవంతునిచే సృష్టింపబడిన 'రాయి'కి, భగవంతుని సత్యరూపమైన 'ఆత్మ'కు తేడా తెలుసుకుందాం.

| **రాయి** | **ఆత్మ** |
| --- | --- |
| 1. సృష్టిలో అన్నిటికంటే తక్కువ స్థితి | 1. అన్నిటికంటే వున్నతమైనది. |
| 2. ఘన రూపము | 2. సూక్ష్మాతి సూక్ష్మరూపము. |
| 3. శక్తి లేనిది | 3. అత్యంత శక్తివంతమైనది. |
| 4. చలించదు ఏదో ఒక శక్తి చలింపచెయ్యాలి. | 4. సృష్టిలోని అన్నిటిని చలింపచేస్తుంది. |
| 5. ప్రకాశం లేదు | 5. స్వయం ప్రకాశం కలిగినది. |
| 6. ఒక్కచోట వుండేది. | 6. అంతటా వుండేది. |
| 7. ఎన్నోరకాలు వున్నాయి | 7. ఒక్కటే |
| 8. మార్పు చెందుతుంది | 8. మార్పు చెందదు. |
| 9. అనిత్యమైనది | 9. నిత్యమైనది. |

| | |
|---|---|
| 10. శస్త్రంచే ఛేధింపబడుతుంది. అగ్ని దహించగలదు. నీరు తడుపగలదు. వాయువు కదపగలదు. | 10. ఏవీ ఏమీ చెయ్యలేవు. |
| 11. గుణాలు కలవు | 11. గుణాలు లేవు. |
| 12. జడము | 12. చైతన్యము. |
| 13. అశాశ్వతమైనది | 13. శాశ్వతమైనది. |

మరి 'రాయి' గొప్పదా? 'ఆత్మ' గొప్పదా? అంటే 'ఆత్మే' గొప్పదని చెప్పగలం. 'ఆత్మ' గురించి గీతలో ఈ విధంగా చెప్పబడింది.

**శ్లో॥ నైనం చిన్దన్తి శస్త్రాణి, నైనందహతిపావకః**
**నచైనంక్లొదయన్త్యాపో నశోషయతిమారుతః (భ.గీ.2-23)**

తా:- ఈ 'ఆత్మ'ను ఆయుధములు చేధించలేవు. 'అగ్ని' దహించలేదు. 'నీరు' తడుపలేదు. 'గాలి' మండించలేదు.

అందుచేత రాయి కన్నా ఆత్మ చాలా, చాలా గొప్పది. కారణం ఆత్మే సత్యమైన భగవంతుతుడు. ఇది అర్థం చేసుకుని ధ్యానం ద్వారా ఆత్మను ఆరాధించాలి. అంటే 'భగవంతుని' ఆరాధించాలి. అందుకే పత్రీజీ విగ్రహారాధన కాదు. సత్యారాధన చెయ్యాలి. అంటే ఆత్మారాధన చెయ్యాలి అంటారు.

**" ఎక్కువగా వినాలి**
**తక్కువగా మాట్లాడాలి "**
**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "నీరు - రాళ్ళు"

భగవంతుడు అన్నిటిని సృష్టించినపుడు తన అమోఘమైన మేధో సంపత్తిని వుపయోగించి వేటి అవసరం ఎంతో! వేటి స్థానమేదో! వేటికి ఎంత శక్తి కావాలో! చూసి దానికి తగ్గట్టుగానే సృష్టి చేశాడు. తనచే సృష్టింపబడిన వాటికి, వేటికి ఎంత శక్తి అవసరమో అంత శక్తిని ఉంచాడు. ఆయన సృష్టిలో లోపాలు ఏమీ లేవు. భగవంతుని సృష్టిని సరిగా అర్థం చేసుకోలేకపోవడమే మానవుని లోపం.

భగవంతుని సృష్టిలోని నీటికి, రాళ్ళకు తేడా గమనిద్దాం. రాళ్ళ కంటే నీటికి ఎక్కువ శక్తి ఇవ్వబడింది. అందుకే రాళ్ళు కదలలేవు, నీరు కదులుతుంది. అంటే చలిస్తుంది.

చూడండి నీటికి వున్న చలన శక్తి వల్ల, నీటి ప్రవాహంలో ఎన్నో కొండచరియలు విరిగి పడుతున్నాయి. గట్లు తెగిపోతున్నాయి. రోడ్లు కోసుకుపోతున్నాయి. పెద్ద వర్షం తరువాత నీటి ప్రవాహ వేగానికి ఎన్నో నష్టాలు జరుగుతున్నాయి. వెనుకా ముందు చూడదు. పల్లానికి పయనించాలనే తొందర. అంటే నీటి చలన శక్తి వల్ల ఎన్ని అనర్థాలు జరుగుతున్నాయో గమనించవచ్చు.

అలాగే రాళ్ళకు కూడా చలన శక్తి వుండి, రాళ్ళన్నీ అస్తమానూ కదులుతూ వుంటే ఇక ఎన్ని అనర్థాలు జరుగుతాయో. రాళ్ళే కనక కదిలితే వేసిన రోడ్లు మరునాడు వుండవు. ఇంట్లో పరచిన రాళ్ళు సాయంత్రానికి కనబడవు. గోడలు మాయమైపోతాయి. గుళ్ళో వుంచిన విగ్రహాలు గుళ్ళో వుండకుండా నడుచుకుని వెళ్ళిపోతాయి. మానవుడు ఎన్నో ఇక్కట్ల పాలవుతాడు. ఎన్నో బాధలు పడతాడు. ఏ ప్రక్క నుంచి ఏ రాయి వచ్చి తగులుతుందోనని భయమే కదా?

కదిలే జంతువులు, పాములు, తేళ్ళు, బొద్దింకలు, ఎలుకలు, జెర్రెలు, చీమలు, దోమలు వస్తేనే మానవుడు భయపడిపోతున్నాడు కదా! ఇంక రాళ్ళు వస్తే మానవుడి పరిస్థితి ఏమిటి?

అందుకనే ఇవన్నీ ఆలోచించే భగవంతుడు రాళ్ళలో చాలా, చాలా తక్కువ శక్తి వుంచాడు. అందుచేత సృష్టిలో రాయి స్థానమేదో! రాయి శక్తి ఎంతో! తెలుసుకోండి. అలాగే సృష్టిలో మానవుడి స్థానమేదో! మానవుడి శక్తి ఎంతో! తెలుసుకోండి. దానికి తగ్గట్టు ప్రవర్తించండి.

# "రాయి - ఆత్మ!"

సృష్టిలో ఎన్నో జాతులు వున్నాయి. వాటిలో ఖనిజ జాతి, వృక్ష జాతి, జంతు జాతి, మానవ జాతి లాంటివి.

వాటిలో అన్నిటికంటే తక్కువ స్థితి ఖనిజ జాతి అంటే రాయి. అంతకాన్న తక్కువ స్థితి సృష్టిలో లేదు. ఈ జాతులన్నీ భగవంతునిచే సృష్టింపబడినవే. సృష్టిలో ఈ జాతులన్నీ కనబడటానికి, ఉండటానికి, నడపబడటానికి కారణం కనబడని 'ఆత్మ'. 'ఆత్మ' సృష్టింపబడలేదు. అందుకే సృష్టిలో అన్నిటికంటే గొప్పది 'ఆత్మ'. ఆత్మకంటే గొప్పది సృష్టిలో మరొకటి లేదు. కారణం 'ఆత్మే' 'భగవంతుడు'. అందుకే 'ఆత్మ'ను 'బ్రహ్మ' అని కూడా పిలుస్తారు. బ్రహ్మం కంటే గొప్పది సృష్టిలో లేదు కదా?

మానవులు అన్నిటికంటే గొప్పదైన 'ఆత్మ' గురించి తప్ప మిగతా వాటన్నిటి గురించి తెలుసుకుంటున్నారు. అన్నిటిని అధ్యయనం చేస్తున్నారు. కానీ 'ఆత్మ' గురించి అధ్యయనం చేయట్లేదు. అంటే 'ఆత్మ'కు సంబంధించిన జ్ఞానం లేదు. పైగా అన్నిటికంటే తక్కువదైన రాయి గురించి ఎక్కువ అధ్యయనం చేస్తున్నారు. రాయిమీదే ఎక్కువ శ్రద్ధ చూపెడతారు. రాళ్ళకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారు.

మానవులు రకరకాల రాళ్ళను రకరకాలుగా ఉపయోగించు కుంటున్నారు. కొండ రాళ్ళను, బండ రాళ్ళను ఇళ్ళ నిర్మాణానికి, రోడ్లకు, ప్రాజెక్టులకు వాడతారు. కొన్ని రాళ్ళను ఇంటిలో నేలమీద పరుస్తారు. కొన్ని రాళ్ళను ఒంటి మీద నగలుగా ధరిస్తారు. కొన్ని రాళ్ళను అలంకారాలుగా తయారు చేసి అలంకరిస్తారు. అలాగే కొన్ని రాళ్ళను బొమ్మలుగా చేసి అలంకరిస్తారు. అలాంటి బొమ్మలు కొన్నిటిని పూజిస్తారు కూడా.

ఇలా రాళ్ళ మీదే దృష్టి పెడతారు. కాని, గొప్పదైన 'ఆత్మ' గురించి తెలుసుకోరు. కానీ ఎంతకాలం మానవులు గొప్పదైన 'ఆత్మ' గురించి తెలుసుకోరో అంతకాలం దుఃఖం లోనే ఉంటారు. ఎంతకాలం 'ఆత్మ'కు ప్రాముఖ్యం ఇవ్వరో అంతకాలం కష్టాలపాలవుతూనే వుంటారు.

ఎందుచేతనంటే మానవులు దైవమని భావించే విగ్రహాలు రాయితో చేయబడినవి మాత్రమే. కాని మానవులు ఇష్టపడే, ఆరాధించే దైవమే 'ఆత్మ'. 'ఆత్మ' దైవమైనా 'ఆత్మ' గురించి తెలుసుకోకపోవడం వల్ల రాయే దైవమని భావిస్తూ, భ్రాంతి పడుతూ నష్టపోతున్నారు. గొప్పదైన 'ఆత్మ'ను అంటే 'దైవాన్ని' వదలి

సృష్టిలోనే తక్కువ స్థితి కలిగిన రాళ్ళకు ఆకారాలు చెక్కి ఆశ్రయిస్తున్నారు. పైగా రాయిలో దైవము లేదా? అంటారు. రాయిలో వున్నది దైవమే కాని రాయి దైవము కాదని తెలుసుకోలేకపోతున్నారు. కాని రాయిలో వున్నది కూడా ఆత్మే అని తెలుసుకోలేకపోతున్నారు. ఆత్మను పట్టుకోకుండా రాళ్ళనే పట్టుకుంటున్నారు. జీవితాన్ని నష్టపోతున్నారు.

మానవుడు కష్టాల నుంచి బయట పడాలంటే ఎప్పటికైనా ఆత్మను అంటే దైవాన్ని గుర్తించాలి. ఆత్మ గురించి తెలుసుకోవాలి. 'ఆత్మ'కు సంబంధించిన జ్ఞానం పొందాలి. ఆత్మ గొప్పదనం, 'ఆత్మ' విశిష్టత తెలుసుకోవాలి. 'ఆత్మ'ను పట్టుకోవాలి. ఆత్మను అంటే సత్యమైన దైవాన్ని పొందాలి. అప్పుడే మానవునకు కష్టాల నుంచి విముక్తి.

ఎంతసేపూ విగ్రహమే దైవమంటారు కాని విగ్రహమంటే 'రాయి+దైవము' అని తెలుసుకోవాలి. అంటే రెండూ కలసి వున్నాయి. అంతే కానీ విగ్రహం దైవము కాదు. కానీ ఆత్మలో ఇంకొకటి కలిసి లేదు. స్వచ్ఛమైన, సత్యమైన భగవంతుడే 'ఆత్మ'. సత్యమైన ఆత్మే దైవం. ఇక్కడ ఇంకొకటి కలిసి లేదు. పూర్తిగా భగవంతుడే. ఆత్మే ఆయన పూర్తి స్వరూపం. అందుచేత దైవం యొక్క పూర్తి స్వరూపం పట్టుకున్న వాడు ధన్యుడు. తెలుసుకున్నవాడు ధన్యుడు. సృష్టిలో మానవుని కళ్ళకు కనబడే ప్రతీదీ కలిసిన దైవ రూపాలు మాత్రమే కాని ప్యూర్ కాదు. ఆఖరుకు మానవుడు కూడా దేహంతో కలిసిన దైవం అందుకే 'జీవాత్మ' అంటారు.

అలాగే సృష్టిలో కనిపించే ప్రతీదీ దైవంతో కలిసి వున్నదే. అంటే కొంచెం తక్కువ, ఎక్కువ దేవుళ్ళు. కనిపించే సృష్టిలో కొంచెం పెద్ద దేవుడు మానవుడు. అలాగే కనిపించే సృష్టిలో అతి తక్కువ దేవుడు రాయి అంటే విగ్రహం.

అందుచేత గమనించండి అన్నీ నీరే కానీ స్వచ్ఛమైన మినరల్ వాటర్‌కు, మురుగు కలసిన నీటికి తేడా వుంది. స్వచ్ఛమైన మినరల్ వాటర్ ఆరోగ్యాన్ని, ఆనందాన్ని ఇస్తుంది. మురుగు నీరు త్రాగితే రోగాలపాలవుతారు. దుఃఖం పొందుతారు. అందుచేత మినరల్ వాటర్ లాంటి సత్యమైన 'ఆత్మ'ను ఆశ్రయించండి.

ఇది మానవుడు గుర్తించి కలిసి వున్న రూపాల మీద కాకుండా స్వచ్ఛమైన, సత్యమైన ఆత్మమీద దృష్టి వుంచాలి. సత్యమైన దైవాన్ని, బ్రహ్మను పట్టుకోవాలి. అసలైన బ్రహ్మ అన్నిటిలో అంతర్యామిగా వున్నాడు. అందరిలో వున్న దైవాన్ని

అంటే ఆత్మను ఎవరూ ఈ కళ్ళతో చూడలేరు. దర్శించలేరు. కాని అంతరంలో వున్న దైవాన్ని అంతర్ముఖులై దర్శించవచ్చు. దాని మార్గమే 'శ్వాస మీద ధ్యాస' ధ్యానం.

రాళ్ళను ఉపయోగించుకునేవారు శక్తి హీనులు, ఆత్మను ఉపయోగించు కునేవారు అత్యంత శక్తివంతులు అవుతారు. మానవులలో రెండు రకాల వాళ్ళున్నారు. వారు భోగులు, యోగులు. 'భోగులు' రాళ్ళకు ప్రాముఖ్యం ఇస్తే 'యోగులు' ఆత్మకు ప్రాముఖ్యం ఇస్తారు. **"రాళ్ళను ఉపయోగించుకోవడం తెలిస్తే భోగము కానీ ఆత్మను ఉపయోగించుకోవడం తెలిస్తే 'యోగము' ".**

కారణం రాళ్ళలో రకరకాలు వుంటాయి. కానీ అంతటా అన్నిట్లో వున్న ఆత్మ ఒక్కటే. రాయి అశాశ్వతం కానీ ఆత్మ శాశ్వతం. రాయికి శక్తి లేదు. ఇంకొకరు కదపాలి. కానీ ఆత్మ తన అనంతమైన శక్తితో అన్నిటినీ కదుపుతుంది. చలింపచేస్తుంది. రాయి ప్రకాశించదు. ఆత్మ ప్రకాశిస్తుంది. రాయికి అలంకారం చెయ్యాలి. కానీ ఆత్మకు అలంకారం చెయ్యనవసరం లేదు. రాయిని శస్త్రం ఛేధించగలదు. అగ్ని దహించగలదు. నీరు తడపగలదు. కానీ ఆత్మను శస్త్రం ఛేధించలేదు, అగ్ని దహించలేదు. నీరు తడపలేదు.

అందుచేత రాళ్ళను అధ్యయనం చెయ్యడం కాదు. ఆత్మను అధ్యయనం చెయ్యాలి. **"రాళ్ళను అలంకరించుకుని శోభిల్లడం కాదు. ఆత్మజ్ఞానంతో శోభిల్లండి".** రాళ్ళను ఉపయోగించుకోవడం కాదు. ఆత్మను ఉపయోగించు కోవాలి. రాళ్ళను ఉపయోగించుకుంటే శక్తిహీనుడు. ఆత్మను ఉపయోగించు కుంటేనే శక్తిమంతుడవుతాడు. అందుచేత రాళ్ళ మీద కాదు, ఆత్మ మీద దృష్టిపెట్టాలి. ఆ మార్గమే ధ్యానం. యోగులు ఆశ్రయించిన మార్గం. ధ్యానం చెయ్యండి. ఆత్మను అంటే భగవంతుని పొందండి.

**" మానవుడిని దానవుడిగా చేసేది హింస,**
**మానవుడిని దివ్యుడిగా చేసేది - హంస "**

**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "ప్రాణప్రతిష్ఠ"

రాయి కదల్లేదు అంటే రాయిలో ప్రాణం లేనట్లేగా?

అందుకే రాయితో తయారు చేసిన విగ్రహానికి పండితులు ప్రాణ ప్రతిష్ఠ చేసి గుడిలో వుంచుతారు. అప్పుడే ఆరాధనకు అర్హమంటారు. వాటినే ఆరాధిస్తారు. అంటే ప్రాణ ప్రతిష్ఠ చేసిన విగ్రహాలే ఆరాధనకు అర్హమంటారు. మిగిలినవి కావంటారు. అందుకే గుడి బయట వున్న విగ్రహాలు దేవుని బొమ్మలైనా ఎవరూ పూజించరు. ఆరాధించరు. ప్రాణ ప్రతిష్ఠ చేసిన వాటినే పూజిస్తారు. ఆరాధిస్తారు.

ప్రాణ ప్రతిష్ఠ అంటే ఏమిటి? ప్రాణ ప్రతిష్ఠ అంటే విగ్రహంలో ప్రాణాన్ని ప్రతిష్ఠించడం అంటే వుంచడం. అంటే రాయితో చేసిన విగ్రహానికి మంత్రాలతో పొయ్యడం. దానినే ప్రాణ ప్రతిష్ఠ అని అంటారు.

ప్రతీ విషయంలోలాగే ఈ విషయంలో కూడా కొంచెం ఆలోచించ వలసింది వుంది. ప్రాణ ప్రతిష్ఠ చేస్తున్నారు అంటే! ఆకారం చెక్కిన విగ్రహంలో ప్రాణం లేదనేగా? మరి ప్రాణం పొయ్యడానికి కారణం ప్రాణమంటే దేవుడనే కదా!

ఇక్కడ ఆలోచిస్తే ప్రాణమే దేవుడు కానీ, విగ్రహం కాదని అర్థమవుతుంది. ఆలోచించండి ప్రాణం పోసిన విగ్రహం పవిత్రమైనపుడు ప్రాణమున్న ప్రతీదీ పవిత్రమైనదేగా? మరి ప్రాణమున్న ప్రతీ దానిని పవిత్రంగా చూస్తున్నామా?

ఇంకా ఆలోచిస్తే విగ్రహాల రూపాలు వేరైనా అన్నిటిలో పోసే ప్రాణం ఒక్కటేగా? అంటే అన్ని రకాల విగ్రహాలలో వున్న ప్రాణం ఒక్కటేగా? అంటే దేవుళ్ళంతా ఒక్కటేగా? మరి ఒక దేవుణ్ణి అంటే రూపాన్ని ప్రేమిస్తున్నాం, ఇంకొక దేవుణ్ణి అంటే రూపాన్ని ఎందుకు ద్వేషిస్తున్నారు? ఒక ప్రక్క ప్రాణం దేవుడంటున్నాం. ఇంకొక ప్రక్క రూపమే దేవుడన్నట్టుగా ప్రవర్తిస్తున్నాం.

ఇంకా ఆలోచించండి. అసలు ప్రాణ ప్రతిష్ఠ జరిగిందా? లేక మంత్రాలు మాత్రమే చదవడం జరిగిందా? విగ్రహంలో ప్రాణం పోసినట్లు ఎలా తెలుస్తుంది? దేనిని బట్టి తెలుసుకోవాలి? మంత్రాలను బట్టి మాత్రమేనా? లేక ఇంకా ఏమైనా ఆధారాలు వున్నాయా? అన్నది కూడా ఆలోచించాలి.

మరి ప్రాణ ప్రతిష్ఠ చేసి ప్రాణం పోస్తే విగ్రహం ఎందుకు కదలట్లేదు?

ప్రాణమున్న ప్రతీదీ కదులుతుంది కదా? ప్రాణం పోసిన విగ్రహాలు ఎందుకు కదలట్లేదు? అంటే ప్రాణం పోయనట్టే కదా? ఇక్కడ కూడా ముఖ్యంగా ఆలోచించవలసిన విషయం వుంది. ప్రాణం పోశామంటున్నారు. ప్రాణం పోసిన తరువాత మాత్రమే విగ్రహం ఆరాధనకు అర్హమంటున్నారు! అంటే అంతకు ముందు ప్రాణం లేనట్లేగా? అంటే ప్రాణ ప్రతిష్ఠ చెయ్యకముందు విగ్రహం దేవుడు కాదని అంగీకరించినట్టే కదా? అంటే ప్రతిష్ట చెయ్యని రాళ్ళలో, బొమ్మలలో ప్రాణం లేనట్లేగా? అంటే ప్రతిమలలో, కాంశ్య విగ్రహాలలో, మట్టి బొమ్మలలో ప్రాణం లేనట్లేగా? దేవుడు లేనట్లేగా? దేవుడు కాని వాటిని ఎందుకు ఆరాధిస్తున్నారు?

ప్రాణం దేవుడయినపుడు ప్రాణం వున్న ప్రతీదీ దేవుడేగా? ఆరాధనకు అర్హమైనవేగా? అటువంటప్పుడు ప్రాణం లేని విగ్రహాలకు ప్రాణం పోసి ఆరాధించడమెందుకు? ప్రాణమున్న వాటినే ఆరాధించవచ్చు కదా? ప్రాణమున్న ప్రతీదీ దేవుడేగా? ఎందుకు ఆరాధించరు? ఎందుకు ద్వేషిస్తారు. ప్రాణం పోసిన రాయే ఆరాధనకు అర్హమైనపుడు ప్రాణమున్నవి ఎందుకు పూజకు అర్హం కావు?

అసలు దేవుడు విగ్రహంలోనికి ఎలా వస్తాడు? ఎక్కడ నుండి వస్తాడు? దేవుడు ఒక విగ్రహంలోకి వచ్చాక మిగతా విగ్రహాలలోకి ఎలా వెళ్తాడు? కొన్నిసార్లు ఆవాహన చేసామంటారు, విసర్జన చేశామంటారు. విసర్జిస్తే ఎక్కడకు వెళ్తాడు? ఇవన్నీ ఆలోచించాలి కదా? ఆలోచిస్తే తెలుస్తుంది. పూర్ణమైన భగవంతుడు ఎక్కడ నుంచి రాడు? ఎక్కడకు పోడు? కారణం ఆయన అంతటా వున్నాడు.

మంత్రాలతో ప్రాణం పోయగలవారు మంత్రాలతో చనిపోయిన వారికి ప్రాణం పోసి బ్రతికించవచ్చు కదా? ఎందుకు బతికించరు? ఆ పని చేయలేరని అర్థమవుతుంది కదా? దీనిని బట్టి మంత్రాలు చదవగలరు కానీ ప్రాణం పోయలేరని అర్థం చేసుకోవచ్చు.

అందుచేత ఆలోచించండి. రాళ్ళను, విగ్రహాలను కాదు ప్రాణమున్న దేవుళ్ళను గౌరవించండి. ప్రాణమున్న జంతువులను ప్రేమించండి. హింసించకండి. భక్షించకండి. ప్రాణం లేనివి కాదు. ప్రాణమున్నవే దేవుళ్ళని గ్రహించండి. అసలైన దేవుళ్ళను ఆరాధించండి. దేవుళ్ళను కష్టపడి తయారు చెయ్యనవసరం లేదు. మంత్రాలతో సృష్టించనవసరం లేదు. ఇప్పటికే ప్రాణంతో భూమి మీద

సంచరిస్తున్నాయి. అవి దేవుళ్ళని తెలుసుకోండి. ప్రాణాలు తీయకండి.

బలుల పేరుతో ఎన్నో లక్షల, కోట్ల ప్రాణాలు తీస్తున్నారు. ఏదో కొన్నిటికి ప్రాణాలు పోశామంటున్నారు. అసలు వున్నవాటి ప్రాణాలు తీయడమెందుకు? లేని వాటికి ప్రాణాలు పొయ్యడమెందుకు? ప్రాణాలు వున్న వాటిని గౌరవించండి. వాటిని హింసించకండి.

చెక్కకపోతే రాయి అంటారు. చెక్కితే శిల్పమంటారు. మంత్రాలు చదివితే విగ్రహం అంటారు. పూజలు చేస్తే దేవుడంటారు. ఏమి చేసినా, ఏమి అన్నా అది రాయే కదా!

రాయి రాయే అవుతుంది. కానీ దేవుడు ఎలా అవుతుంది? మీ అబ్బాయికి కృష్ణుడు వేషం వేస్తే కృష్ణుడు అయిపోతాడా? కృష్ణుడికి వున్న శక్తులు వచ్చేస్తాయా? భగవద్గీత బోధించగలడా? అది సాధ్యం కాదు కదా?

అలాగే ఎన్ని చేసినా, ఎన్ని అలంకారాలు చేసినా రాయి రాయే కానీ దేవుడు కాలేడు. మనల్ని అనుగ్రహించలేడని తెలుసుకోండి.

వేమన యోగి చెప్పారు కదా!

**శిలలను చూసి నరులు శివుడని భావింత్రు**
**శిలలు శిలలే కాని శివుడు కాదు**
**తనదులోని శివుడు తానేల తెలియడో**
**విశ్వదాభిరామ వినురవేమ.**

తా:- రాళ్ళను చూసి మానవులు దేవుడని భావిస్తున్నారు. రాళ్ళు రాళ్ళే కానీ దేవుడు కాదు. తనలో వున్న దేవుణ్ణి మానవులు ఎందుకు తెలుసుకోవడం లేదో! అని వేమన చెప్తున్నారు.

ఇంకా శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి వారు ఏమి చెప్తున్నారంటే!

**"ముక్కు మొగము చెక్కి మూర్తి పూజలు చేయ**
**తొలుత చేయు దొసగు తొలగబోదు**
**మనసు నిలుప జనన మరణాలు తొలగును**
**కాళికాంబ! హంస! కాళికాంబ!"**

తా:- రాళ్ళకు, చెక్కలకు ముక్కు మొహం చెక్కి, శిల్పంగా తయారు చేసి దానికి బొట్టు పెట్టి, వస్త్రాలు చుట్టి, పువ్వులు పెట్టి, అగరత్తులు వెలిగించి,

హారతులిచ్చి, ఎన్ని పూజలు చేసినా ముందు చేసిన పాపాలు తొలగవు అంటున్నారు. శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి వారు.

దుఃఖ భూయిష్టమైన జననం, మరణం అన్నవి మనస్సు నిల్పి ధ్యానం చేస్తేనే తొలగుతాయి తప్ప పూజల వల్ల ఎంతమాత్రం లాభం లేదని శ్రీ వీర బ్రహ్మేంద్రస్వామి వారు తెలియచేస్తున్నారు.

**"సాటి మానవునకు సాయమ్ము పడబోక,**
**నల్లరాళ్ళు తెచ్చి గుళ్ళు కట్టి**
**మ్రొక్కులిడిన బ్రతుకు చక్కపడంబోదు**
**కాళికాంబ! హంస! కాళికాంబ!"**

తా:- మనమే నల్ల రాళ్ళు తెచ్చి, గుళ్ళలో పెట్టి, మన కష్టాలు తీర్చమని, కోరికలు నెరవేర్చమని మ్రొక్కులు మ్రొక్కితే మన బ్రతుకేమైనా చక్కబడుతుందా?

మన జీవితం బాగుండాలంటే సాటి మానవులకు సాయం చెయ్యాలి. అంటే మంచి చెయ్యాలని బోధిస్తున్నారు శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి వారు.

**"రూప రహితునకు రూపమ్ము గల్పించి**
**కర్మ కాండ పెంచి కలుషమతులు**
**ధర్మమార్గములను ధ్వంసమ్ము చేసిరి**
**కాళికాంబ! హంస! కాళికాంబ!"**

తా:- రూపం లేని భగవంతునికి రూపాన్ని తయారు చేసి, కర్మకాండ అంటే నిద్రపోని భగవంతునికి పవళింపు సేవలు చేస్తూ, సుప్రభాతం పాడి నిద్రలేపుతూ, మురికి అంటని భగవంతునికి అభిషేకాలు చేస్తూ, చావు పుట్టుకలు, ఆకలి లేని భగవంతునికి నివేదనలు చేస్తూ, చెముడు లేని భగవంతునికి మైకులు పెడుతూ కలుషిత మనస్కులైన స్వార్థపరులు, భగవంతుని దర్శించే ధర్మమైన, 'ధ్యాన మార్గాన్ని' ధ్వంసం చేశారని వీరబ్రహ్మేంద్రస్వామి వారు తెలియచేస్తున్నారు.

అందుచేత "ప్రాణప్రతిష్ఠ చేస్తేనే దేవుడు వున్నట్టు కాదు. ప్రాణమున్న ప్రతీదీ దేవుడని తెలుసుకోండి" అన్నిటినీ గౌరవించండి. ధ్యానం చేసి మీలో వున్న శివుడిని అంటే ఆత్మను ఆరాధించండి. ధన్యులవ్వండి.

# "భగవంతుడంటే ఇష్టం?"

భగవంతుడంటే అంతా ఇష్టమనే అంటారు. కానీ అలా ఇష్టమని దేన్ని బట్టి చెపుతున్నారో ఆలోచించడం లేదు.

ఇష్టమే కానీ ఎందుకు ఇష్టం? ఇష్టమని దేనిని బట్టి చెపుతున్నారు? దేన్ని బట్టి ఇష్టమైనట్టు?

పూజిస్తే ఇష్టమైనట్టా? ప్రార్థిస్తే ఇష్టమైనట్టా? స్మరణ చేస్తే ఇష్టమైనట్లా? దేనిని బట్టి ఇష్టమైనట్టు? అలా భగవంతుడంటే ఇష్టం, ఇష్టం అంటూ, ఎంతసేపూ తమ ఇష్టాలు చూసుకుంటున్నారు కానీ భగవంతుని ఇష్టమేమిటో తెలుసుకోవట్లేదు.

ఎంతసేపూ తమ ఇష్ట ప్రకారం నడుచుకుంటున్నారు కానీ, భగవంతుని ఇష్ట ప్రకారం నడుచుకుంటున్నానా? లేదా?అని ఆలోచించడం లేదు.

ఇంకా భగవంతుడు తమకు ఇష్టం అంటున్నారు కానీ భగవంతునికి తాము ఇష్టులయ్యామా? లేదా? అని ఆలోచించడం లేదు. తమకు భగవంతుడు ఇష్టమైనంత మాత్రాన సరిపోదు. భగవంతునికి తాము ఇష్టులవుతేనే తమ జీవితం ధన్యమవుతుందని అర్థం చేసుకోనట్లేదు. అందుచేత తమకు ఇష్టమైన పనులు చెయ్యడం కాదు. భగవంతునికి ఇష్టమైన పనులు మీద దృష్టి పెట్టాలని, చెయ్యాలని, అలా నడుచుకోవాలని తెలుసుకోవాలి. అలా చేస్తేనే భగవంతునికి ఇష్టులవుతారు. నిజంగా భగవంతుడంటే ఇష్టమైనవారు భగవంతునికి ఇష్టులవ్వడానికి ప్రయత్నిస్తారు. మరి భగవంతునికి ఇష్టులవ్వాలంటే ఏం చెయ్యాలి?

భగవంతునికి ఇష్టులవ్వాలంటే ధ్యానం చెయ్యాలి. ధ్యానం చెయ్యడమంటే భగవంతుని తత్వాన్ని అర్థం చేసుకుని దానికి అనుగుణంగా ప్రవర్తించడమే. ఆరాధించడమే. అదే భగవంతునికి ఇష్టం.

**" ప్రకృతిని కాపాడుకోవడం**
**అంటే మనల్ని మనం కాపాడుకోవడమే "**

**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "భక్తులలో రకాలు!"

లోకంలో భక్తులు 3 రకాల వారు వున్నారు. (1) భగవంతుని నుంచి ఇష్టపడేవారు, (2) భగవంతుని ఇష్టపడేవారు, (3) భగవంతుడు ఇష్టపడేవారు.

ఈ మూడు రకాల వారిలో మొదటి రకానికి చెందిన వారు. చాలా ఎక్కువ శాతం వుంటారు. రెండవ రకం కొద్ది శాతం వుంటారు. కానీ మూడవ రకం వారు అతి కొద్దిమందే వుంటారు. కానీ మూడవ రకం వారే గొప్పవారు. అదృష్టవంతులు కూడా.

మొదటి రకం భక్తులు అంటే "భగవంతుని నుంచి ఇష్టపడేవారు" అంటే కోరికలు కోరేవారు. వీరికి భగవంతుని కంటే కూడా భగవంతుడు ఇచ్చేవే ఎక్కువ ఇష్టం. తమకు ఇష్టమైనవి ఇస్తాడనే భగవంతుడంటే ఇష్టపడతారు. అంతేకానీ వీరికి నిజంగా భగవంతుడంటే ఇష్టం కాదు. అందుకే వీరు కోరింది భగవంతుడు ఇవ్వకపోతే ఫోటోలు మారుస్తారు, మతాలు కూడా మారుస్తారు. మరి ఇలాంటి వారంటే భగవంతుడు ఎలా ఇష్టపడతాడు? తనకు భగవంతుడంటే ఇష్టం లేనపుడు భగవంతుడు తానంటే ఎలా ఇష్టపడతాడు?

వీరంతా ఎలాంటి వారంటే తండ్రిని కాకుండా, తండ్రి ఆస్థిని ఇష్టపడేవారు. మరి ఇలాంటి వారి కష్టాలు ఎలా తీరతాయి? ఎప్పటికీ తీరవు.

రెండవ రకం భక్తులు. వీరికి కోరికలు వుండవు. వీరు భగవంతుని నుంచి కాకుండా భగవంతుడినే ఇష్టపడతారు. వీరికి భగవంతుడంటే ఇష్టమే. కానీ వీరు కూడా భగవంతునికి ఇష్టులు కాలేరు.

మూడవ రకం భక్తులు వీరు మాత్రమే భగవంతునికి ఇష్టులు కాగలుగుతారు. వీరే అందరికన్నా అదృష్టవంతులు. మరి వీరు భగవంతునికి ఇష్టులు ఎలా కాగలిగారు? వీరు ఏమి చేసి భగవంతునికి ఇష్టులు కాగలిగారో యీ కథను బట్టి తెలుసుకుందాం.

త్రిలోక సంచారి అయిన నారద మహర్షి ఒకసారి వైకుంఠానికి వెళ్ళడం జరిగింది. వైకుంఠంలో విష్ణుమూర్తి ఒక పుస్తకాన్ని చూస్తూ వుండడం నారద మహర్షి గమనించాడు. ఆసక్తిగా ఆ పుస్తకం ఏమిటి స్వామి? అని అడిగాడు. వెంటనే ఆయన "నన్ను ఇష్టపడేవాళ్ళ 'లిస్టు' " అన్నారు. నారద మహర్షికి సందేహం

కలిగింది. అందులో తన పేరు వుందా? అని అడిగాడు. తీరా చూస్తే ఆ పుస్తకంలో మొదటి పేరే నారదమహర్షిది. వెంటనే నారద మహర్షికి ఆంజనేయస్వామి పేరు ఎక్కడ వుంది? అనే సందేహం కలిగింది. వెంటనే అడిగాడు. కానీ పుస్తకమంతా చూసినా అందులో ఆంజనేయ స్వామి పేరు లేదు. నారదమహర్షి పొంగిపోయాడు. ఆంజనేయస్వామి కంటే తాను గొప్పవాడిననుకుంటూ.

అక్కడ నుంచి సెలవు తీసుకున్న నారద మహర్షి మరల లోక సంచారం చేయడం మొదలుపెట్టాడు. అలా తిరుగుతూండగా ఒకరోజు ఒక చోట ఆంజనేయస్వామి ధ్యానం చేసుకుంటూ కనిపించారు. నారదుడు వెంటనే ఆయన దగ్గరకు వెళ్ళి వైకుంఠంలో జరిగినదంతా చెప్పాడు. మరి నీ పేరు ఎందుకు లేదో నాకు అర్థం కావడం లేదు అని అన్నాడు. అపుడు ఆంజనేయస్వామి సరే స్వామి క్షేమంగా వున్నారు. మీరు క్షేమమే కదా? నాకు అంతకన్నా కావలసింది ఏముంది? అని మరల ధ్యానంలోకి వెళ్ళిపోయాడు.

నారదుడు అనుకోకుండా మరల వైకుంఠానికి వెళ్ళడం జరిగింది. ఈసారి విష్ణుమూర్తి చేతిలో ఇంకో పుస్తకం వుంది. ఆశ్చర్యంగా నారదుడు స్వామీ ఈ పుస్తకం ఏమిటి? అని అడిగాడు. "నేను ఇష్టపడేవాళ్ళ లిస్టు" అన్నారు స్వామి. తీరా చూస్తే అందులో ఆంజనేయస్వామి పేరు మొదటే వుంది. కానీ నారదుని పేరు అందులో లేదు. నారద మహర్షి చాలా నిరాశగా వెనుతిరిగాడు. ఆయనకు కారణమేమిటో అంతు పట్టలేదు.

ఇక్కడ మనం చూస్తే "భగవంతుని ఇష్టపడేవాళ్ళ లిస్టులో" నారద మహర్షి పేరు వుంది కానీ "భగవంతుడు ఇష్టపడేవాళ్ళ లిస్టులో లేదు". కానీ ఆంజనేయ స్వామి పేరు వుంది. ఇంకా గమనిస్తే అసలు భగవంతుని నుంచి ఇష్టపడేవాళ్ళ లిస్టే భగవంతుని దగ్గర లేదు. అంటే ఆయన దృష్టిలోనే వాళ్ళు లేరు అన్నది అర్థమవుతుంది.

కారణం ఈ విషయం భగవద్గీతలోనే చెప్పబడింది. శ్రీ కృష్ణ భగవానుడు 'నిష్కామకర్మ' చెయ్యమన్నారు. అంటే ఏ పని చేసినా ప్రతిఫలం ఆశించవద్దన్నారు. కోరికలు కోరుతున్నామంటే చేసిన దానికి ప్రతిఫలం ఆశిస్తున్నట్టే కదా? అంతే కాదు.

**శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన**
**మాకర్మ ఫలహేతుర్భూఃమాతే సంగోస్త్వ కర్మణి! భ.గీ.2-47**

అంటే కర్మ చెయ్యడానికే నీకు అధికారం వుంది కానీ ఫలితం ఆశించడానికి నీకు అధికారం లేదు అన్నారాయన.

అంటే కోరికలు కోరవద్దనేగా వీటి అర్థం. అంటే భగవంతుడు కోరికలు కోరవద్దని స్పష్టంగా చెప్పడం జరిగింది. మరి ఆయన వద్దన్నది చేస్తే ఆయనకు ఇష్టులు ఎలా అవుతారు? ఆయన 'లిస్టు'లో ఎలా వుంటారు ?

మరి నారద మహర్షి కోరికలు కోరని వాడే భగవంతుడంటే ఇష్టపడేవాడే కానీ భగవంతుడు ఇష్టపడేవాళ్ళ 'లిస్టు'లో మాత్రం లేడు. కారణం అంతటి నారదుడు కూడా భగవంతుని తత్వాన్ని, శక్తిని అర్థం చేసుకోకుండా తనకు నచ్చిన పారాయణలు, స్తోత్రాలు, కీర్తనలు గానాలు చేస్తున్నాడు. భగవంతుని ఆత్మ తత్వాన్ని అర్థం చేసుకుని దానికి అనుగుణంగా ఆరాధించడం లేదు. అందుకే భగవంతుని ఇష్టపడే వాళ్ళ లిస్టులో వున్నాడు కానీ భగవంతుడు ఇష్టపడేవాళ్ళ లిస్టులో లేడు.

కానీ ఆంజనేయస్వామి భగవంతుని నిర్గుణ, నిరాకార, ఆత్మతత్వాన్ని అర్థం చేసుకుని తనలో వున్న ఆ భగవంతునిపై ధ్యానం ద్వారా దృష్టి వుంచాడు. అంతర్ముఖుడై ఏ చింతలు లేకుండా అంటే ఆలోచనలు లేకుండా భగవంతుని మీదే దృష్టి వుంచి నిరంతర ధ్యాన సాధన చేస్తున్నాడు. ఆయనకు ఇంకొక ఆలోచన, ఇంకొకరి గొడవ లేదు. ఆయన దృష్టి ఎంతసేపూ భగవంతుని మీదే. అందుకే ఆంజనేయస్వామి భగవంతునికి ఇష్టులయ్యారు.

అలాగే ఎవరైతే అన్ని రకాల చింతలు! అంటే సంసారం గురించి, డబ్బు గురించి, సమస్యలు గురించి, చింతలు వదిలి భగవంతుని మీద దృష్టి వుంచుతారో! అంటే ధ్యానిస్తారో వారు కూడా భగవంతునికి ఇష్టులు కాగలరు. ధ్యానం తప్ప ఇంకే ఆరాధనలు చేసినా భగవంతునికి ఇష్టులు కాలేమని దీని ద్వారా మనం అర్థం చేసుకోవచ్చు.

ఇదే విషయం గీతలో కూడా భగవానుడు చెప్పడం జరిగింది.

**శ్లో॥ అనన్యాశ్చిన్త యన్తోమాం యేజనాః పర్యుపాసతే!**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్(భ.గీ.9-22)**

తా॥ ఎవరయితే అన్ని చింతలు వదిలి నా మీద దృష్టి వుంచుతారో వారి యోగ క్షేమాలు నేనే చూసుకుంటాను.

దీనిని బట్టి ఎవరైనా ఏ చింతలు! అంటే కోరికలు లేకుండా భగవంతుని మీద దృష్టి వుంచుతారో! వారి యోగక్షేమాలు నేనే చూసుకుంటాను అని భగవంతుడు చెప్పడం జరిగింది. భగవంతుని మీద దృష్టి వుంచడం అంటే విగ్రహం మీద, ఫోటో మీద దృష్టి వుంచడం కాదు. నామం మీద, మంత్రం మీద దృష్టి వుంచడం కాదు. కారణం భగవంతుడు నామ, రూప రహితుడు. అంటే ఏ రూపం లేని వాడు. ఏ పేరూ లేనివాడు. ఆయన సత్యమైన 'ఆత్మ స్వరూపుడు'. అటువంటి ఆయనపై ధ్యానం ద్వారా దృష్టి వుంచాలి. నిరంతరం ఆయన దృష్టిలో వుండాలి. వాడే భగవంతునికి ఇష్టులవుతారు. భగవంతుని మీద కాకుండా మిగతా అన్నిటి మీద దృష్టి వుంచేవారు భగవంతునికి ఇష్టులు ఎలా అవుతారు?

'ఆత్మే' నేను అని గీతలో భగవంతుడు చెప్పడం జరిగింది కదా?

**శ్లో॥ అహమాత్మాగుడాకేశ సర్వభూతాశయస్థితః**
**అహమాదిశ్చమధ్యం చ భూతానామన్త ఏవచ (భ.గీ.10-20)**

తా:- ఓ అర్జునా! సమస్త ప్రాణులలో స్థితమై వున్న ఆత్మను నేనే! మరియు ప్రాణుల యొక్క ఆది మధ్యాంతములు కూడా నేనే!

ఇక్కడ ముఖ్యంగా అందరూ తెలుసుకోవలసింది, గుర్తుంచుకోవలసింది 'ఆత్మే' భగవంతుడని, 'ఆత్మ ఆరాధనే' భగవదారాధన అని. ఆత్మ మీద దృష్టి వుంచిన వాడే భగవంతుని దృష్టిలో వున్నట్టు. భగవంతుని దృష్టిలో వున్నవాడే భగవంతునికి ఇష్టుడు కాగలడని. పై విషయాలను బట్టి మనం అర్థం చేసుకోవచ్చు. అందుకే 'అన్య చింతన లేకుండా ధ్యానం ద్వారా ఆత్మ మీద దృష్టి వుంచిన ఆంజనేయస్వామి భగవంతునికి ఇష్టుడయ్యాడు'. అలా ఎవరు ధ్యానం చేసినా వారు కూడా భగవంతునికి ఇష్టులవుతారు. భగవంతునికి ఇష్టులైన వారి కంటే అదృష్టవంతులు, గొప్పవారు లోకంలో ఎవరూ వుండరు. అందుచేత ధ్యానం చెయ్యండి. భగవంతునికి ఇష్టులవ్వండి.



# "ప్రత్యేకతలు!"

కొందరు ప్రత్యేక వస్త్రధారణ, వేషధారణ చేసుకుంటారు. కొందరు బొట్టు పెడతారు. ఇంకొందరు చెవిలో పువ్వు పెడతారు. మరికొందరు మెడలో దండలు, చేతికి తాళ్ళు కడుతూ ప్రత్యేకతలు చూపిస్తూంటారు. అవన్నీ భగవంతునికి ఇష్టమని అనుకుంటారు.

అలా ప్రత్యేకతలు చూపిస్తూ నేను ఫలానా మతస్తుణ్ణి అని వ్యక్తం చేసేవారు కొందరయితే! ఇంకా కొంతమంది నేను ఫలానా కులస్తుడనని వ్యక్తం చేసే వారు కూడా వున్నారు. వారు తమ పేరు చివర కులం పేరు చేర్చుకుని నేను ఫలానా కులస్తుడనని చెప్పుకుంటారు.

కానీ ప్రత్యేకతలు చూపించుకోవడం భగవంతుని ఆశయానికి అంటే అంతా సమానమనే దానికి విరుద్ధమైన చర్య. ఆయనకు అందరూ సమానం. ఆయన భూమి మీదకు పంపినపుడు అందరినీ ఒకే రకంగా, సమానంగా పంపాడు. కారణం ఆయన దృష్టిలో అందరూ ఒకటే కాబట్టి. అందుచేత ప్రత్యేకతలు చూపించుకునే వారంటే ఆయన ఎలా ఇష్టపడతాడు? భగవంతుడు ఒకరిని బొట్టుతో పంపలేదు. ఇంకొకరిని బొట్టు తీసి పంపలేదు. ఇంకొకరికి బురఖా కప్పి పంపలేదు. అలాగే ఒకరికి బంగారు గొలుసు వేసి పంపలేదు. ఇంకొకడికి చింకి గుడ్డలు వేసి పంపలేదు. ఆయా పేర్లు పెట్టి పంపలేదు. ఇవన్నీ భూమి మీద మనం తగిలించుకున్నవే. మనం వేసుకున్నవే. **"ఇవన్నీ పుట్టినవి కావు. మనం పెట్టుకున్నవి".**

అందుచేత ప్రత్యేకతలు చూపిస్తే భగవంతుడు పొంగిపోడు సరికదా, ఆయన ఆశయానికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నవారమవుతాం. ఆయనకు మానవజాతి అంతా ఒక్కటే. ఆయనకు ఎవరి పట్ల రాగ, ద్వేషాలు ఉండవు.

భగవంతుడు పూజించే వారి పట్ల, పూజించని వారి పట్ల, బొట్టు పెట్టే వారి పట్ల, పెట్టని వారి పట్ల, తాడు కట్టే వారి పట్ల, కట్టని వారి పట్ల, కులం పేర్లు తగిలించుకున్న వారి పట్ల ఏ విధమైన ప్రత్యేకతలు చూపించడు. అందుచేత ప్రత్యేకతలు చూపించకూడదు. భగవంతుని ఆశయానికి విరుద్ధంగా ప్రవర్తించకూడదు. మానవ జాతి అంతా ఒక్కటే అన్న సత్యాన్ని గ్రహించాలి. దానికి అనుగుణంగా ప్రవర్తించాలి. అప్పుడే ఎవరైనా భగవంతునికి ఇష్టులు కాగలరు.



# విగ్రహం దేనికి?

చాలామంది విగ్రహం ఉండబట్టే దేవుడున్నాడన్న సంగతి తెలుస్తుంది. విగ్రహమే లేకపోతే దేవుడున్నాడన్న సంగతి ఎలా తెలుస్తుంది? అని అంటారు. మరి విగ్రహం మేలుచేసినట్టే కదా? అంటారు.

కాని ఆలోచిస్తే విగ్రహం దేవుడున్నాడన్న సంగతి తెలియచేస్తుంది. కాని దేవుడు గురించి ఏమి తెలియచేస్తుంది? ఏమీ తెలియ చేయదు కదా? లోకంలో అందరికీ విగ్రహం వల్ల తెలిసిందేమిటంటే దేవుడంటే విగ్రహమని, ఆయన గుళ్ళోనే వుంటాడని, ఆయన పూలు, పళ్ళు తీసుకుని భక్తుల కోరికలు తీరుస్తూ వుంటాడని మాత్రమే తెలుసుకోగలిగారు. విగ్రహం వల్ల మానవులు దేవుడి గురించి తెలుసుకోగలిగింది అంత మాత్రమే. అంతకు మించి మానవులకు దేవుడు గురించి ఏమి తెలుసు?

అంటే దేవుడు ఎలా వుంటాడు? ఎక్కడ వుంటాడు? ఏం చేస్తూ వుంటాడు? అన్నది తెలియకుండా జీవిస్తున్నారు. తెలుసుకోవటానికి ప్రయత్నంకూడా చేయటం లేదు.

దేవుడు గుళ్ళోనే వుంటాడు. విగ్రహమే దేవుడు అన్న అవగాహన వల్ల, మానవులు గుడిలో విగ్రహం ఎదురుగా మాత్రమే పవిత్రంగా వుంటున్నారు. అక్కడే దేవుడున్నట్టుగా ప్రవర్తిస్తున్నారు. బయట పాపాలు చేస్తున్నారు. గుళ్ళో పవిత్రంగా వుండి బయట పాపాలు చేస్తున్నారంటే అర్థం దేవుడు గుళ్ళోనే వున్నాడు బయట లేడనే వారి భావం. దేవుడు లేడనుకున్నచోట పాపాలు చేస్తున్నారు. అలా చేసిన పాపాలకు కష్టాలు, రోగాల రూపంలో దుఃఖం అనుభవిస్తున్నారు.

మరి మానవుల కష్టాలకు , దుఃఖానికి కారణం ఏమిటి? తాము చేసిన పాపాలే కదా? ఎందుకు చేస్తున్నారు? బయట దేవుడు లేడనేగా? తమను దేవుడు చూడటం లేదనేగా? ఎందుకు ఆ అభిప్రాయంతో వున్నారు? కారణం దేవుడు గుళ్ళోనే వుంటాడు అన్న అవగాహనే కదా? విగ్రహమే దేవుడు అన్న గట్టి నమ్మకమే కదా? మరి విగ్రహం మానవునకు మేలు చేసినట్టా? కష్టాలు తెచ్చినట్టా?

కాని భగవంతుడు సర్వాంతర్యామి, సర్వవ్యాపి అన్నిటా వున్నాడు. అంతటా వున్నాడు. అన్న సందేశం విగ్రహం ద్వారా ఇవ్వగలిగితే మానవులు అంతటా పవిత్రంగా వుండేవారు. పాపాలు చేసేవారు కాదు. పాపాలు చెయ్యకపోతే

కష్టాలే వుండవు కదా! మరి ఆ సందేశం విగ్రహం ద్వారా మానవులకు అందుతుందా? ఆ అవగాహన కలుగుతుందా? అంటే లేదు.

ఎంతసేపూ విగ్రహం ద్వారా దేవుడున్నాడు అన్న సందేశం మాత్రమే తెలుస్తుంది కాని, దేవుని గురించి మాత్రం తెలియడం లేదు. దేవుడు ఎందుకు వున్నాడో? తెలియడం లేదు. తనకు ఇష్టమైన దేవుని గురించి మానవుడు తెలుసుకోకపోవడం వల్లే మానవునికి ఇన్ని కష్టాలు. లోకంలో ఇంత దుఃఖం.

అందుచేత విగ్రహం వుంచినంత మాత్రాన సరిపోదు దేవుడున్నాడని విగ్రహం దగ్గరకు వచ్చిన వారికి భగవంతుని గూర్చి, ఆయన శక్తి గురించి, ఆయన సృష్టి గురించి, ఆ సృష్టి నియమాల గురించి, ధర్మాల గురించి అన్నీ తెలియచెయ్యవలసిన అవసరం వుంది. అవి అన్నీ తెలుసుకుని అర్థం చేసుకుని దానికి అనుగుణంగా పవిత్రంగా, ధర్మంగా జీవించినపుడే మానవ జీవితం సార్థకమవుతుంది. ఆనంద భరితమవుతుంది. విగ్రహం ద్వారా భగవంతుని గూర్చి సరైన అవగాహన మానవులకు అందించగలగాలి. అలా కానపుడు మానవుడు నష్టపోకతప్పదు.

సమాజంలో భగవంతుడు గుళ్ళోనే వుంటాడు. విగ్రహమే భగవంతుడు. విగ్రహారాధనే భగవదారాధన అని బలంగా పాతుకుపోవడానికి కారణం. చిన్నతనం నుంచే వారిలో పెద్దలు నాటుతున్నారన్నది కొన్ని విషయాల ద్వారా మనం తెలుసుకోవచ్చు.

చాలామంది పెద్దలు గుళ్ళో వున్నపుడు పిల్లలు ఎవరైనా అల్లరి చేస్తున్నా, మాట్లాడకూడని మాటలు మాట్లాడుతున్నా ఏమంటారంటే, గుడిలో అవేం మాటలురా? అంటారు. చేయకూడని పనులు చేస్తుంటే గుడిలో అవేం పనులురా? అని కోప్పడుతుంటారు. అంటే దాని అర్థం దేవుడు గుళ్ళో వున్నాడు. అందుచేత గుళ్ళో అలాంటి పనులు చెయ్యకు, అలాంటి మాటలు మాట్లాడకు బయట చేసుకో అనే కదా అర్థం! అందుకే వారు అక్కడ మాత్రమే పవిత్రంగా వుంటున్నారు. బయట దేవుడు లేనట్టుగా తప్పుడు పనులు, పాపాలు చేస్తున్నారు. ఎవరికైనా, ఎప్పుడైనా పెద్దలు చెప్పవలసింది తప్పుడు పనులు చెయ్యకూడదని, తప్పుడు మాటలు మాట్లాడకూడదనే కానీ, గుళ్ళో చెయ్యవద్దని కాదు. చేయకూడనిది ఎక్కడ చేసినా తప్పే. గుళ్ళో చేస్తే తప్పు, బయట చేస్తే ఒప్పు, అన్నట్టుగా పెద్దలు పిల్లలను హెచ్చరించకూడదు.

ఆలోచిస్తే పెద్దల ఉద్దేశం గుళ్ళోనే దేవుడు వున్నట్టుగా, బయట

లేదన్నట్టుగా వుంది.  అదే అభిప్రాయం పిల్లలు కూడా ఏర్పరుచుకుంటున్నారు. గుళ్ళో విగ్రహం ఎదురుగా పవిత్రంగా ఉంటారు బయట తమ ఇష్టం వచ్చిన రీతిలో ప్రవర్తిస్తూ వుంటారు.  పాపాలు కూడా చేస్తూ వుంటారు.  మరి విగ్రహం మానవులకు మేలు చేసినట్టా? అందుచేత పెద్దలు ఏ ఆచారం ప్రవేశపెట్టినా అవి మానవులకు మేలు చేకూర్చేదిగా, మానవులకు పవిత్ర జీవనం అందించేదిగా వుండాలి.

ఇంకా చూడండి. చాలా మంది గుడికి వెళ్ళిన రోజున జీవహింస చెయ్యరు. మాంసాన్ని భక్షించరు. మిగిలిన రోజులలో మాంసాన్ని తినేస్తారు. కారణం గుడిలో దేవుడున్నాడు కాబట్టి. ఆ రోజు మాత్రమే హింస చేయకుండా పవిత్రంగా వెళతారు. కారణం గుళ్ళోనే దేవుడున్నాడు, బయటలేడనే వారి ఉద్దేశం. అందుచేత దేవుడు చూడడు కాబట్టి వారు పాపం చేస్తున్నారు. నిజంగా ఆ పని తప్పు కాకపోతే గుడికి వెళ్ళిన రోజున ఎందుకు మానేస్తారు? అంటే వారందరి భావం విగ్రహమే దేవుడు, ఆయన గుళ్ళోనే వుంటాడనే కదా?

అందుచేత దేవుడున్నాడని ఆలయాలకు వచ్చినవారికి సర్వాంతర్యామి అయిన భగవంతుడు విగ్రహంలోనే కాదు, నీలోనూ వున్నాడు, అందరిలోనూ వున్నాడు, అన్ని జీవులలోనూ వున్నాడు అని చెప్పగలగాలి. వారిలో ఆ అవగాహన కలగచేసి, వారికి అందరినీ ప్రేమించు ఎవరినీ హింసించకు అని బోధించాలి. అంతేకాదు ఆయన నిజదర్శనం కావాలంటే అంతర్ముఖులవ్వాలి. కాసేపు ధ్యానం చెయ్యి. సత్యమైన భగవంతుని తెలుసుకో. జీవితాన్ని ధన్యం చేసుకో అని కూడా చెప్పాలి. అందరిచేతా కాసేపు అక్కడ ధ్యానం చేయించాలి. అన్ని ఆలయాలలో ధ్యానమందిరాలు నిర్మించాలి. అందరినీ పవిత్రులుగా చేయాలి. అపుడే విగ్రహం యొక్క ప్రయోజనం నెరవేరుతుంది.

పూర్వకాలం ఇదే ఆచారంలో వుండేది. అందుకే వారంతా ఆలయం నుంచి బయటకు వచ్చేటపుడు కాసేపు అక్కడ కూర్చుని ధ్యానం చేసి వెళ్ళేవారు. కానీ ఇప్పుడు అది ఆచారంగా మాత్రమే ఆచరిస్తున్నారు. అంటే కాసేపు కూర్చుని లేస్తున్నారు. కానీ ధ్యానం చెయ్యడం లేదు. కనీసం ఇప్పటి నుండైనా ప్రతీ ఒక్కరూ గుడికి వెళ్ళినపుడు విగ్రహ దర్శనమయ్యాక అక్కడే కాసేపు కూర్చుని ధ్యానం చెయ్యండి. అందరిచేతా చేయించండి. ఆలయాలను ధ్యానాలయాలుగా మార్చండి.



# విగ్రహారాధనకు కారణాలు

లోకంలో విగ్రహారాధన ముఖ్యంగా మూడు కారణాలతో చేస్తున్నారు. (1) విగ్రహమే భగవంతుడని భావిస్తూ ఆరాధించేవారు కొందరయితే (2) విగ్రహంలో భగవంతుడుడున్నాడని భావిస్తూ ఆరాధించే వారు మరికొందరు. 3) విగ్రహాన్ని ఆరాధిస్తే భగవంతుణ్ణి ఆరాధించినట్టేనని భావిస్తూ ఆరాధించేవారు ఇంకొందరు.

అలా ఎవరి భావాన్ని బట్టి వారు ఆరాధిస్తున్నారు. భావానికి ప్రాముఖ్యం ఇస్తున్నారు. అంతేకానీ విగ్రహారాధన భగవదారాధనవుతుందా? అసలు ఏ ఆరాధన సత్యమైన భగవదారాధన? అని ఎవరూ ఆలోచించడం లేదు. అందుచేత దీని గురించి కొంచెం విశ్లేషణ చేద్దాం.

## 1) విగ్రహం భగవంతుడా?

విగ్రహమే భగవంతుడని భావించేవారు చాలా మంది వున్నారు. దానికి ముఖ్య కారణం వారికి చిన్న నాటి నుండి అలా చెప్పబడటమే. అందుకే వారు ఆ భావంతోనే వుంటారు. అందుకే వారు విగ్రహ దర్శనం చేసుకు వచ్చి, నేను భగవంతుని దర్శనం చేసుకున్నాను అంటారు. అంతే కాదు నాకు ఈ రోజు భగవంతుని దర్శనం బాగా జరిగిందని కూడా అంటారు. అంటే వీరి భావం విగ్రహమే భగవంతుడని. వీరు అంతకన్నా ఆలోచించరు.

వారే కనుక ఆలోచిస్తే అపుడు వారికి తెలుస్తుంది. అది భగవంతుని విగ్రహమే కానీ, భగవంతుడు కాదని. భగవంతునికి రూపం లేదు కాబట్టి పెద్దలు వారి శక్తులకు తగ్గట్టు ఒక రూపం తయారు చేసారు. ఆ శక్తులు వున్నవారు అలా వుంటారని, ఆ విగ్రహమే లేకపోతే దేవుడున్నాడన్న సంగతి సామాన్యులకు ఎలా తెలుస్తుంది? అందుచేత భగవంతుడు ఉన్నాడన్న సంగతి తెలియచేయడానికే విగ్రహాలు తప్ప, విగ్రహాలు భగవంతుడని కాదు.

తరువాత, తరువాత వచ్చిన దేవుళ్ళు భూమి మీద తమ కార్యం పూర్తి అయిన వెంటనే తమ రూపాలను వదిలివేశారు. కానీ సామాన్యులు ఆ రూపాలు వారేననుకుంటూ, ఆ రూపాలకు తగ్గట్టు విగ్రహాలు, బొమ్మలు చెక్కి, ఆ బొమ్మలే ఆ దేవుళ్ళని భావిస్తూ ఆరాధనలు చేస్తున్నారు. కానీ అవి వారి బొమ్మలే కానీ,

వారు కాదు అని తెలుసుకోలేకపోతున్నారు. వారు వదిలివేసిన, అశాశ్వతమైన, నశించిపోయిన రూపం వారు కాదు. ఆ రూపంలో వున్న శాశ్వతమైన, నశింపులేని శక్తే వారు. ఆ 'శక్తే ఆత్మ'. అంటే 'ఆత్మే' వారు అని తెలుసుకోలేక పోతున్నారు.

రూపం లేని వారిని అంటే ఆత్మను వదిలి నశించి పోయిన వారి రూపానికి తగ్గట్టు శిల్పం తానే చెక్కి, తాను చెక్కిన, తయారు చేసిన ఆ బొమ్మే ఆయన అని భావిస్తూ ఆరాధనలు చేస్తున్నారు. వీరు అంతకన్నా ఆలోచించడం లేదు.

## 2) భగవంతుడు విగ్రహంలో లేడా?

ఎవరినైనా విగ్రహాన్ని ఆరాధిస్తున్నవారిని, విగ్రహాన్ని ఆరాధిస్తే భగవంతుని ఆరాధించినట్టు ఎలా అవుతుంది? విగ్రహం భగవంతుడా? అని అడిగితే వెంటనే వారు విగ్రహం భగవంతుడు కాదు కాని భగవంతుడు విగ్రహంలో లేడా? అందుచేత విగ్రహాన్ని ఆరాధిస్తే భగవంతుణ్ణి ఆరాధించినట్టే కదా? అంటారు. అలా అంటారే కాని అంత కన్నా ఆలోచించరు.

అలా అనేవారు ఇంకా చాలా ఆలోచించాలి. భగవంతుడు విగ్రహంలో వున్నాడు. కరక్టే కాని విగ్రహంలో వున్నవాడు ఎలా వుంటాడు? ఆయన ఎత్తు ఎంత? లావు ఎంత? ఏ రకంగా వుంటాడు? విగ్రహంలోపల ఎలా వుంటాడు? విగ్రహం అంతా వుంటాడా? లేకపోతే ఒక ప్రక్కన వుంటాడా? అన్నది కూడా ఆలోచించాలి.

విగ్రహంలో వున్నవాడికి రూపం వుంటుందా? ఆయన ఆరడుగులవాడు అయితే విగ్రహాలు రెండు, మూడు అడుగుల ఎత్తు వుంటాయి కదా? ఆరడుగులు వున్నవాడు రెండడుగులలో ఎలా వుండగలడు? ఆయన లావయినవాడయితే సన్నపాటి విగ్రహాలలో ఎలా వుండగలడు? 'లో వున్నాడు' అనేవారు ఇది కూడా ఆలోచించాలి.

మరి మనం విగ్రహాన్ని చూస్తున్నామా? విగ్రహంలో వున్నవాణ్ణి చూస్తున్నామా? విగ్రహ దర్శనం చేసుకుని వచ్చి భగవంతుని దర్శనమయ్యింది అని చెపుతున్నాము కదా? అసలు మనం దర్శనం చేసుకున్నది విగ్రహాన్నా? విగ్రహంలో వున్నవాడినా? విగ్రహంలో వున్నవాడు మనకి కనిపించాడా? విగ్రహంలో వున్న వాడిని మనం ఎలా చూడగలిగాం? మనం విగ్రహాన్ని దర్శించాము. కానీ లోవున్న వాడిని కాదు కదా? కానీ భగవంతుని దర్శనమయ్యింది అని చెపుతున్నామంటే అందరికీ అసత్యం చెపుతున్నట్టే కదా?

విగ్రహాలను చూసేవారికి దేవుళ్ళు వేరు, వేరు అనిపిస్తుంది. కాని లో నున్నవాడిని చూడగలిగినవారికి దేవుళ్ళు వేరు వేరు కాదు అంతా ఒక్కటే అని అర్థమవుతుంది. దేవుళ్ళు వేరు, వేరు అంటున్నారంటే విగ్రహాన్ని చూస్తున్నారు కాని, లో ఉన్నవాడ్ని చూడటం లేదని అర్థం చేసుకోవచ్చు.

లో నున్నవాడు అంటున్నాం అంటే బయట కనిపించేది ఆయన కాదనేగా అర్థం. మరి మనం ఎవరిని ఆరాధిస్తున్నాం? కనిపించే విగ్రహాన్నా? లో నున్నవాడినా? ఆలోచిస్తే ఖచ్చితంగా బయట విగ్రహాన్నే ఆరాధిస్తున్నాము. పైగా పై విగ్రహాన్ని ఆరాధిస్తే లో వున్నవాడిని ఆరాధించినట్టే కదా? అని సరిపెట్టుకుంటున్నాం. తృప్తి పడుతున్నాం. కాని విగ్రహాన్ని ఆరాధిస్తే లో ఉన్నవాడిని ఆరాధించినట్టు ఎలా అవుతుంది? అని ఆలోచించడం లేదు.

లో నున్న సత్యమైన భగవంతుని దర్శనం చేసుకున్న వారికే సమస్త పాపాలు పటాపంచలవుతాయి తప్ప, విగ్రహాన్ని దర్శించిన వారికి పాపాలు ఎలా పోతాయి? ముక్తి ఎలా వస్తుంది? వారికి ముక్తి రాదు. తృప్తి మాత్రమే వస్తుంది.

మానవుడు తృప్తితో సరిపెట్టుకుంటున్నాడు. తృప్తి కలిగితే చాలనుకుంటున్నాడు. కాని చివరకు దుఃఖపడుతున్నాడు. ఆ దుఃఖం భరించలేక విలవిలలాడుతున్నాడు.

గుర్తుంచుకోండి విగ్రహాన్ని దర్శిస్తే తృప్తి కలుగుతుంది. కాని విగ్రహంలో వున్నవాడిని దర్శిస్తే ముక్తి లభిస్తుంది. అన్ని రకాల కష్టాల నుండి, అన్ని రకాల బాధల నుంచి, అన్ని రకాల సమస్యల నుంచి కూడా తాత్కాలికంగానే కాదు శాశ్వతంగా విముక్తి లభిస్తుంది.

చిన్న ఉదాహరణ చూద్దాం. ఒక ఇంట్లో వున్న రాజకీయ నాయకుడిని అభినందించాలని పెద్ద దండ తీసుకుని వెళ్ళి లోపలికి వెళ్ళకుండా బయట ఆయన ఇంటి గుమ్మానికి ఆ దండ వేసి వస్తే, ఆ నాయకుడికి వేసినట్టా? అలా వేసి లోపలికి వెళ్ళకుండా ఆయన్ను కలవకుండా, చూడకుండా వచ్చేసి ఆ నాయకుడ్ని అభినందినట్టా? ఆయన్ను కలిసినట్టా? అలా చేసి మనం అవునని భావించవచ్చు, తృప్తి పడవచ్చు కాని ఆ నాయకుడిని మీరు కలిసారని, అభినందించారని ఆ నాయకుడు అనుకుంటాడా? అందుచేత ఆయన్ను కలవాలన్నా, లోపల వున్న ఆయన్ను అభినందించాలన్నా, లోపలికి వెళ్ళవలసిందే. అప్పుడే ఆయన కనిపిస్తాడు. అంతే తప్ప లోపలికి వెళ్ళకుండా ఆయన్ను చూడకుండా ఆయనకు

దండ వేయకుండా ఇంటికి వేస్తే, వేసానని మీరు భావించాలి కాని, కలిసారని ఆయన అనుకోడు. మీకు మీరు తృప్తి పడాలి కాని, అభినందించారని ఆయన అనుకోడు.

అలాగే విగ్రహంలో వున్నవాడిని ఆరాధించాలంటే మీరు కూడా లోపలికి వెళ్ళాలి. అంతేకాని ఇంటికి దండ వేసి ఇంటిలో వాడికి వేసాను అని భావిస్తే ఎలా వుంటుందో, విగ్రహాన్ని ఆరాధించి లో వున్నవాడిని ఆరాధించాను, దర్శించాను అని అనుకుంటే అలాగే వుంటుంది. లో వున్నవాడిని దర్శించాలంటే ఖచ్చితంగా లోపలికి వెళ్ళవలసిందే. అలా కాకుండా చేసే పనులు మనకు తృప్తినిస్తాయే తప్ప ఫలితం ఉండదు.

అందుచేత విగ్రహాన్ని కాదు మనం దర్శించవలసింది. ఆరాధించ వలసింది. లో నున్న వాడిని దర్శించాలి. ఆరాధించాలి.

ఇక్కడ కొంచెం వివేకంతో ఆలోచించాలి. లో నున్నాడు కరక్టే. లో వున్నవాడు కనపడాలంటే విగ్రహాన్ని రెండు ముక్కలు చేస్తే లో నున్నవాడు కనబడతాడా? అలా ప్రయత్నించి చూస్తే కనబడడు కదా? కారణం విగ్రహానికి రూపం వుంది కానీ లో నున్న వానికి రూపం లేదు. మరి ఎలా కనిపిస్తాడు? లో వున్నవాడిని ఎలా దర్శిస్తాం? మరి మనం విగ్రహంలోకి వెళ్ళలేం కదా. అది సాధ్యం కాదు కదా? మరి ఎలా సాధ్యం? సాధ్యమా అంటే సాధ్యమే. లో నున్నవాడిని దర్శించడం కూడా సాధ్యమే.

ఎలా అంటే కొంచెం వివేకంతో ఆలోచించాలి. నిరాకారుడైన, అనంత శక్తిస్వరూపుడైన, సర్వాంతర్యామి అయిన భగవంతుడు ఒక్క విగ్రహంలోనే కాదు, అన్నింటిలో ఉన్నాడని తెలుసుకోవాలి. అంతేకాని ఒక్క విగ్రహంలోనే వున్నాడు అని భావిస్తే అది మూర్ఖత్వమే అవుతుంది. అలా అన్నిటిలో వున్నవాడు మనలోనూ వున్నాడు. అంతర్యామిగా వున్నాడు.

అందుకే భగవంతుని 'సర్వాంతర్యామి' అంటారు. అందుచేత అంతర్యామి యైన ఆ "లో" నున్నవాడిని చూడాలన్నా, దర్శించాలన్నా, విగ్రహం లోపలికి మనం వెళ్ళలేము కాని మనలోకి మనం వెళ్ళగలం. మన అంతరం లోకి మనం వెళ్ళగలం. ఇది ఒక్కటే మార్గం. అంతరంలో వున్న భగవంతుని దర్శించాలంటే మనం అంతర్ముఖులు కావాలి! అంటే 'ధ్యానం' చెయ్యాలి. ధ్యానం చేస్తేనే భగ వంతుని దర్శించగలం. అందుచేత 'ధ్యానమే' భగవదారాధన అని తెలుసుకోవాలి. అంతే కానీ విగ్రహాన్ని ఆరాధిస్తే లో వున్న వాడిని ఆరాధించినట్టు కాదని

తెలుసుకోవాలి.

## 3) విగ్రహాన్ని పూజిస్తే భగవంతుని పూజించినట్లు అవుతుందా?

విగ్రహాన్ని భగవంతునిగా భావించి పూజిస్తే, భగవంతుని పూజించి నట్లవుతుందని కొందరు అంటారు. అంటే అక్కడ విగ్రహం ప్రధానం కాదు. భావమే ప్రధానమని చెప్తారు. భావాన్ని బట్టే ఏదైనా అంటారు. మరి భావం ప్రధానమైనపుడు మరి మనం ఎప్పుడూ దుఃఖాలు, కష్టాలు కలగాలని భావించం కదా? కష్టాలు ఎందుకు వస్తున్నాయి? అలాగే ఎల్లప్పుడూ సుఖంగా, ఆనందంగా ఉండాలనే భావిస్తాం కదా? మరి సుఖంగా ఉండగలుగుతున్నామా? మరణించాలని కానీ, అకాల మరణం రావాలని భావించం కదా? మరి మరణం ఎందుకు కలుగుతుంది? అకాల మరణాలు ఎందుకు కలుగుతున్నాయి?

అలాగే మట్టిని బంగారంగా, రాళ్ళను వజ్రాలుగా, నీటిని నెయ్యిగా, ఇసుకను పంచదారగా భావించవచ్చు కదా? అలా భావిస్తే అవి అలా అవుతాయా? ఖచ్చితంగా కావు. అందుచేత భావం సత్యం కాదు.

మనం విగ్రహాన్ని భగవంతునిగా భావించి పూజిస్తే అది భగవంతుడు అంగీకరిస్తే భగవంతుడు ప్రతీ భావాన్ని అంగీకరించి అనుగ్రహించాలి. అలా జరుగుతుందా? అంటే లేదు. అందుచేత భావము సత్యం కాదు. కారణం భావాల్లో రెండు రకాలు వున్నాయి. సత్యభావన, అసత్యభావన.

సత్య భావమంటే, ఏది ఎలా వుంటే, అలా అనుకోవడం. అగ్నిని అగ్నిగాను, నీరును నీరుగాను తెలుసుకోవడమే 'సత్యభావన'. దానికి విరుద్ధంగా వూహించడాన్ని 'అసత్యభావన' అంటారు. ఆచ్ఛాదన అంటారు.

అందుచేత విగ్రహం విగ్రహమే కానీ భగవంతుడు కాదు. విగ్రహాన్ని భగవంతుడుగా భావించడం 'అసత్య భావన'. అసత్య భావంతో చేసే ఆరాధనలన్నీ వ్యర్థమవుతాయి. మన శ్రమ ఎప్పుడూ వృధా కాకూడదు.

మరి భగవంతుని విషయంలో ఏది సత్యభావన? అంటే ఆత్మను భగవంతునిగా భావించడమే 'సత్యభావన'. కారణం 'ఆత్మే' భగవంతుడు కనుక. 'ఆత్మ' భగవంతుడైనపుడు 'ఆత్మ' ఆరాధనే సత్యమైన భగవదారాధన అవుతుంది. అదే ధ్యానం. అందుచేత ఆలోచించండి. ధ్యానం చెయ్యండి.



# "మారే భావం కంటే - మార్పు చెందని సత్యాన్ని పట్టుకోవాలి!"

లోకంలో అందరూ భావాన్ని బట్టి ఆరాధనలు చేస్తున్నారు. కానీ ఎవరూ సత్యాన్ని అంటే సత్యమైన భగవంతుని గుర్తించటం లేదు. సత్యమైన భగవంతుని ఆరాధించటం లేదు.

సత్యాన్ని విస్మరించడం వల్లే లోకంలో మానవులకు ఇన్ని కష్టాలు. భావాల్ని అనుసరించి ఆరాధించే మానవులకు రోజు రోజుకు కష్టాలు పెరుగుతూనే వున్నాయి. కానీ తగ్గటం లేదు. కానీ సత్యాన్ని ఆరాధించే యోగులు కష్టాలలో నుంచి బయటపడటమే కాదు. కష్టాలలోనుంచి శాశ్వతంగా బయటపడ్డారు. అంటే ముక్తి పొందారు. దీనిని బట్టి భావం కంటే సత్యమే గొప్పదని తెలుస్తుంది.

భగవంతుడు మార్పు చెందని వాడు. కాలం మారినా, యుగాలు మారినా భగవంతుడు మారడు. ఆయన నిత్యమైన వాడు. శాశ్వతుడు. అందుకే భగవంతుణ్ణి సత్యంతో పోలుస్తారు. అంటే ఏదైతే మారుతూ వుంటుందో, మార్పు చెందుతూ వుంటుందో అది భగవంతుడు కాదని ఖచ్చితంగా తెలుసుకోవచ్చు. భగవంతుడు కాని దానిని ఆరాధిస్తే, ఆ ఆరాధనలన్నీ వ్యర్థమవుతాయని తెలుసుకోవాలి.

చాలా మందికి సత్యమైన భగవంతుణ్ణి ఎలా ఆరాధించాలో తెలియక ప్రత్యామ్నాయ మార్గాలు అనుసరిస్తున్నారు. అలాంటి సందర్భాలలో ఎవరి భావాన్ని బట్టి వారు ఆరాధనలు చేస్తున్నారు. ఒక్కొక్క మతంలో ఆరాధన ఒక్కొక్క రకంగా వుంటుంది. ఒకే మతంలో కూడా ఆరాధనలు వారి వారి భావాలను బట్టే వుంటాయి. అంతే కానీ ఒకే రకంగా వుండవు. కారణం భావం మారుతూ వుంటుంది. భావాలు ఎప్పుడూ ఒకే రకంగా వుండవు. ఒకసారి వున్న భావం ఇంకొకసారి వుండదు. భావం మారినపుడు ఆరాధనలు కూడా మారిపోతూ వుంటాయి. ప్రవర్తన మారిపోతూ వుంటుంది.

ఉదాహరణకు ఒక ఫోటో దేవుడని భావించిన వారు దానిని పూజా మందిరంలో వుంచుతారు. రోజూ పూజిస్తారు. కానీ అదే దేవుని ఫోటో శుభలేఖ మీద ఇంకా అందంగా వున్నా అది దేవుడని భావించకపోవడం వల్ల, ఫోటో అని భావించడం వల్ల, చెత్త బుట్టలోనో, బయటో పారవేస్తారు. ఇక్కడ అదే దేవుడి ఫోటో విషయంలో భావం ఒకచోట ఒకరకంగా వుంది. ఇంకొక చోట భావం

ఇంకొక రకంగా వుంది. అంటే భావం మారింది కదా!

అలాగే గుడిలో వున్న విగ్రహాన్ని దేవుడని భావిస్తారు. ఆరాధిస్తారు. కానీ గుడి బయట వున్న అదే దేవుని విగ్రహాన్ని బొమ్మగా భావిస్తారు. అందుచేత పట్టించుకోరు. తిరుపతిలో వున్న విగ్రహాన్ని వెంకటేశ్వరస్వామి అని భావిస్తారు. ఎంత దూరమైనా తిరుపతి వెళ్తారు. దర్శనం చేసుకుంటారు. కానీ వారి ఊరిలో వున్న అదే వేంకటేశ్వరస్వామి చిన్న గుడి వుంటే, ఎంత దగ్గరైనా, భావించక పోవడం వల్ల ఒక్కసారి కూడా వెళ్ళరు. దర్శించుకోరు. అంటే ఒకే దేవుడి విషయంలో భావం మారడం వల్ల, ప్రవర్తన మారిపోయింది. అంటే అదే దేవుడి, అన్ని విగ్రహాల విషయంలో భావం ఒకే రకంగా లేదు. అంటే భావం మారుతూ వుంది కదా! అంటే భావిస్తేనే దేవుడు భావించకపోతే కాదు. ఒకే రూపమున్న దేవుడి విగ్రహాల విషయంలో భావం ఎన్ని రకాలుగా మారుతుందో గమనించండి.

కానీ భగవంతుడు మార్పు చెందని వాడు. సత్యమైనవాడు. అందుచేత "మార్పు చెందే భావాన్ని బట్టి కాక, మార్పు చెందని సత్యమైన భగవంతుని ఆరాధించండి". సత్యమైన భగవంతుడే 'ఆత్మ'. 'ఆత్మ' ఆరాధనే 'ధ్యానం'. ధ్యానం చెయ్యండి. 'సత్యాన్ని' పట్టుకోండి. తెలుసుకోండి. **"భావారాధన కాదు, సత్యారాధన చెయ్యాలి"** జీవితాన్ని ధన్యం చేసుకోవాలి.

**" త్రికరణశుద్ధి ఉన్నవారికే**
**అంతరాత్మ ప్రబోధం అన్నది**
**స్పష్టంగా తెలుస్తుంది "**

**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "భావానికి కాదు - సత్యానికి ప్రాముఖ్యం ఇవ్వాలి!"

ప్రతీదీ దైవ స్వరూపం అని తెలుసుకున్నపుడు ప్రతీదాన్ని గౌరవించాలి కానీ ఆరాధించకూడదు.

రాయి దేవుడే, పూవు దేవుడే, ఆకు దేవుడే, నీరూ దేవుడే. అలాంటపుడు దేనిని దేనితో పూజిస్తాం. దేనిని దేనితో పూజించినా దేవుని అవమానించినట్టే. ఒక దేవుని పూజించడానికి, ఇంకొక దేవుని అవమానించడం వివేకమా?

రాయిని పూవులతో, ఆకులతో పూజించడం, నీటితో అభిషేకించడం దేవుని అవమానించడమే అవుతుంది. అందుచేత అన్నిటిలో దైవాన్ని చూస్తూ అన్నిటినీ గౌరవించాలి. అవసరార్థం ఉపయోగించుకోవాలి.

ఆలోచిస్తే రాయికంటే వృక్షమే ఎదిగిన గొప్ప దేవుడు. అటువంటప్పుడు పూలతో, ఆకులతో రాళ్ళను ఎలా పూజించగలం? ఇంకా చూస్తే భూతత్వం కంటే నీటితత్వం విశిష్టమైనది. అలాంటప్పుడు నీటితో రాయిని ఎలా అభిషేకిస్తాం?

నీరు భగవంతుని స్వరూపమని నదులను పూజిస్తారు. మరి ఆ భగవంతుని అంటే నీటితో రాయిని ఎలా అభిషేకిస్తారు? అడిగితే అన్నీ భగవంతుని స్వరూపం అంటారు. కానీ మానవులు ఒక్క రాయినే భగవంతునిగా భావిస్తారు. ఇంక వేటినీ భగవంతునిగా భావించరు. వేటిలోనూ భగవంతుని చూడరు.

గమనిస్తే మానవులు విగ్రహాన్ని, ఫోటోలను పూజించే సమయంలోనే దేవునిగా భావిస్తారు. తరువాత అవి దేవుడు కాదన్నట్టుగా వారి ప్రవర్తన వుంటుంది. అంతే కాదు వారు దేనిని దేవుడని భావిస్తారో అదే దేవుడన్నట్టుగా ప్రవర్తిస్తారు. మిగిలినవి దేవుడు కానట్టుగా ప్రవర్తిస్తారు.

అలా తాము భావించిన కృష్ణుని విగ్రహం దేవుడంటారు. జీసస్ విగ్రహం దేవుడు కాదంటారు. గుడిలో విగ్రహం దేవుడంటారు. గుడి బయట వున్న విగ్రహాలు దేవుడు కానట్టుగా ప్రవర్తిస్తారు. గోడకు తగిలించిన ఫోటో దేవుడంటారు. శుభలేఖల మీద వున్న ఫోటోలు దేవుడు కానట్టుగా బయట పారేస్తారు.

అంటే తాను భావిస్తే దేవుడు, తాను భావించకపోతే దేవుడు కాడా? తాను భావించినా భావించకపోయినా దేవుడు, దేవుడే కదా? అసలు తన భావంతో సంబంధమేమిటి? మానవుడు భావానికి ప్రాధాన్యం ఇస్తున్నాడు కానీ సత్యానికి ప్రాధాన్యం ఇవ్వడం లేదు. తన భావం సత్యాన్ని ఎలా మార్చగలదు. తాను ఎలా భావించినా సత్యం, సత్యమే కదా? **"సత్యం ఎప్పుడూ మారదు. అలాగే మారేది**

**సత్యం కాదు".** సత్యాన్ని ఎవరి భావం మార్చలేదు.

నీ భార్యను, నీ భార్య కాదని నీవు భావించినంత మాత్రాన నీ భార్య కాకుండా పోతుందా? అలాగే ప్రక్కవాడి భార్యను, నీ భార్యగా భావిస్తే ఆవిడ నీ భార్య అయిపోతుందా? నీ భావం ఎలా వున్నా, నీవు ఎలా భావించినా! నీ భార్య నీ భార్యే. ప్రక్కవాడి భార్య ప్రక్కవాడి భార్యే. అక్కడ నీ భావం సత్యాన్ని మార్చలేదు.

నీవు ఊరి నుండి వచ్చావు. మీ ఇంట్లో కరెంటు లేదు. గదిలో మసక వెలుతురు. ప్రక్కింటావిడ మీ ఇంటికి వచ్చింది. మీ గదిలో మంచం మీద కూర్చుంది. మీ ఆవిడ కాఫీ కోసం వంట ఇంటిలోకి వెళ్ళింది. ఆ మసక చీకట్లో ప్రక్కింటావిడే మీ ఆవిడని భావించి వాటేసుకున్నావు. అప్పుడు ఆవిడ ఏం చేస్తుంది? నిన్ను ఒక్క తోపు తోసి కళ్ళు కనబడటం లేదా? కళ్ళు మూసుకుపోయాయా? అని చెప్పి నిన్ను తిట్టడమే కాదు. మరల మీ ఇంటికి కూడా రాదు.

అలాగే మీ ఆవిడ చీర మీ పనిమనిషి కట్టుకు వచ్చింది అనుకుందాం. మీరు నిద్రలేవగానే ఆవిడే మీ ఆవిడని భావించి వాటేసుకుంటే ఏం చేస్తుంది? మిమ్మల్ని తిట్టి, మీ ఇంటిలో పని మానేస్తుంది.

మరి మీరు భావించినంత మాత్రాన వారు మీ భార్యలు అయిపోయారా? వచ్చి మిమ్మల్ని వాటేసుకున్నారా? అలా ఎప్పటికీ కాదు. మీరు ఏమి భావించినా, ఎలా భావించినా సత్యం మారదు. కానీ మీ భావానికి తగ్గట్టు మీ ప్రవర్తన వుంటుంది. అలా ఎదుట వారి ఇల్లు మీ ఇల్లు అని భావిస్తే మీదై పోతుందా? మీరు మిమ్మల్ని ఎమ్మెల్యేగా, సి.ఎం.గా భావిస్తే అయిపోతారా? కలెక్టరు అని భావిస్తే అయిపోతారా? సినిమా హీరో అని భావిస్తే హీరో అయిపోతారా? సంగీత విద్వాంసుడని భావిస్తే విద్వాంసుడు అయిపోతారా?

అందుచేత మన భావం సత్యాన్ని మార్చలేదని తెలుసుకోవాలి. కానీ అది మన ప్రవర్తన మారుస్తుంది. దానికి తగ్గట్టుగా ప్రవర్తిస్తాం. అది అనర్థాన్ని తెస్తుంది. కష్టాల పాలు చేస్తుంది. అందుచేత విగ్రహమే దేవుడు. అందులోను మనకు నచ్చిన విగ్రహం మాత్రమే దేవుడని భావిస్తూ చేసే పనులు నష్టాన్ని కలుగచేస్తాయే తప్ప లాభం చేకూర్చలేవు.

సత్యాన్ని తెలుసుకోండి. సత్యమైన భగవంతుడెవరో తెలుసుకోండి. ఆయన తత్వాన్ని అర్థం చేసుకోండి. ఆయన శక్తిని గ్రహించండి. దానికి తగ్గట్టు ఆరాధిం చండి. 'ఆత్మే' సత్యమైన భగవంతుడు కాబట్టి, ధ్యానం ద్వారా ఆత్మను ఆరాధించండి. జీవితాన్ని ధన్యం చేసుకోండి. భావానికి కాదు సత్యానికి ప్రాముఖ్యం ఇవ్వండి.

# "భావాన్ని బట్టే ఆరాధనలు - సత్యాన్ని బట్టి కాదు!"

లోకంలో భావాన్ని బట్టే ఆరాధనలన్నీ జరుగుతున్నాయి. అంతేకానీ సత్యాన్ని బట్టి లోకంలో ఆరాధనలు జరగటం లేదు. అంటే ఎవరి భావాల్ని బట్టే వారు ఆరాధనలు చేస్తున్నారు.

ఎందుచేతనంటే కొన్ని మతాలలో భగవంతునికి రూపం వుందని భావిస్తూ రూపాన్ని పూజించేవారు కొందరయితే, రూపాన్ని వుంచుకుని ప్రార్థించేవారు కొందరు. అలాగే కొన్ని మతాల వారు భగవంతునికి రూపం లేదని భావిస్తూ రూపం లేకుండా నమాజులు అంటే ప్రార్థనలు చేస్తున్నారు. అంటే వారి భావం ఎలా వుంటే అలా ఆరాధనలు చేస్తున్నారు.

కాస్త గమనిస్తే ఆరాధనలలో భావమే ప్రధానపాత్ర పోషిస్తుందని తెలుస్తుంది. ఉదాహరణకు కొందరు కృష్ణుడు దేవుడని భావిస్తూ కృష్ణుడిని ఆరాధిస్తున్నారు. అలాగే కొందరు శివుడిని, కొందరు వెంకటేశ్వరస్వామిని, మరికొందరు అయ్యప్పను, మరికొందరు సత్యసాయిబాబాను, మరికొందరు షిరిడీ సాయిబాబాను అలా ఎవరి భావాన్ని బట్టి వారు ఆరాధిస్తున్నారు. ఇంకొందరు జీసస్ క్రైస్ట్ దేవుడని భావిస్తూ ప్రార్థనలు చేస్తున్నారు.

ఇక్కడ భావమే ప్రధానపాత్ర పోషిస్తుందనటానికి ఒకే రాయిని రెండు సమానమైన ముక్కలుగా చేసి ఒక ముక్కను కృష్ణుడుగాను, ఇంకొక ముక్కను జీసస్‌గా చెక్కుతే కృష్ణుడే దేవుడని భావించే వారు కృష్ణుడు విగ్రహాన్ని ఇంట్లో వుంచి పూజిస్తారు. అదే రాతితో చేసినా జీసస్ విగ్రహాన్ని ద్వేషిస్తారు. ఇంట్లో వుంచడానికి కూడా ఇష్టపడరు. అలాగే జీసస్ దేవుడని భావించే వారు అదే రాయితో చేసిన కృష్ణుని విగ్రహాన్ని ఇంట్లో ఉంచుకోవడానికి ఇష్టపడరు.

అలాగే ఒకే రంగు కాగితం మీద ఒకే రంగులతో కృష్ణుని బొమ్మవేస్తే కొందరు దానిని ఫోటో కట్టించి పూజిస్తారు. అదే కాగితం మీద అదే రంగులతో జీసస్ బొమ్మ వేస్తే మరికొందరు దానిని ఫోటో కట్టించి ప్రార్థిస్తారు. ఇక్కడ గమనిస్తే కాగితం రంగులు ఒకటే అయినా వారు దేవుడని భావించిన రూపాన్ని ఆరాధిస్తున్నారు. అంటే ఇక్కడ కూడా భావమే ప్రధానపాత్ర పోషిస్తుంది.

అంతెందుకు వెంకటేశ్వరస్వామి ఆలయాలు ప్రతీవూరిలోను ఎన్నో

వుంటాయి. కానీ తిరుమలలో వున్న వెంకటేశ్వరస్వామే అసలైన వెంకటేశ్వరస్వామి అని భావించడం వల్ల, అక్కడికే ఎన్నోసార్లు వెళ్ళి వస్తూంటారు. అదే వెంకటేశ్వర స్వామి చిన్న గుడి తమ ఊర్లో వున్నా వెళ్ళరు. అలాగే కొన్ని గుడుల మీద ఆ భావం లేకపోవడం వల్ల ఎప్పుడూ వెళ్లరు. తాము ప్రత్యేకించి భావించిన గుడికే వెళతారు. అలాగే అందరి దేవుళ్ళ విషయంలో కూడా.

ఇంకా గమనిస్తే తనకు ఇష్టమైన తాను భావించిన దేవుని ఫోటో మాత్రమే పూజామందిరంలో కానీ, షాపులో కానీ, గదిలో కానీ వుంచి రోజూ పూజిస్తారు, నమస్కారం చేస్తారు. అదే దేవుని ఫోటో శుభలేఖల మీద కానీ, పేపర్లలో కానీ, పుస్తకాలలో కానీ, పుస్తకాల అట్టల మీద కానీ వుంటే పట్టించుకోరు. పైగా వాటిని చెత్తబుట్టలలో కూడా పడేస్తారు. కారణం వాటిని దేవుడని భావించక పోవడం వల్ల మాత్రమే. అంటే అదే దేవుడి ఫోటో ఒకటి పూజలందుకుంటుంది. ఇంకొకటి నిరాదరణకు గురవుతుంది. కారణం ఒకటి దేవుడని భావించ బడుతుంది. ఇంకొకటి దేవుడిగా కాకుండా బొమ్మగా భావించబడుతుంది. అంటే ఇక్కడ కూడా భావమే ప్రధాన పాత్ర పోషిస్తుంది.

ఇంకా గమనిస్తే తాను దేవుడని భావించే కొత్త క్యాలండరు గోడకు తగిలిస్తారు. రోజూ నమస్కారం చేస్తారు. కానీ సంవత్సరం మారిపోతే క్రింద తారీఖులు అయిపోతే, ఆ క్యాలండరు ఏ మూలో పడేస్తారు. ఇక్కడ తారీఖులు వున్నంత వరకు దేవుడని భావించారు. తారీఖులు అయిపోతే దేవుడు కానట్టు ప్రవర్తిస్తున్నారు. అంటే బొమ్మ దేవుడా? లేక తారీఖులా? అసలు వీరి భావమేమిటి? అంటే తాను భావించినంత సేపూ దేవుడు, లేకపోతే పాత కాలెండరు అంటే ఇక్కడ కూడా భావమే పని చేస్తుంది.

ఎన్నో ఆలయాలు పాడు పడిపోయి, నిరాదరణకు గురయి, శిధిలావస్థలో ఎన్నో వేలు వున్నాయి. వాటిని ఎవరూ పట్టించుకోరు. వాటి వంక ఎవరూ చూడరు. కానీ ఎవరైనా ఏ గుడినైనా దేవుడని భావించినపుడు ఆ గుడికి మరమ్మత్తులు చేస్తారు. అపుడు అందరూ మరల పూజలు చేస్తారు. రోజూ గుడిని దర్శిస్తారు. ఆ భావం లేనపుడు దానిని విస్మరిస్తారు. పట్టించుకోరు. అంటే ఇక్కడ కూడా భావాన్ని బట్టే ఆరాధనలు అని తెలుస్తుంది కదా?

అలాగే ఒక పంది గుడి చుట్టూ ప్రదక్షిణలు చేస్తే అది వరాహమని,

దేవుడని భావించి దానికి పూజలు చేస్తారు, మొక్కుతారు. మిగిలిన వాటిని పందులని భావించి క్రూరంగా చంపి భక్షిస్తారు. అలాగే ఏ జంతువైనా సరే. అంతేకాదు ఏ గృహప్రవేశ సమయంలోకానీ, తద్దినాల సమయంలో కానీ, లేక దానం ఇచ్చే సమయంలో ఆవును దేవుడని భావించి పూజ చేస్తారు. మిగిలిన సమయాలలో ఆ ఆవును కొడతారు. పట్టించుకోరు. అంటే భావించినపుడే దేవుడు. లేకపోతే ఆవు. అంటే భావాన్ని బట్టే ఆరాధనలు అని అర్థమవుతుంది కదా!

పాము విగ్రహాన్ని నాగదేవత అని భావించి పూజిస్తారు. పాము కనిపిస్తే చంపుతారు. అదే పాముని నాగ దేవత అని భావిస్తే చంపుతారా? అలాగే చేప అని భావించి తింటారు. గుడిలో విగ్రహాన్ని మత్స్యావతారం అని భావించి పూజిస్తారు. రాతి విగ్రహాన్ని నందీశ్వరుడు అని భావించి పూజిస్తారు. బ్రతికి వుంటే ఎద్దు అని భావించి కొడతారు, హింసిస్తారు. అంటే మానవులు ప్రాణమున్న వాటిని దేవుడని భావించరు. వాటి రాతి విగ్రహాలను మటుకు దేవుడని భావిస్తారు. వారి భావాలను బట్టే ప్రవర్తిస్తారు.

అలాగే ఆలయంలో వున్న విగ్రహానికి ప్రాణప్రతిష్ఠ చేస్తారు. ప్రాణం వుందని భావించి పూజిస్తారు. కానీ ఆలయాలు బయట వున్న విగ్రహాలకు ప్రాణం లేదని భావించడం వల్ల పూజించరు. పట్టించుకోరు. వాటిని బొమ్మలని భావిస్తారు. వాటిని బొమ్మలుగా చూస్తారు.

అలాగే ప్రాణం లేని రాతి బొమ్మలకు ప్రాణప్రతిష్ఠ చేశారని అంటే ప్రాణం పోశారని భావించి పూజిస్తారు. ఇక్కడ ప్రాణమంటేనే దేవుడని భావిస్తున్నారు. అంటే ప్రాణమే దేవుడనేగా వీరి ఉద్దేశ్యం. కానీ ప్రాణమున్న జీవులను, జంతువులను హింసిస్తున్నారు, చంపుతున్నారు. ప్రాణమున్న మానవులను ద్వేషిస్తున్నారు. అంటే ఇక్కడ ప్రాణమున్నా దేవుడని భావించకపోవడం వల్ల ఆ రకంగా ప్రవర్తిస్తున్నాడు. అంటే అంతా భావాల్ని బట్టే ఆరాధనలు చేస్తున్నట్టు కదా!

అలాగే పూజలో సమర్పించేవి అన్నీ భగవంతుడు గ్రహిస్తాడు. చూస్తాడు అని భావించి చేస్తున్నారు. కానీ భగవంతుడు చూసాడా? గ్రహించాడా? అన్నది మానవునికి తెలియదు. కానీ తన భావం ప్రకారం అలా చేస్తున్నాడు. అలా పూలు, పత్రితో పూజించినా, ధూపం, దీపం చూపించినా, నైవేద్యాలు సమర్పించినా

అన్నీ భగవంతుడు గ్రహిస్తాడనే మానవుని భావం. అంతే కాదు భగవంతునికి ఈ రోజు ఇష్టమని, లేకపోతే నైవేద్యం ఇష్టమని భావించి ఆ రోజులలో విశేషమైన పూజలు, ఉపవాసాలు, దర్శనాలు చేస్తుంటారు. ఆయా పదార్థాలు నైవేద్యంగా సమర్పిస్తారు. కారణం అలా ఇష్టపడతాడని భావించడమే. భావించే చేస్తాడు. అంతే కానీ నిజంగా దేవునికి ఆకలి, దప్పికలు వుంటాయా? దేవునికి ఆహారం అవసరమా? అని మానవుడు ఆలోచించడు.

అలాగే భగవంతుడు నిద్రపోతాడని భావిస్తూ ఉదయాన్నే సుప్రభాతం పాడతారు. భగవంతునికి నిద్ర అవసరం అని భావిస్తూ పవళింపు సేవలు చేస్తారు. అంతేకానీ భగవంతుడు నిద్రపోతాడా? అసలు ఆయనకు నిద్ర అవసరమా? ఆయన నిద్రపోతే లోకాలన్నీ ఏమవుతాయి? అని ఆలోచించరు. ఇదంతా ఎవరి భావాన్ని బట్టి వారు చేస్తూంటారు.

అలాగే ఆయనకు స్నానం అవసరమని భావిస్తూ అభిషేకాలు చేస్తారు. ఆయనకు శుద్ధి చేస్తారు. కానీ అసలు భగవంతునికి శుద్ధి అవసరమా? స్నానం అవసరమా? ఆయనకు మురికి అంటుకుంటుందా? లేదా? అని ఆలోచించరు. తమ భావాన్ని బట్టి చేస్తారు.

అలాగే భగవంతుడు ముడుపులు, మొక్కులు కోరుకుంటాడు. ఇష్టపడతాడని భావిస్తూ ముడుపులు చెల్లిస్తారు, మొక్కులు తీర్చుకుంటారు. అంతే కానీ అల్పమైన కానుకలు ఆయన ఆశిస్తాడా? అసలు ఈ సృష్టే ఆయనది కదా? ఈ భూమి మీద వున్న సంపదలన్నీ ఆయనవే కదా? అలాంటి భగవంతునికి మనం ఇచ్చే కానుకలు ఏ పాటివి? అని ఆలోచించరు. ఇదంతా ఎవరి భావాన్ని బట్టి వారు చేస్తుంటారు.

అలా లోకంలో గమనిస్తే భగవంతుని విషయంలో ఒక్కొక్క మతంలో భావాలు ఒక్కొక్క రకంగా వుంటాయి. ఎవరి భావాలను బట్టి వారు ఆరాధిస్తూ వుంటారు. అంటే భావాలను బట్టే ఆరాధనలు వుంటాయని స్పష్టంగా తెలుస్తుంది. ఆరాధనలలో భావమే ప్రధాన పాత్ర పోషిస్తుందని గమనిస్తే అర్థమవుతుంది.

అంతే కాదు విగ్రహారాధనలు చేసే వారు కూడా తమ తమ భావాల్ని బట్టి ఆరాధనలు చేస్తున్నారు. కొందరు విగ్రహమే దేవుడని భావించి ఆరాధిస్తారు. మరి కొందరు విగ్రహంలో దేవుడున్నాడని భావిస్తూ ఆరాధిస్తూ వుంటారు. ఇంకా

కొందరు విగ్రహాన్ని ఆరాధిస్తే దేవుణ్ణి ఆరాధించినట్టేనని భావిస్తూ ఆరాధిస్తారు. అలా ఎవరి భావాన్ని బట్టి వారు ఆరాధిస్తూ వుంటారు. అంటే ఇవన్నీ భావాల్ని బట్టే కదా?

కానీ గుర్తుంచుకోవలసింది మానవుడు భావించినా, భావించక పోయినా, ఎలా భావించినా! భగవంతుడు, భగవంతుడే. ఆయన సత్యమైన వాడు, నిత్యమైనవాడు, శాశ్వతమైనవాడు, మార్పు చెందని వాడు. ఆయన మానవుని భావాలను బట్టి వుండడు. మానవుడు భావించకపోతే భగవంతుడు కాకపోడు. భావిస్తే భగవంతుడు అయిపోడు. మానవుని భావాన్ని బట్టి భగవంతుడు ఉండడు. ఆయనకు ఎవరి భావాలతో పని లేదు. ఆయన్ను బట్టే సమస్తమూ వున్నాయి. సమస్త సృష్టీ వుంది. సర్వజీవులు వున్నాయి. సమస్త మానవులూ వున్నారు. వీరందరి భావాలు మారవచ్చు కానీ ఆయన మారడు. ఆయన మార్పు చెందడు. మార్పు చెందేది, మారేది ఆయన కానే కాదు. ఆయన సత్యమైనవాడు. ఆయనను బట్టి మానవుడు ఆరాధించాలి కానీ, తన భావాన్ని బట్టి కాదు. ఒకరి భావం ఇంకొకరి భావం ఒకే రకంగా వుండదు. **"భావాలు అనేకం కానీ భగవంతుడు ఒక్కడే".**

అందుచేత భావాలు ప్రక్కన పెట్టి సత్యమైన భగవంతుని ఆరాధించాలి. మరి సత్యమైన మార్పు చెందని భగవంతుడు ఎవరు? అదే ఆత్మ, ఆత్మే సత్యమైన భగవంతుడు. ఆత్మ ఆరాధనే సత్యమైన భగవదారాధన. ఆత్మను ఆరాధిం చడమంటే ధ్యానం చెయ్యడం. అందుచేత ధ్యానం చేసేవాళ్ళే భగవదారాధకులు, భక్తులు కూడ.

**" స్వంత కళ్యాణం జరిగితే గొప్ప ..**
**లోక కళ్యాణం చేస్తే మహా గొప్ప "**
**- బ్రహ్మర్షి పత్రీజీ**

# భావిస్తేనే దేవుడా?

విగ్రహంలో దేవుడు వున్నాడంటున్నారంటే అర్థం విగ్రహంలో వున్నవాడు మాత్రమే దేవుడు అని చెప్పినట్టే కదా? మరి 'లో' నున్నవాడు కనిపిస్తాడా? అంటే కనిపించడు కదా? దానిని బట్టి కనిపించే విగ్రహం దేవుడు కానట్టేగా?

విగ్రహంలో కనిపించేది, కనిపించనిది రెండూ వున్నాయి. కనిపించేది రాయితో తయారుచేసిన బొమ్మ. కనిపించనిది మాత్రమే భగవంతుడు.

మానవులు కనిపించే రూపానికే ప్రాముఖ్యం ఇస్తున్నారు. కనిపించని భగవంతునికి ప్రాముఖ్యం ఇవ్వడం లేదు. కనిపించని భగవంతునికి ప్రాముఖ్యం ఇచ్చేవారైతే భగవంతుని అన్నిటిలోనూ, అందరిలోనూ ఉన్నాడని అర్థం చేసుకుంటారు. అంతేకాదు తనలో కూడా వున్నాడని అర్థం చేసుకుంటారు.

కాని మానవులు రూపం చెక్కిన వాటిలోనే భగవంతుడుంటాడు అని భావిస్తారు. ఇంకా తనకు నచ్చిన రూపం లోనే వుంటాడు అని భావిస్తారు. ఇదంతా అడిగితే చెపుతారు. లేకపోతే రూపమే భగవంతుడని భావిస్తారు. అంతేకాదు తనకు నచ్చని రూపం భగవంతుడు కానట్టుగా ప్రవర్తిస్తారు. కాదని కూడా వాదిస్తారు. అలా ఎన్నో రకాలుగా వాదిస్తారు, కాని ఆలోచించరు. అర్థం చేసుకోరు. వినరు. ఇది భగవంతుని విషయంలో మానవుని స్థితి.

మానవుని ప్రవర్తన ఎలా వుందంటే తాను భావిస్తే దేవుడు. భావించకపోతే దేవుడు కాదు అన్నట్టు వుంది. ఎంత విచిత్రం? మానవుడు ఏది, ఎలా భావిస్తే అలా అయిపోతాయా? ఆలోచించండి పిల్లిని మానవుడు పులి అని భావిస్తే పిల్లి పులి అయిపోతుందా? గాడిదను గుర్రమని భావిస్తే గాడిద గుర్రం అయిపోతుందా? తాడును పాము అని భావిస్తే పాము అయి పోతుందా? పూరి గుడిసెను పెద్ద బంగళాగా భావిస్తే బంగళా అయిపోతుందా? అవ్వవు కదా?

అందుచేత మనం ఎంత భావించినా విగ్రహం, విగ్రహమే కాని దేవుడు కాదు. అందుచేత అసలు దేవుడెవరో తెలుసుకుని సత్యమైన దేవుణ్ణి ఆరాధించాలి.

కొంతమంది "యద్భావం తద్భవతి" అని శ్రీకృష్ణుడు అన్నారు కదా అంటారు. అందుచేత విగ్రహాన్ని దేవుడిగా భావించి ఆరాధిస్తున్నాము అంటారు. లోకమంతా అలాగే భావిస్తుంది కదా? అని కూడా చెబుతారు. కాని 'యద్భావం

తద్భవతి' అంటే నీ భావాన్ని బట్టి నీ ప్రవర్తన ఉంటుంది. అంతేకాని నీవు భావించినట్టుగా సత్యం మారదు.

ఎందుచేతనంటే నువ్వు ఎమ్.ఎల్.ఎని కలవటానికి వెళ్ళావు. పదిమంది కూర్చున్నారు. అందులో ఎమ్.ఎల్.ఎ ఎవరో నీకు తెలియదు. అందులో ఒకరిని ఎమ్.ఎల్.ఎగా భావించావు. వెంటనే ఆయనకు నీవు నమస్కరిస్తావు. దండ వేస్తావు. కాని నువ్వు ఎమ్.ఎల్.ఎగా భావించినంత మాత్రాన అతను ఎమ్.ఎల్.ఎ. అయిపోతాడా? కాదు. నువ్వు ఎంత భావించినా అతడు సామాన్యుడే. కాని నువ్వు అలా భావించేవు కాబట్టి నువ్వు అతనికి నమస్కరించావు, దండవేశావు, పాదాలమీద పడ్డావు, అంటే నీ భావాన్ని బట్టి నీ ప్రవర్తన వుంటుంది కాని నువ్వు భావించిన వాడు ఎమ్.ఎల్.ఎ అయిపోడు.

ప్రక్కనే నిజమైన ఎమ్.ఎల్.ఎ వున్నాడు. ఆయన్ను నువ్వు ఎమ్.ఎల్.ఎగా భావించలేదు. నువ్వు భావించనంత మాత్రాన ఆయన ఎమ్.ఎల్.ఎ. కాకుండా పోతాడా? నువ్వు భావించినా భావించకపోయినా ఆయనే ఎమ్.ఎల్.ఎ. అది వాస్తవం. నీ భావాన్ని బట్టి సత్యం మారదు. నీ ప్రవర్తన మారుతుంది.

ఎమ్.ఎల్.ఎ కాకపోయినా ఎమ్.ఎల్.ఎ అని భావించావు కాబట్టి నమస్కరించావు ఎమ్.ఎల్.ఎ అయినా ఎమ్.ఎల్.ఎ కాదని భావించావు కాబట్టి నమస్కరించలేదు. ఎమ్.ఎల్.ఎని వదలి పక్కవాడికి నమస్కరిస్తే నిజమైన ఎమ్.ఎల్.ఎ నిన్ను పట్టించుకుంటాడా? నీ పని చేస్తాడా? పైగా ఆయన వుండగా ఆయన్ను గుర్తించకపోవడం, గౌరవించకపోవడం, ఆయన్ను అవమానించినట్లే కదా! అవమానించిన వారి పని ఆయన ఎలా చేస్తాడు?

అంటే అలా తప్పుగా భావించి ప్రవర్తించడం వల్ల నష్టపోతాము కాని లాభపడం? ఎమ్.ఎల్.ఎ ఎవరో తెలియనపుడు తెలుసుకోవాలి ఎమ్.ఎల్.ఎ ను గౌరవించాలి. అంతే కాని తెలుసుకోకుండా నీ భావం ప్రకారం ప్రవర్తిస్తే నష్టపోయేది నీవే.

అలాగే భగవంతుడు ఎవరు? ఎలా వుంటాడు? అన్నది తెలుసుకుని ఆయన్ను ఆరాధించాలి అంతే కాని నీకు నచ్చినట్టుగా, నీకు నచ్చినవాటిని భగవంతుడని భావించి చేసే ఆరాధనలన్నీ వ్యర్ధమవ్వడమే కాదు నష్టదాయకం కూడ.

సత్యమైన భగవంతుడ్ని నీకు అత్యంత సమీపంలో వుంచుకుని ఆయన్ను గుర్తించకుండా ఆయన్ను ఆరాధించకుండా ఆయన్ను విస్మరించి, నేను భావించకూడదా? నేను భావించి చేస్తున్నాను. విగ్రహంలో లేడా? అందరూ ఎందుకు చేస్తున్నారు? అని ప్రశ్నిస్తూ చేసే ఆరాధనలు వ్యర్థం. పైగా భగవంతుని గుర్తించనందుకు ఆయన్ను విస్మరించి చేసే పనులు ఆయన్ను అవమానించినట్లు అవుతుంది కాని ఆయన్ను ఆరాధించినట్లు ఎలా అవుతుంది? అలాంటి వారికి ఆయన అనుగ్రహం ఎలా లభిస్తుంది? నాకు తెలియదు అంటే సరిపోతుందా? తెలుసుకోవాలి. తెలుసుకుని ఆరాధించాలి.

మరి సత్యమైన భగవంతుడు ఎవరు? ఎలా ఆరాధించాలి? సత్యమైన భగవంతుడు అందరిలో వున్న 'ఆత్మ'. 'ఆత్మ' ఆరాధనే నిజమైన ఆరాధన. 'ఆత్మ'ను ఆరాధించాలి అంటే ధ్యానం చెయ్యాలి. అందుచేత ధ్యానమే నిజమైన భగవదారాధన అని తెలుసుకోండి. అందుకే యోగులంతా ధ్యానమే చేశారు.

**" ప్రకృతితో సదా**
**సాన్నిహిత్యం కలిగి ఉండాలి "**

**- బ్రహ్మర్షి పత్రీజీ**

# “భావమా? - సత్యమా?”

లోకంలో భగవంతుని ఆరాధనలన్నీ భావాన్ని బట్టే జరుగుతున్నాయి. అందరూ భావానికి ప్రాముఖ్యం ఇస్తున్నారు కాని సత్యానికి ప్రాముఖ్యం ఇవ్వడం లేదు. కాని “భావం కంటే సత్యమే గొప్పది”. భావాన్ని పట్టుకున్నవారి కంటే సత్యాన్ని పట్టుకున్నవారే గొప్పవారు.

సామాన్యులు, పండితులు ‘భావానికి’ ప్రాముఖ్యం ఇస్తున్నారు. కాని యోగులు ‘సత్యానికి’ ప్రాముఖ్యం ఇచ్చారు. ‘సత్యాన్ని’ పట్టుకున్న వారు ధన్యులయ్యారు. చివరకు దేవుళ్ళయ్యారు.

కారణం భావం అంటే ‘మనస్సు’. సత్యం అంటే ‘ఆత్మ’. కొంచెం ఆలోచిస్తే మనసు గొప్పదా? ఆత్మ గొప్పదా? అంటే ఆత్మే గొప్పదని చెపుతారు. కారణం మనసు శరీరంతో పాటు వస్తుంది. మరల శరీరంతో పాటు అదృశ్యమై పోతుంది. కాని ఆత్మకు పుట్టుక లేదు చావు లేదు. మనసు తాత్కాలికమైతే, ఆత్మ శాశ్వతమైనది. అందుకే సృష్టిలో ఆత్మ ఒక్కటే సత్యమని అంటారు.

గమనిస్తే కాలానుగుణంగా మనసు యొక్క భావాలు మారుతూ వుంటాయి. ఒకరి భావానికి మరియొకరి భావానికి సంబంధం వుండదు. లోకంలో భావం మీద ఆధారపడ్డారు కాబట్టి భగవంతుడి గురించి ఒక్కొక్కరు ఒక్కొక్కరకంగా చెపుతుంటారు. ఒక మతం విగ్రహం భగవంతుడని భావిస్తే! ఇంకొక మతం ఫొటో భగవంతుడంటారు. మరియొక మతం వారు భగవంతునికి రూపం లేదని భావిస్తారు. ఒకరు భగవంతుడు ఆలయంలో వుంటాడని భావిస్తే, ఇంకొకరు చర్చిలో వుంటాడని భావిస్తారు. మరియొకరు మసీదులో వుంటాడని భావిస్తారు.

అలా భావాలు, వ్యక్తులను బట్టి, సంఘాలను బట్టి, మతాలను బట్టి, ప్రాంతాలను బట్టి, దేశాలను బట్టి మారుతూ వుంటాయి. కాని కాలం మారినా, కాలానుగుణంగా సృష్టిలో ఎన్ని మార్పులు వచ్చినా ‘సత్యమైన ఆత్మ’ మారదు. మరి ఏది సత్యమైనది? నిత్యమైనదే సత్యం. మరి ఏది నిత్యం? శాశ్వతమైనదే నిత్యం. మరి ఏది శాశ్వతం? యుగాలు మారినా మార్పు చెందనిదే శాశ్వతం. అదే ‘ఆత్మ’. అందుచేత ‘అశాశ్వతమైన మనసు’ యొక్క భావాన్ని బట్టి కాక, ‘సత్యమైన ఆత్మ’ను ఆరాధించాలి. ఆశ్రయించాలి. దృష్టి వుంచాలి. వాడే

ధన్యుడు.

అలాగే ఒకళ్ళు విగ్రహం దేవుడని భావిస్తే ఇంకొకళ్ళు తులసి మొక్క అంటే చెట్టు దేవుడని భావిస్తారు. ఇంకొకళ్ళు నది దేవుడని భావిస్తే, మరొకరు అగ్ని దేవుడని భావిస్తారు. ఇంకొకళ్ళు సూర్యుడు దేవుడని భావిస్తే కొంతమంది ఆవు, పాము, ఎద్దు లాంటి జంతువులు దేవుడని భావిస్తారు. ఇంకొకళ్ళు వాయువు దేవుడంటే, మరొకరు భూమాత దేవుడంటారు. ఇలా ఎవరి భావాన్ని బట్టి వాళ్ళు ఆరాధనలు చేస్తున్నారు. కాని ఎవరూ కూడా సత్యమైన ఆత్మను అంటే భగవంతుణ్ని గుర్తించడం లేదు.

పత్రీజీ ఒక సందర్భంగా చిన్న 'కాన్సెప్ట్' చెప్పారు. ఎవరో సత్యం గురించి చెప్పమంటే యీ విధంగా చెప్పారు. సత్యం 4 రకాలు. 1. క్షణకాల సత్యం 2. జీవిత కాల సత్యం 3. యుగకాల సత్యం. 4. శాశ్వత సత్యం.

క్షణకాల సత్యం అంటే ఇపుడు వుండి మరికాసేపట్లో వుండనిది. చిన్న ఉదాహరణ ఒక ప్లేట్లో స్వీటు వుంచుకుని తింటున్నాం. ప్రస్తుతానికి స్వీటు వుంది అది సత్యమే కానీ, మనం తిన్నాక వుంటుందా? అంటే వుండదు. వుందా? అంటే వుంది. లేదా? అంటే లేదు. అంతకుముందు వుంది, ప్రస్తుతం లేదు దీనినే క్షణకాల సత్యమంటారు. టి.వి.లో బొమ్మ కనిపిస్తుంది. అదే బొమ్మ మరికాసేపటికి ఉండదు. ఇలాంటివన్నీ క్షణకాల సత్యాలే. ఒక రకంగా భోగభాగ్యాలన్నీ క్షణకాల సత్యాలే.

అలాగే జీవితకాల సత్యం కూడా వుంది. పుట్టిన మానవుడు ప్రస్తుతం వున్నాడు. కాని అతని జీవితకాలం అయిపోతే వుంటాడా? అంటే వుండడు. అలాగే సృష్టిలోని అన్ని జాతులు. వృక్షజాతి కాని, క్రిమికీటకాలు కానీ, పక్షిజాతి కానీ జంతుజాతి కానీ ప్రస్తుతం వుంటాయి. తరువాత అదృశ్యమైపోతాయి. మరి వున్నాయా? అంటే వున్నాయి. కానీ వాటి జీవితకాలం అయిపోయాక వున్నాయా? అంటే లేవు. ఇవన్నీ కూడా జీవితకాలసత్యాలు.

అలాగే యుగకాల సత్యం కూడా వుంది. మనకు కనబడే సూర్యుడు, చంద్రుడు లాంటి గ్రహాలు, కనబడని గ్రహాలు, లోకాలు, భూమి, నీరు, అగ్ని, వాయువు లాంటి పంచభూతాలు అన్నీ ప్రస్తుతం వున్నాయి. కానీ యుగాంతంలో అన్నీ అదృశ్యమయ్యేవే. వీటిని యుగకాల సత్యం అంటారు.

అందుకే "భగవంతుడు కన్ను మూస్తే సృష్టి అంతం. కన్ను తెరిస్తే సృష్టి ప్రారంభం" అని అంటారు.

అలాగే 'శాశ్వత సత్యం' ఒకటి వుంది. అదే 'ఆత్మ' అంటే 'భగవంతుడు'. ఈ 'ఆత్మ'కు అంటే 'భగవంతుని'కి అంతం లేదు, ప్రారంభం లేదు; చావు లేదు, పుట్టుక లేదు. అందుకే భగవంతుణ్ణి 'సత్యం'తో పోలుస్తారు. కారణం శాశ్వతమైన వాడు కాబట్టి.

శంకరాచార్యులవారు "బ్రహ్మసత్యం జగన్మిథ్య" అని అన్నారు. కానీ మానవులు మిధ్య అయిన జగత్తును భగవంతుడిగా భావిస్తున్నారు. కానీ శాశ్వత సత్యమైన 'ఆత్మ'ను భగవంతుడిగా భావించడం లేదు. సత్యమైన 'ఆత్మ'ను విస్మరిస్తే నష్టపోయేది మనమే. అందుచేత భావం గొప్పది కాదు. సత్యమే గొప్పదని తెలుసుకోవాలి. 'సత్యాన్ని' ఆశ్రయించాలి. అలాంటి సత్యమైన ఆత్మమీద దృష్టి వుంచాలంటే ఎవరైనా "శ్వాస మీద ధ్యాస" వుంచి ధ్యానం చెయ్యవలసిందే. అంతకు తప్ప వేరే మార్గం లేదు. మరొక్కసారి గుర్తుంచుకోండి **"భావం కాదు సత్యమే గొప్పది".**

**" చంపవలసింది**
**ప్రక్కవాళ్ళను కాదు ..**
**'నేను', 'నాది' అన్న వాటిని "**

**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "ఆత్మసాక్షాత్కార మార్గానికి మెళుకువలు!"

కుక్కకు కూడా యజమాని పట్ల కృతజ్ఞతా భావం వుంటుంది. కృతజ్ఞత చూపనివాడు కుక్కకంటే హీనుడు. ఆత్మవల్ల అనేక లాభాలు పొందుతూ ఆత్మ గురించి తెలుసుకోకుండా ఆత్మని మరచిపోవడం, ఆత్మను పట్టించుకోకపోవడం, ఆత్మమీద దృష్టి వుంచకపోవడం కృతజ్ఞత లేకపోవడమే. వాడు పశువు కన్నా హీనుడే.

సహజంగా మానవులు దానాలు చేసి తృప్తిపడతారు, వ్రతాలాచరించి పుణ్యం వచ్చిందనుకుంటారు. యజ్ఞాలు నిర్వహించి, సమస్తదేవతల అనుగ్రహం పొందామని మిడిసిపడతారు. జప, తపాలు చేసి స్వర్గం చేతికందినట్లు భ్రమపడతారు. దేవాలయదర్శనాలు తీర్థయాత్రలు పుణ్యలోకాలకు దారిచూపిస్తాయనుకుంటారు. కానీ ఎన్ని చేసినా ఆత్మ జ్ఞానం సిద్ధించనంత వరకు ఇవన్నీ నిష్ప్రయోజనం. వీటన్నిటి వల్ల దుఃఖం నివారణ కాదు, బ్రహ్మత్వం లభించదు.

అలాంటి ఆత్మ జ్ఞానం, ఆత్మ సాక్షాత్కారం సిద్ధించాలంటే అంత తేలికైన విషయం కాదు. దానికి ముఖ్యంగా విశేషమైన ధ్యాన సాధన చెయ్యాలి. యోగుల పుస్తకాలు చదవాలి, ఆత్మ గురించి బోధించగలిగేవారి సాంగత్యం చెయ్యాలి. వీటితో పాటు ఈ క్రింది మెళకువలు పాటించాలి.

1) అహింస :- సృష్టిలోని ఏ ప్రాణికి, జీవికి శారీరకంగా కాని, మానసికంగా కానీ హింస కలిగించకూడదు. ఏ జంతువును చంపకూడదు. వాటి మాంసం భక్షించకూడదు. అమాయకపు మూగ జీవులపై దయ కలిగి వుండాలి.

2) సత్యవర్తనం :- సర్వ జీవరాసులు అంటే మానవులే కాకుండా జంతువులు, వృక్షాల విషయంలో కూడా సమస్థితిని కలిగి వుండాలి, తనకే కాదు భూమిపై జీవించే హక్కు వాటికి కూడా వుందని తెలుసుకుని వాటిని గౌరవించగలగడమే సత్యవర్తనం.

3) స్నేహం :- సృష్టిలో అంతా ఒక్కటే, అన్నీ నేనే, నేనే అంతా "మమాత్మా సర్వభూతాత్మ" అన్న సత్యం తెలుసుకుని, వృక్షాలతో సహా సమస్త జీవకోటితో స్నేహం చెయ్యాలి.

4) ధర్మాచరణ :- అంతరాత్మ చెప్పే ధర్మాలు, సలహాలు, హెచ్చరికలు గమనించి, పాటించగలగడమే ధర్మాచరణ.

5) దానం :- మనకు ఇవ్వబడిన సమయాన్ని, వాక్కును, శక్తిని, సంపాదనలన్నీ ప్రతిఫలం ఆశించకుండా లోకం కోసం వినియోగించడమే దానం.

6) నిస్వార్థ సేవ, త్యాగశీలత :- ఇవి రెండూ ఆత్మను చేరుకోవటానికి సోపానాలు అని తెలుసుకోవాలి.

7) గమనిక :- మనల్ని మనమే అంటే మన ఆలోచనలు, మాటలు,పనులు, నడవడిక లాంటివి తరచుగా గమనించి చూసుకుంటూ వుండాలి.

8) తెలుసుకోవలసింది :- పని చెయ్యటానికి ప్రాముఖ్యం ఇవ్వాలి. ఫలితం ఆశించకూడదు.

9) సాధన :- 'కష్టే ఫలి' అని తెలుసుకోవాలి. కష్టపడి ధ్యాన సాధన చెయ్యాలి.

10) స్వాధ్యాయం :- అనుభవ జ్ఞానం కల యోగుల పుస్తకాలు చదవాలి.

11) వివేకం :- మీ గురించి చెడుగా మాట్లాడినా, తిడుతున్నా, కించపరచినా, అవమానించినా, మీ కీర్తి ప్రతిష్టలు పోయినా ఎలాంటి కల్లోల పరిస్థితుల్లోనూ వివేకాన్ని కోల్పోకూడదు.

12) సజ్జన సాంగత్యం :- సత్యం గురించి తెలిసిన వారు అంటే ఆత్మ జ్ఞానులు అంటే ఆత్మ గురించి చెప్పగలిగే వారి సాంగత్యం చేయాలి.

13) ఆనందంగా వుండాలి :- అన్ని స్థితులలో ఆనందంగా వుండగలగాలి అంటే శీతోష్ణాలలో, సుఖ దుఃఖాలలో, మానావమానాలలో, గెలుపుఓటములలోనే కాదు, పళ్ళు వూడినా, జుట్టు నెరిసినా, చర్మం ముడతలు పడినా సరే.

14) స్వతంత్రులు కావాలి :- స్వేచ్ఛగా, స్వాతంత్ర్యంగా జీవించడం అలవరచుకోవాలి. పరతంత్రులు కాకూడదు. స్వతంత్రులు కావాలి. అంటే పరుల కోసం జీవించకూడదు. ఇతరులు ఏమనుకుంటారోనని చేయకూడదు. మీ అంతరాత్మను అనుసరించి నడచుకోవాలి.

15) అంతర్ శ్రవణం :- ధ్యాన సాధన చేస్తున్నప్పుడు మీరు ఊహించని సూచనలు అంతరం నుండి వస్తాయి. దర్శనాలు, స్వప్నాలు, మాటలు, అతి సూక్ష్మప్రేరణలు, హఠాత్ ప్రజ్ఞలు కాని అనుభవంలోకి వచ్చినపుడు పుస్తకంలో వ్రాసి వుంచుకోవాలి. వాటిని మననం చెయ్యాలి. వాటిని ఆచరణలో పెట్టగలగాలి.

14) అంతర్‌సాయం :- అజ్ఞాతంగా, ధ్యానంలోనే ఎక్కువ సాయం అందుతూ వుంటుంది. అందుచేత ధ్యానం ఎక్కువ చెయ్యాలి. ఆ అంతర్ సాయంతో గొప్ప కార్యాలు, నిస్వార్థ సేవలు చేస్తూ వుండాలి.

15) పవిత్రత :- "పవిత్ర జీవనమే పరమాత్మ సన్నిధికి అంటే ఆత్మను చేరుకునే మార్గమని తెలుసుకోవాలి". పవిత్రంగా జీవించాలి.

16) నేను, నాది :- ఇక్కడ 'నేను' చేసేది ఏమీ లేదు. 'నాది' అన్నది కూడా ఏమీ లేదని తెలుసుకోవాలి. ఏదీ నా స్వంతం కాదు. నాకు ప్రాప్తించినవి. నాకు ఇవ్వబడుతున్నవి సక్రమంగా, నిస్సంగత్వంతో ఉపయోగించుకోవడం కోసం మాత్రమే ఇవ్వబడుతున్నాయని అర్థం చేసుకోవాలి. "నేను అనే అహంకారం, నాది అన్న మమకారం తొలగించుకోవాలి".

పైవన్నీ 'ఆత్మసాక్షాత్కారానికి' అంటే "భగవత్ సాక్షాత్కారానికి" కొన్ని మెళకువలు. ఇవన్నీ 'ఆత్మ' గురించిన జ్ఞానాన్ని ఇస్తాయి. 'ఆత్మ'ను సాక్షాత్కరించుకోవడానికి ఉపకరిస్తాయి. మానవుడు తప్పనిసరిగా ఇవన్నీ పాటించాలి. కారణం 'ఆత్మవల్లే' మానవుడు భూమి మీద వున్నాడు. 'ఆత్మ' లేకపోతే శరీరం శవమవుతుంది. మానవుని ఉనికే లేదు. 'ఆత్మ' వల్లే మానవుడు ఇన్ని భోగాలు అనుభవిస్తున్నాడు. అది మరచిపోవడం వల్లే మరల అన్ని దుఃఖాలు అనుభవిస్తున్నాడు. అందుచేత పై విషయాలన్నీ పాటించి 'ఆత్మరుణం' తీర్చుకోవాలి. 'ఆత్మ' పట్ల మీ కృతజ్ఞత చూపించాలి. అంటే ధ్యానం ఎక్కువ చెయ్యాలి. అన్నిటి మీద కంటే 'ఆత్మ' మీద దృష్టి ఎక్కువ వుంచాలి.

**" త్యాగం వల్లనే**
**అమృతత్వం సిద్ధిస్తుంది "**
**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "భగవద్దర్శనం!"

'భగవద్ధర్శనం' అయినవాడు అంతులేని, వర్ణించలేని ఆనందానుభూతి పొందుతాడు. ఆ సమయంలో వాడి సమస్త సందేహాలు, సంశయాలు నివృత్తి అవుతాయి. సమస్త భయాలు తొలగుతాయి. (తిండిభయం, రోగ భయం, సమస్యల భయం, మరణ భయం) కోరికలన్నీ పటాపంచలవుతాయి. మాయా బంధాలలోంచి బయటపడతాడు. సమస్తమూ ఒక్కటే అని తెలుసుకుంటాడు. సమస్త పాపాలు నశించిపోతాయి. అంతులేని, వర్ణించలేని బ్రహ్మానందాన్ని పొందుతాడు. భగవంతుని దర్శనం చేసుకున్నవారి స్థితి ఇలా వుంటుంది. భగవద్ధర్శనం కాని వారి స్థితి ఇలా వుండదు.

విగ్రహం భగవంతుడనే వారు విగ్రహ దర్శనంతో ఈ ఫలితాలన్నీ పొందగలుగుతున్నారా? అని ఆలోచిస్తే లేదనే ఖచ్చితంగా చెప్పవచ్చు. ఈ ఫలితాలు పొందకపోతే విగ్రహదర్శనం వల్ల భగవద్ధర్శనం కానట్టే కదా? అంటే విగ్రహం భగవంతుడు కానట్టే కదా? అలాంటి వాడు సత్యమైన భగవంతుడెవరో వెతకాలి.

అలాగే చాలామంది భగవత్‌స్థితి పొందిన వారి దర్శనం చేసుకుంటే భగవంతుని దర్శించినట్లవుతుందని భావిస్తూ అలా దర్శించి జన్మధన్యమైనట్లుగా భావిస్తారు. అలా సత్యసాయిబాబా, సుభాష్‌పత్రిలను దర్శించటానికి ప్రయత్నిస్తారు. అలా దేవుళ్ళనే వారిని దర్శించినపుడు పై మార్పులు తమలో వచ్చాయా? లేదా? అని చూసుకోవాలి. ఆ లాభాలన్నీ పొందగలిగామా? లేదా? అని చూడాలి. అవి పొందలేకపోతే అలాంటి మార్పులు జరగకపోతే అది కూడా భగవద్దర్శనం కానట్టే కదా?

దీనిని బట్టి భూమిమీద కంటికి కనిపించేది ఏది దర్శించినా భగవద్ధర్శన అనుభూతి కలగదని అర్ధమవుతుంది. కారణం భగవంతుడు బయటలేడు. కనబడే నశించిపోయే రూపం భగవంతుడు కాదు. అందరిలో రూపం లేకుండా ప్రకాశిస్తున్న 'ఆత్మే' భగవంతుడు. అందుచేత 'ఆత్మను' దర్శించటానికి ప్రయత్నించాలి. అంటే అంతర్ముఖులవ్వాలి. అంటే ధ్యానం చేయాలి. ధ్యానం చేసి 'ఆత్మను' దర్శిస్తే 'భగవంతుని' దర్శించినట్టే. అటువంటివారికి పైన చెప్పిన లాభాలన్నీ సమకూరుతాయి.

అందుచేత విగ్రహదర్శనాన్నే భగవద్ధర్శనంగా భావించి సంబర పడకూడదు, తృప్తి పడకూడదు. వివేకంతో ఆలోచించాలి. 'ఆత్మ దర్శనానికి' ప్రయత్నించాలి. 'ధ్యానం' చేయాలి.

# విశ్వమా? - విశ్వనాధుడా?

విశ్వము అంటే 'సృష్టి'. విశ్వనాధుడు అంటే యీ సృష్టిని సృష్టించిన 'భగవంతుడు'. మరోరకంగా చెప్పుకోవాలంటే విశ్వాన్ని 'ప్రకృతి' అంటారు. విశ్వనాధుణ్ణి 'పురుషుడు' అని కూడా అంటారు.

భగవంతుని సృష్టి కనిపిస్తుంది. కాని భగవంతుడు కనిపించడు. అందుచేత మన కంటికి కనిపించేదంతా 'భగవంతుని సృష్టే' కాని భగవంతుడు కాదు. ఇంకా గమనిస్తే సృష్టించబడినవన్నీ అశాశ్వతం, అన్నీ అదృశ్యమయిపోయేవే అంటే మాయమయిపోయేవే. అందుకే కనిపించే సృష్టిని మాయా ప్రపంచం అంటారు. కానీ సృష్టింపబడని 'భగవంతుడు' శాశ్వతమైన వాడు. మార్పు చెందని వాడు సత్యమైన వాడు.

కనిపించే సృష్టిని ప్రపంచంఅంటారు. ఆ మార్గంలో వున్నవారిని ప్రాపంచిక మార్గంలో వున్నవారు అంటారు. మాయవైపు ఆకర్షితులైన వారు అంటారు. అలాగే కనిపించని 'భగవంతుని' మార్గంలో వున్నవారిని 'ఆధ్యాత్మిక మార్గం'లో వున్నవారు అంటారు. మాయ నుంచి బయటపడినవారు అంటారు.

ఇప్పుడు కనిపించి తరువాత మాయమయ్యే, మాయాప్రపంచం మీద ఆకర్షితులయి ఆ వ్యామోహంలో వున్నా వారిని మమకారం వున్నవారు అంటారు. అలా కాకుండా, 'శాశ్వతమైన భగవంతుని' వైపు ఆకర్షితులైన వారిని మమకారం లేని వారు అంటారు.

సృష్టిలో వుండే ఆనందం, సృష్టి నుంచి పొందే ఆనందం తాత్కాలికమైంది. కాని 'భగవంతుని' వద్ద వుండే ఆనందం 'భగవంతుని' నుండి పొందే ఆనందం శాశ్వతమైనది. మానవులు యీ ప్రపంచం వైపు ఆకర్షితులై తాత్కాలిక ఆనందం కోసం యీ ప్రపంచంలోనివే కోరుతున్నారు, కానీ శాశ్వత ఆనందాన్ని పొందగలిగే భగవంతుని ఎవరూ కోరడం లేదు.

ఆఖరికి భగవంతుని పేరుతో వీరు చేసే పూజలు, భజనలు, ప్రార్థనలు, నమాజులు కూడా ఆయన సృష్టిలోనివి ఇమ్మనే కాని, ఆయన గురించి కాదు. అంటే వీరి భక్తి 'సృష్టి మీదే కానీ భగవంతుని మీద కాదు'.

ఇక్కడ ఆలోచిస్తే సృష్టిలోనివి గొప్పవా? వాటిని సృష్టించిన భగవంతుడు గొప్పవాడా? అంటే విశ్వం గొప్పదా? విశ్వనాధుడు గొప్పవాడా? ఎవరు గొప్ప?

అని అడిగితే భగవంతుడే గొప్పవాడు అంటారు. కారణం ఆయన ఇలాంటివి ఎన్నైనా సృష్టించగలడు. అందుచేత **"సృష్టింపబడిన వాటికంటే, వాటిని సృష్టించిన వాడే గొప్పవాడని"** అంటారు.

ఇక్కడ ఇంకా గమనిస్తే అంతా భగవంతుడే గొప్పవాడంటారు కాని కోరుకునేది, ఇష్టపడేది ఆయన సృష్టిని, ఆ సృష్టిలోనివి మాత్రమే. మానవుల ప్రయత్నం, కృషి అంతా సృష్టిలోనివి పొందటానికే తప్ప భగవంతుని పొందటానికి కాదు.

సృష్టిలోనివి పొంది, తాత్కాలికమైన ఆనందం పొందుతున్నారు. కాని దానితోపాటు దుఃఖాన్ని కూడా పొందుతున్నారు. అందుచేత మాయా ప్రపంచం వైపు ఆకర్షితులైన వారు! అంటే మాయలో చిక్కుకొన్న వారు దుఃఖాల పాలవుతు న్నారు. కాని భగవంతుని పొందినవారు దుఃఖం లేని శాశ్వతమైన ఆనందాన్ని, బ్రహ్మానందాన్ని పొందుతారు. అందుచేత మాయను అధిగమించి భగవంతుని వైపు పయనించి శాశ్వత ఆనందాన్ని పొందగలిగినవారే అదృష్టవంతులు.

మానవులకు అయిదు జ్ఞానేంద్రియాలు వున్నాయి. ఆ అయిదు ఇంద్రి యాలను సంతృప్తి పరిచే సుఖాలు ఈ మాయాప్రపంచంలో వున్నాయి. మానవులు ఇంద్రియ సుఖాలకు దాసులై, ఆ సుఖాల కోసమే తమ జీవితాన్నంతా వినియోగిస్తున్నారు. కాని, తమ జీవితంలో కొంత సమయాన్నైనా భగవంతుని కోసం వినియోగించడం లేదు. భగవంతుని గురించి తెలుసుకోవటానికి ప్రయత్నించడం లేదు.

భగవంతుడున్నాడంటారు. భగవంతుడు గొప్పవాడంటారు కాని భగవంతుని కోరరు. ఆయన కోసం ప్రయత్నించరు. ఎంతసేపు సృష్టిమీదే దృష్టి వుంచుతారు. సృష్టి మీద దృష్టి వదలి, భగవంతుని మీద దృష్టి వుంచరు. కానీ వుంచాలి. అదే మానవ జీవిత లక్ష్యం. "విశ్వం కాదు విశ్వనాధుడే గొప్పవాడు". మరి అంతటి విశ్వనాధుని పొందాలంటే ఏం చెయ్యాలి?

శక్తివంతమైన భగవంతుని మీద దృష్టి వుంచాలన్నా, భగవంతుని పొందాలన్నా, మానవులు శక్తివంతులవ్వాలి. శక్తిని పెంచుకోవాలి. శక్తివంతులైన మానవులే భగవంతునివైపు ఆకర్షితులై, చివరకు భగవంతుని పొందగలరు. కాని మానవులు చేసే పనులు, చర్యలు అన్నీ మానవుని శక్తి హీనులను చేస్తున్నాయి. అందుకే మాయలోంచి బయట పడలేకపోతున్నారు.

'విశ్వం' వైపు ఆకర్షితులైన వారెవరు? అంటే సంసారం, సంపదలు, సుఖాలు, పేరు ప్రఖ్యాతులు, పదవులు లాంటి వాటిని కోరుకునే వారు. అంటే 'కీర్తి, కాంత, కనకం' అనేవాటి మీద ఆకర్షితులయ్యేవారు. వారంతా శక్తిహీనులే. వీరంతా భోగులు. కానీ మాయలోంచి బయటపడి, 'విశ్వనాధుని' కోసం తమ సమయాన్ని, ధనాన్ని, శక్తి, యుక్తులను ఎక్కువ వినియోగించే వారే యోగులు. వీరే శక్తివంతులని అర్ధం చేసుకోవచ్చు. శక్తివంతులు అల్పమైన వాటికి ఆకర్షితులు కారు. అత్యంత శక్తివంతమైన భగవంతుని వైపే ఆకర్షితులవుతారు. అంటే ధ్యానం చేస్తారు.

మనం కూడా భగవంతుని వైపు ఆకర్షితులవ్వాలంటే ధ్యానం చెయ్యాలి. ధ్యానం చేస్తూ మన శక్తి కూడా పెంచుకోవాలి. ఆ ప్రయత్నం చేస్తున్నప్పుడు మనలో శక్తి పెరుగుతుందా? శక్తి తరుగుతుందా? అన్నది తెలుసుకోవాలంటే మన మాటలు, పనులు, ఆలోచనలు గమనిస్తే మనకే తెలుస్తుంది. అవన్నీ ప్రాపంచికమైనవయితే అంటే ప్రపంచానికి సంబంధించినవయితే మనలో శక్తి లేనట్టే. కాని దానికి విరుద్ధంగా ఆధ్యాత్మికమైనవయితే అంటే భగవంతునికి సంబంధించినవైతే మనలో శక్తి వున్నట్టే.

'త్రికరణం' అంటే ఆలోచనలు, మాటలు, చేతలు ఎంత ఎక్కువ భగవంతునికి సంబంధించినవయితే అంటే 'ఆత్మ'కు సంబంధించనవయితే మనం అంత 'శక్తిమంతులం'. అలాకాక మన 'త్రికరణం' ప్రపంచానికి అంటే సృష్టికి సంబంధించినవయితే మనం అంత 'శక్తిహీనులం'.

మనం ఎంత శక్తిహీనులయితే అంత దుఃఖంలో వుంటాం. మనం ఎంత శక్తివంతులయితే అంత ఆనందంలో వుంటాం. మన దుఃఖానికి ఆనందానికి ఇదే కారణం.

అందుచేత 'విశ్వాన్ని' వదలండి. 'విశ్వనాధుణ్ణి' పట్టుకోండి దానికి ధ్యానం చెయ్యండి. 'ధ్యానం' చేస్తే విశ్వనాధుణ్ణి పట్టుకున్నట్టు. 'ధ్యానం' చెయ్యకపోతే విశ్వాన్ని పట్టుకున్నట్టు. 'ధ్యానం' ఎందుకు చెయ్యాలో తెలుసుకోండి. విశ్వనాధుణ్ణి పట్టుకోవడం కోసమే 'ధ్యానం'. శక్తిని పెంచుకోవడం కోసమే 'ధ్యానం'. దుఃఖాన్ని అధిగమించడం కోసమే 'ధ్యానం'. శాశ్వత ఆనందాన్ని పొందడం కోసమే 'ధ్యానం'.



# "తండ్రిని ఇష్టపడండి! తండ్రి ఆస్తిని కాదు"!

ఎవరైనా తండ్రిని ప్రేమిస్తే, తండ్రిని కోరుకుంటే, ఆ పిల్లలమీద తండ్రికి కూడా ఇష్టం ఏర్పడుతుంది. బిడ్డలు అడగకుండానే తన ఆస్థిని ఇస్తాడు. రాసేస్తాడు.

కాని లోకంలో చాలామందికి తండ్రి నచ్చడు. తండ్రి అవసరం లేదు. ఎంతసేపూ వారికి తండ్రి ఆస్తే కావాలి. వారు ఎంతసేపూ తండ్రి ఆస్తి కోసం చూస్తారు. తండ్రి ఆస్థికోసం తండ్రిని వేధించే వారు కూడా వున్నారు. వారి దృష్టి ఎంతసేపూ తండ్రి ఆస్థిమీదే వుంటుంది కాని తండ్రి మీద వుండదు.

ఇంకొంతమంది వుంటారు, వారు తండ్రి ఆస్థికోసం తండ్రిని ప్రేమిస్తారు. ఆస్థి ఇస్తాడని తండ్రి అంటే ఇష్టమంటారు. అంటే వారి నిజమైన ఇష్టం ఆస్థే కాని, తండ్రి కాదు. పైకి మాత్రం తండ్రి ఇష్టమన్నట్టుగా మాట్లాడుతారు. కాని వారి నిజమైన ఇష్టం తండ్రి ఆస్థే. కానీ అతి కొద్ది మంది, తండ్రి ఆస్థి కాకుండా తండ్రిని ఇష్టపడతారు.

అలాగే భగవంతుడు మానవులందరికి తండ్రి. ఈ భూలోకంలో వున్న సంపదలన్నీ ఆయన సృష్టే! ఆయనవే! అంటే ఆయన ఆస్థే!

మానవులందరికీ తండ్రియైన భగవంతుడికంటే, ఆయన ఆస్థి అయిన భూలోకసంపదలంటేనే యిష్టం. అందుచేత ప్రతీ ఒక్కరూ పూజలు, ప్రార్థనలు, నమాజులు చేసి ఆయన ఆస్థిని ఇమ్మని కోరుకుంటారు. కానీ, ఆయనను ఎవ్వరూ కోరుకోరు. ఎంతసేపూ ఆయన ఇస్తాడని, ఆయనంటే ఇష్టపడతారు. ఒకవేళ ఇవ్వకపోతే ఆయనను వదిలేస్తారు. ఫోటోలు మారుస్తారు, మతాలు కూడా మారుస్తారు. అంటే వీరందరి ఇష్టం భగవంతుడు కాదు. ఆయన ఇచ్చేది ఇష్టం. "వీరికి ఇష్టమైనది ఇస్తాడని ఇష్టం".

తండ్రి ఆస్థి పొందటానికి సామ, దాన, భేద, దండోపాయాల్ని పిల్లలు ఉపయోగిస్తారు. అలాగే తండ్రియైన భగవంతుని ఆస్థి పొందడానికి మానవులు పూజలు, స్తోత్రాలు, భజనలు చేస్తారు. వాటితో సాధ్యం కాకపోతే తమను తాము శిక్షించుకునే చర్యలు మొదలుపెడతారు. మొదట తక్కువ నొప్పి కలిగించేవి. అంటే లెంపలు, గుంజీలు, సాష్టాంగ ప్రమాణాలు చేస్తారు. తరువాత హింసించే

చర్యలు పొర్లుదండాలు, కొండలు ఎక్కడాలు, నిప్పులు తొక్కడాలు, ముళ్ళమీద నడవడాలు చేసి ఒత్తిడి పెంచుతారు. లేకపోతే ఆత్మాహుతి, ఆత్మహత్యలు చేసుకుంటామని బెదిరిస్తారు.

కాని ఇవేవీ ప్రయోజనం లేనివి. వీటన్నిటి కంటే ఆయన్ను కోరుకోవాలి. ఆయనను ఇష్టపడాలి. వాడే నిజమైన భక్తుడు. అలాంటి వారికి భగవంతుడు కోరకుండానే కావలసినవి ఇస్తాడు, అనుగ్రహిస్తాడు. అంతేకానీ ఆయన్ను కాకుండా, ఆయన్ను ఇష్టపడకుండా, ఆయన ఆస్థి కోరితే ఎలా అనుగ్రహిస్తాడు? అందుచేత ఇష్టపడవలసింది "తండ్రి ఆస్థిని కాదు తండ్రిని" అని తెలుసుకోవాలి.

తెలుసుకోండి **"కోరికలు కోరేవారు, భగవంతుని నుంచి కోరుతున్నట్టు, కోరనివాడు భగవంతుని కోరుతున్నట్టు".** కోరికలు లేకుండా ఆరాధించండి. అందుచేత ప్రతి ఒక్కరూ తండ్రి అయిన భగవంతుని ఇష్టపడడండి. ఆయన కోసం ప్రయత్నించండి. అంతే కాని తండ్రి ఆస్థి అయిన భూలోక సంపదలు కావు. తండ్రిని పొందిన వాడికి తండ్రి సంపదలన్నీ లభించినట్టే కదా?

కోరికలు కోరకూడదంటే కోరికలకు మూలమైన మనస్సును అదుపులో వుంచుకోవాలి. అంటే ధ్యానం చేయాలి. అలాగే అంతరంలో ఆత్మరూపంలో వున్న భగవంతుని మీద దృష్టి వుంచాలంటే! ప్రతిఫలాపేక్ష లేకుండా పవిత్ర భావంతో 'ధ్యానం' చెయ్యాలి. వారే తండ్రిని ఇష్టపడిన వారవుతారు.

అలా ఆయననే ఇష్టపడితే ఆయన మనమంటే ఇష్టపడడా? ఆయన మనమంటే ఇష్టపడితే అడగకుండానే అనుగ్రహం కలుగుతుంది కదా? అందుచేత "తండ్రిని ఇష్టపడండి. తండ్రి ఆస్థిని కాదు".

**" మనం సదా గుర్తుంచుకోవలసింది**
**' మనమంతా దేవుళ్ళం ' అని "**
**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "అంతా ఒక్కటే!"

మానవ దేహమంటే చేతులు, కాళ్ళు, ముక్కు, కన్ను, చెవి, నోరు ఇలా ఎన్నో ఇంద్రియాలు కలిపి మానవదేహమయ్యింది. అన్నీ కలిపి ఒకటే, అంటే మానవుడే. ఒక్కొక్కటి ఒక్కొక్క పని చేస్తుంది. ఒక్కొక్క పని చేసే దానికి, ఒక్కొక్క పేరు పెట్టారు. నడిచేదాన్ని కాలు అన్నారు, పనిచేసేదాన్ని చెయ్యి అన్నారు, వినేదాన్ని చెవి అన్నారు, చూసే వాటిని కళ్ళు అన్నారు. మాట్లాడేదాన్ని నోరు అన్నారు. ఇలా వివిధ పనులు చేసేవాటికి వివిధ పేర్లు పెట్టారు. కాని అన్ని మానవుడే, అన్నీ మానవునకు సంబంధించినవే. ఇందులో మానవునివి కానివేవీ లేవు. మానవునకు అన్నీ ముఖ్యమైనవే. అన్ని మానవుని శక్తులే. ఇందులో ఏది గొప్ప అని మనం నిర్ణయించలేం. దేని ప్రత్యేకత దానిదే. ఏది లేకపోయినా మానవునికి పూర్ణత్వం వుండదు, అందుచేత ఇది గొప్పది అని విమర్శించుకోవడం, తర్కించుకోవడం మూర్ఖతే అవుతుంది.

అలాగే అంతా భగవంతుడే! ఇక్కడ వేరు, వేరు దేవుళ్ళు, దేవతలు లేరు. ఆ భగవంతుని ఒక్కొక్క శక్తికి, ఒక్కొక్క పేరు పెట్టారు. ఆయన సృష్టి చేసే శక్తికి బ్రహ్మ అని పేరు పెట్టారు. ఆయన పోషించే శక్తికి విష్ణువు అని పేరు పెట్టారు. ఆయన లయం చేసే శక్తికి శివుడు అనీ, ఆయన పరిపాలించే శక్తికి, ఇంద్రుడు అని పేరు పెట్టారు. అలాగే ఆయనకున్న అనేక శక్తులకు అగ్ని, వాయువు, సూర్యుడు, వరుణుడు ఇలా అనేక పేర్లు పెట్టారు.

మానవునిలోని వివిధ పనులుచేసే శక్తులకు అంటే అవయవాలకు వివిధ పేర్లు ఎలా వున్నాయో, భగవంతుని వివిధ శక్తులకు వివిధ నామాలు వున్నాయి. కాని అన్నీ ఆయనే. ఇందులో ఎవరు గొప్ప? ఎవరు ఎక్కువ? ఎవరు తక్కువ? అని వుండదు. అందరూ ఒక్కటే? ఎవరి విశిష్టత వారిది. ఏ అవయవం యొక్క విశిష్టత ఎలాంటిదో, అలాగే ఏ దేవుని యొక్క విశిష్టత, ఏ శక్తి యొక్క విశిష్టత అలాంటిది. 'అంతా ఒకటే!'. ఒకే భగవంతుని యొక్క వివిధ రూపాలే అన్నీ కూడా. అందుచేత దేవుళ్ళంతా వేరు, వేరు కాదు. అలా భావించకూడదు. అది అజ్ఞానం. దేహంలోని భాగాలు మానవుని కంటే భిన్నమైనవి కావు. అవి వేరు వేరు అని అనుకుంటే ఎలా వుంటుందో? అలాగే దేవుళ్ళ విషయంలో కూడా! కారణం "అంతా ఒక్కటే!". అంతా "ఆ భగవంతుడే!" అంతా ఆ భగవంతుని శక్తిలో భాగాలే. అందుచేత భగవంతుడు ఒక్కడే అని తెలుసుకోవాలి. అసలు సృష్టిలో వున్నది ఆయన ఒక్కడే ఇంకెవరూ లేరని తెలుసుకోవాలి. మనమంతా కూడా ఆయనలో భాగాలే తప్ప, వేరే ఏమీ కాదు.

"బ్రహ్మమొక్కటే! పరబ్రహ్మమొక్కటే!" అని అన్నమాచార్యుల వారు అన్నారు కదా! ఈ సత్యం ఆ భగవంతుని అంశ అయిన దేహంలో వున్న ఆత్మమీద దృష్టి

వుంచి ధ్యానం చేస్తే అన్నీ మనకే తెలుస్తాయి. అంతా ఒక్కటే అని తెలుస్తుంది.

మనిషిలో ఒక అవయవాన్ని కానీ లేక ఒక వెంట్రుకను పట్టుకుంటే ఎంతో? అలాగే ఒక దేవుడిని కానీ దేవతను కానీ పట్టుకుంటే భగవంతునిలో ఒక భాగాన్ని పట్టుకున్నట్టు. అదే ఒక పూర్ణ మానవుడిని ఆశ్రయిస్తే అన్ని భాగాలను ఆశ్రయించినట్టు ఎలా అవుతుందో? అలాగే అందరికీ మూలమైన ఆ 'భగవంతుని' ఆ 'పరబ్రహ్మను' ఆశ్రయిస్తే, ఆరాధిస్తే సమస్త దేవుళ్ళను అంటే ముక్కోటి దేవుళ్ళను, దేవతలను ఆరాధించినట్టే. వారికి సమస్త ఫలితాలు కోరకుండానే లభిస్తాయి. అలా ఆ భగవంతుని ఆశ్రయించే మార్గమే ధ్యానం. అందుకే ధ్యానమే నిజమైన సత్యమైన ఆరాధన కారణం ధ్యానం చెయ్యడమంటే యీ సృష్టికి మూలమైన ఆ భగవంతుని అంశ అయిన 'ఆత్మ'ను ఆరాధించడం, సముద్రపు లక్షణాలన్నీ గ్లాసు సముద్రపు నీటిలో ఎలా వుంటాయో! అలాగే 'భగవంతుని' శక్తి అంతా 'ఆత్మ'లో కూడా వుంది.

"భగవంతుని విశ్వరూపంలో" ఒక్కొక్క భాగంలో ఒక్కొక్క దేవుణ్ణి, దేవతల్ని చూపించడానికి కారణం ఇదే.

అంతేకాదు "భగవంతుని విశ్వరూపం"లో సహస్రబాహువులు చూపిస్తారు. అనంతశక్తిస్వరూపుడు కాబట్టి. కానీ 'దేవుళ్ళకు' 4 చేతులే చూపిస్తారు. పరిమిత శక్తి కాబట్టి. దేవతలకు 2 చేతులే చూపిస్తారు. ఇంకా తక్కువ శక్తి కాబట్టి.

మానవుడు ఏ రూపాన్నైనా సృష్టించగలడు. కానీ దానికి చలనాన్ని ఇవ్వలేడు. ప్రాణం పొయ్యలేడు. భగవంతుడు రూపాన్ని ఇవ్వడమే కాదు. వాటికి చలించే, చరించే శక్తి కూడా ఇచ్చాడు. ఆ శక్తి భగవంతునికే వుంది.

ముక్కోటి దేవతలలో ఎవరిని ఆరాధించినా పుణ్యం అంటే భోగం వస్తుంది కానీ, దుఃఖం పోదు. ముక్కోటి దేవతలకు సమానమైన ఆ భగవంతుని అంటే ఆ 'పరబ్రహ్మ'ను అంటే 'ఆత్మ'ను ఆరాధిస్తే అంటే 'ధ్యానం' చేస్తే మోక్షం వస్తుంది. అంటే దుఃఖం పోతుంది.

ఈ విషయాన్నే భగవద్గీతలో శ్రీ కృష్ణ భగవానుడు ఈ క్రింది శ్లోకం ద్వారా చెప్పడం జరిగింది.

**శ్లో॥ అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్**
**దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి (భ.గీ.7-23)**

తా:- అల్పబుద్ధి కలిగిన వారి యొక్క ఆ ఫలము నాశవంతమైయున్నది. ఏలననగా దేవతలను పూజించువారు దేవతలనే పొందుచున్నారు. నా భక్తులు నన్నే పొందుచున్నారు.

తెలుసుకోండి **"భగవంతుని కంటే గొప్పవాడు లేడు, ధ్యానం కంటే గొప్పసాధన లేదు".** అందుకే ధ్యానం చెయ్యండి.

# "దివి నుండి భువికి దిగివచ్చిన దేవుడే మానవుడు!"

మానవుడు ఒక ఇల్లు నిర్మించటానికి తన తెలివి(జ్ఞానం) ఉపయోగించి ప్లాను గీసి, తన ఇచ్ఛాశక్తి (విల్‌పవర్) ఉపయోగించి, అంటే కష్టపడి, అలాగే పనివారు మేస్త్రీలను ఉపయోగించి, అంటే తన క్రియాశక్తిని జోడించి ఇంటిని నిర్మిస్తాడు. ఇదంతా తాను నివసించటానికి.

అలాగే భగవంతుడు తాను సృష్టించిన లోకాలను అంఏట ప్రకృతిని స్పృజించడానికి, అనుభూతి పొందడానికి, యీ లోకాల అందాలు తిలకించి భౌతికంగా అనుభవించడానికి, భౌతిక లోకాన్ని భౌతికంగా అనుభవించటానికి దేహం కావాలి కాబట్టి, భౌతిక లోకంలో తాను ఉండటానికి ఒక దేహం నిర్మించుకున్నాడు.

అనంతశక్తివంతుడైన ఆయన తన జ్ఞానశక్తిని, తన ఇచ్ఛాశక్తిని, తన క్రియా శక్తిని ఉపయోగించి, ఎంతోమంది ప్రకృతి దేవతలను ఉపయోగించి, అద్భుతమైన మానవదేహాన్ని సృష్టించాడు. అలా 84లక్షల జీవుల్ని జీవరాసుల్ని కూడా సృష్టించాడు.

ఒక్కరివల్లే జీవించడం కష్టం కనుక, ఇన్ని జాతుల్ని సృష్టించి పరస్పర సహకారంతో జీవిస్తూ, స్నేహితులుగా అన్ని పంచుకుంటూ సృష్టి అందాలను, భోగాలను అనుభవిస్తున్నాడు. అలా తనను తానే ఇన్ని రూపాలు ధరించాడు. చూడటానికి వేరు వేరు రూపాలుగా కనిపిస్తున్నాయి కానీ సృష్టిలోని వారంతా ఒక్కటే. ఒక్కడే భగవంతుడు అని తెలుసుకోవాలి. ఆయనే రకరకాలుగా సృష్టిని స్పృజించటానికి, అనుభవించటానికి జీవులను సృష్టించాడు. ఒక్కరే జీవించలేరు కనుక అందరి అవసరాలకోసం అందరినీ సృష్టించాడు.

యజమానిగా జీవితం ఎలా వుంటుందో ఒక్కటే తెలుసుకుంటే సరిపోదు కాబట్టి. పనివాడుగా కూడా తానే సృష్టించుకుని, ఆ అనుభవాన్ని కూడా పొందుతున్నాడు. అలాగే మోసగించేది తానే, మోసగింపబడేవాడు తానే. పురుషుడు తానే, స్త్రీ తానే. కలిమి అనుభవించేది తానే, లేమి అనుభవించేది తానే. జ్ఞాని తానే, అజ్ఞాని తానే. అన్నిటికి సాక్షీభూతుడై, నిమిత్తమాత్రుడుగా వుంటూ తన లీలలన్నీ తానే వినోదిస్తున్నాడు.

అలాగే ఖనిజ జాతి రూపంలో, వృక్షజాతి రూపంలో క్రిముల, కీటక జాతి రూపంలో, పక్షిజాతి రూపంలో, జంతుజాతి రూపంలో, అనేక రూపాల్లో తన సృష్టిని తాను అనుభూతి చెందుతున్నాడు. ఈ సృష్టి అంతా తాను వినోదించడానికే. ఇక్కడ వేరొకరు ఎవరూ లేరు. అంతా ఆయనే. అంతా ఆయన సృష్టే. అంతా ఆయన మాయే.

చెప్పేది ఆయనే. వినేది ఆయనే. గెలిచేది ఆయనే, ఓడేది ఆయనే. నిర్మాణము ఆయనే, వినాశనము ఆయనే, సుభిక్షము ఆయనే కరువుకాటకాలు ఆయనవే. అంతా ఆయన వినోదమే. అంతా ఆయన సృష్టే. లేనిది వున్నట్టుగా కనబడేదంతా ఆయన కల్పించిన భ్రాంతే. అంతా ఆయన సృష్టించిన మాయే.

ఈ జ్ఞానం లేక భగవంతుని మాయ తెలియక మానవుడు భ్రాంతి చెందుతూ తాను వున్నాననుకుంటున్నాడు. తన దగ్గర వున్నవి తనవనుకుంటు న్నాడు. తాను సంపాదించుకుంటున్నది తనదనుకుంటున్నాడు. తానే అన్నీ అనుభవిస్తున్నాననుకుంటున్నాడు. తానే ఇస్తున్నాననుకుంటున్నాడు. తానే అన్నీ చేస్తున్నాననుకుంటున్నాడు. తనవల్లే అన్నీ జరుగుతున్నాయనుకుంటున్నాడు. అందరికీ సాయం చేస్తున్నాననుకుంటున్నాడు. కాని 'అంతా ఒట్టి భ్రమ'. తాను అనేది లేనే లేదు. ఉన్నదంతా ఆయనే ఆ 'భగవంతుడే'.

మనం ఇల్లు నిర్మించాలన్నా, ఇంట్లో హాయిగా వుండాలన్నా ఇంట్లో ఎన్నో సౌకర్యాలు వుండాలి. నీరు ప్రవహించటానికి పైపులు కావాలి. కరంటు ప్రవహించటానికి 'వైర్లు' కావాలి. కూర్చోటానికి కుర్చీ, సోఫాలు, పడుకోవటానికి మంచాలు కావాలి. భోజనం తయారు చేయటానికి పొయ్యి, పాత్రలు అన్నీ కావాలి. సరుకులు కావాలి.

అలాగే శరీరంలో భగవంతుడు వుండాలంటే, శరీరం సరిగా వుండాలంటే రక్తనాళాలు, నాడీ మండలం జీర్ణాశయం, విసర్జకాలు, అన్నీ వుండాలి. కనుక అన్నీ ఏర్పాటు చెయ్యబడ్డాయి. అలాంటి శరీరంలో భగవంతుడు ఆత్మ రూపంలో ప్రవేశించి తాను సృష్టించిన ఈ భౌతిక సృష్టి యొక్క అందాలను భౌతికంగా చూస్తున్నాడు. అనుభవిస్తున్నాడు. ప్రకృతి దేవతలతో శరీరానికి కావలసినవన్నీ ఏర్పాటు చేయబడ్డాయి. బాల్యం యొక్క అనుభవం ఒక్కటీ సరిపోదు కాబట్టి, యవ్వనంలోకి ప్రవేశించే ఏర్పాట్లు, కౌమారం లోకి మారే ఏర్పాట్లు, వృద్ధాప్యం పొందే ఏర్పాట్లు చేయబడ్డాయి. అలా ఆయన వింటున్నాడు. తింటున్నాడు. వాసన చూస్తున్నాడు. అనుభవిస్తున్నాడు. ఆనందం, దుఃఖం అన్ని రకాలు అనుభవిస్తున్నాడు. తన సృష్టిలోని నవరసాలు అనుభవిస్తున్నాడు.

అందుకే **'దివినుండి భువికి దిగివచ్చిన దేవుడే మానవుడు'** అని అంటారు.

కాని వచ్చిన తరువాత నేను మానవుడు అనుకుంటాడు. సహజంగా మానవుడిగా జీవిస్తాడు. మరల ఆయనే ఏదో జ్ఞాని రూపంలో వచ్చి, ఈ జ్ఞానం అందించి నువ్వు మానవుడవు కాదు, భగవంతుడవేనని బోధించి దానికి కావలసిన మార్గం అంటే ధ్యానాన్ని అందించి వెళ్ళిపోతాడు. అపుడు మానవుడిగా వున్న తానే ధ్యాన సాధన చేసి, జ్ఞానం తెలుసుకుని దేవుడవుతాడు. అంటే మానవుడు కూడా భగవంతుడే అని తెలుసుకుంటాడు. చివరకు భగవత్ స్థితిలో విరాజిల్లుతాడు. బ్రహ్మర్షి అవుతాడు.

# "మా పరువంతా తీసేశారు!"

చాలామంది తల్లిదండ్రులు చాలా విషయాల్లో పిల్లలు తమ పరువు తీసేశారని బాధపడుతూ వుంటారు. పిల్లలను తిడుతూ వుంటారు. అలా చాలా సందర్భాలలో చాలామంది తల్లిదండ్రుల విషయంలో ఇది జరుగుతూ వుంటుంది.

అలా పరీక్షలలో ఫెయిల్ అయినా, మార్కులు తక్కువ వచ్చినా, స్కూలు, కాలేజీలలో చేయకూడని పనులు చేసినా, అంటే దొంగతనాలు, ఇతర పిల్లలను కొట్టడం, అమ్మాయిలను ఏడిపించడం లాంటి పనులు చేసినపుడు అది వారి దృష్టికి వచ్చినపుడు వారు సహజంగా ఈ మాట అంటారు. మా పిల్లవాడు మా పరువు తీసేశాడని బాధపడతారు, తిడతారు.

అలాగే వయస్సు పెరిగేకొద్దీ ప్రేమించి పెళ్ళిచేసుకున్నా, వారి అమ్మాయి మగవారితో తిరుగుతున్నా, తమ కులంకాని వారిని పెళ్ళి చేసుకున్నా, తల్లిదండ్రులు చాలామంది బాధపడతారు. తమ పరువంతా పోయిందని మధనపడుతూవుంటారు. అంతేకాదు పెళ్ళైన కొడుకు వ్యసనాలకు బానిసై తాగి రోడ్డుమీద పడ్డా, పేకాడుతూ, వ్యభిచారం చేస్తూ పోలీసులకు దొరికినా, వూరంతా అప్పులు చేసినా, గొడవలు తగవులతో అందరిలో చెడ్డపేరు తెచ్చుకున్నా, తల్లిదండ్రులు తమ పిల్లలు తమ పరువంతా తీసేశారని బాధపడతారు. కొంతమంది పిల్లలను తిడతారు. ఇంకా కొంతమంది తమ ఇంటినుంచి పొమ్మంటారు కూడా.

అలా తమ పిల్లలు తమ పరువు తీసేశారని తల్లిదండ్రులు బాధపడతారు కాని తాము కూడా అలాంటి పనే చేస్తున్నామని తెలుసుకోలేకపోతున్నారు. తమ పిల్లలు తమ పరువు తీసేశారని బాధపడుతున్నారు కాని, తమ తండ్రి అయిన భగవంతుని పరువు తీస్తున్నామని పెద్దలు తెలుసుకోలేకపోతున్నారు. అందరికీ తండ్రి భగవంతుడే కారణం మనమంతా ఆత్మలమే కాని దేహాలం కాదు. ఇప్పుడు ఉన్న వారు దేహాలకే తల్లిదండ్రులు కాని ఆత్మకు కాదు. తల్లిదండ్రులు దేహాన్ని మాత్రమే తయారు చెయ్యగలరు కాని, దేహంలోని ఆత్మ పరలోకంలోని భగవంతుని నుండి విడివడిన అంశ మాత్రమే. అందుకే భగవంతుడే అందరికీ తండ్రి అని చెప్పుకుంటాం. ఆ తండ్రి అయిన భగవంతుని అంశ, ప్రతీ ఒక్కరిలో ఆత్మ రూపంలో వుంది. అంటే ప్రతీ ఒక్కరికి భగవంతుడే తండ్రి.

దేహంతో చేసే పనులు లోపల వున్న భగవంతునికి వర్తిస్తాయని తెలుసుకోవాలి. దేహం మంచి పనులు చేస్తే ఆత్మ అంటే భగవంతుడు ఆనంద పడతాడు. దేహం చెడు పనులు, చేయకూడని పనులు, హింసాయుతమైన పనులు చేస్తుంటే, ఆత్మ ఆవేదన చెందుతుంది, క్షోభపడుతుంది. అంటే మన తండ్రి అయిన భగవంతుని పరువు తీశామన్న మాట.

అలా పాపపు పనులు, హింసాయుతమైన, మోసపూరితమైన పనులు అంటే జీవహింస, మోసాలు చేసినపుడు ఆత్మ క్షోభిస్తుంది. అంటే నా పరువంతా తీసేశావని మన తండ్రి బాధపడుతున్నాడని తెలుసుకోవచ్చు. మరి మన పిల్లలు చేయకూడని పనులు చేసి మన పరువు తీసేశారని బాధపడుతూ, మనం కూడా చేయకూడని పనులు చేసి మన తండ్రి అయిన భగవంతుని పరువు తీస్తున్నాం కదా? మరి ఇది ఎందుకు ఆలోచించడం లేదు?

మన తండ్రి సామాన్యుడా? ఆయన అనంత శక్తి స్వరూపుడు. సమస్త లోకాల సృష్టికి కారకుడు, సర్వాంతర్యామి, సర్వవ్యాపి, సత్యరూపుడు, ప్రేమస్వరూపుడు. అంతేకాకుండా సకలసద్గుణ స్వరూపుడు అయిన అంతటి గొప్పతండ్రికి బిడ్డలై వుండి, ఆయన గుణాలను అర్థంచేసుకోకుండా ప్రవర్తిస్తుంటే అంతటి గొప్ప తండ్రి పరువుతీస్తున్నట్టు కాదా? ఆయనను క్షోభ పెడుతున్నట్టు కాదా? అందుచేత **“దేహసంబంధమైన పిల్లలు పరువుతీస్తూన్నారని బాధపడడం కాదు. ఆత్మ సంబంధమైన తండ్రి పరువు తీయకూడదని”** తెలుసుకోవాలి.

**“మన తండ్రి పరువు మనం కాపాడినపుడు మన పిల్లలు మన పరువు కాపాడతారు”. “మన తండ్రి పరువు మనం తీస్తే,మన పరువు మన పిల్లలు తీస్తారని తెలుసుకోవాలి”.** మన పరువే కాదు మన తండ్రి పరువు కూడా ముఖ్యం అని తెలుసుకోవాలి.

తెలుసుకోండి భగవంతుని బిడ్డలమై వుండి మనం సత్యసంధులు కావాలి. ధర్మాచరణ చెయ్యాలి. స్వార్థాన్ని విడనాడాలి. అందరం ఆ తండ్రి బిడ్డలం కాబట్టి సోదర జంతువులను చంపకూడదు. హింసించకూడదు. వాటి మాంసాన్ని భక్షించ కూడదు. ఎవరినీ మోసగించకూడదు. నష్టపరచకూడదు. అవమానించకూడదు. అందరినీ గౌరవించాలి. మనతో సమానంగా ప్రేమించాలి. అలా చేసినపుడు మన తండ్రి పరువు మనం కాపాడినట్టు. దీనికి విరుద్ధంగా ప్రవర్తిస్తే తండ్రి

పరువు తీసినట్టే ఆయన్ను అంటే ఆత్మను క్షోభ పెట్టినట్టే. ఆత్మకు శాంతి లేకుండా చేసినట్టే.

అంతేకాదు ఆత్మే భగవంతుడు అని మనం సదా గుర్తుంచుకోవాలి. ఆత్మను కించపరిచే పనులు చేయకూడదు. ఆత్మను అగౌరవపరచకూడదు. అలా చేస్తే ఆ పనుల వల్ల నష్టపోయేది మనమే. ఇదే గీతలో శ్రీకృష్ణభగవానుడు చెప్పింది కూడ.

**శ్లో॥ ఉద్ధరేదాత్మ నాత్మానం ఆత్మానమవ సాదయేత్!**
**ఆత్మైవ ఆత్మనోబంధుః ఆత్మై వరిపురాత్మనః! (భ.గీ. 6-5)**

తా:- ఆత్మను అంటే భగవంతుని అవమానించకూడదు. అలా చేస్తే ఆత్మే శత్రువై నీకు అపకారం చేస్తుంది. ఆత్మను అవమానించే పనులు చెయ్యకుండా వుంటే ఆత్మే నీకు బంధువై ఉపకారం చేస్తుందని శ్రీకృష్ణుని సందేశం.

అందుచేత మన పనులు అవమానకరంగా వుండకూడదని తెలుసుకోవాలి. మనం ఒకళ్ళ కాళ్ళమీద పడితే అనంత శక్తిస్వరూపుడైన ఆత్మను అంటే భగవంతుని ఇతరుల కాళ్ళమీద వేసి అవమానించడమే అవుతుందని తెలుసుకోవాలి. అలాగే రాళ్ళకు మొక్కడం, చెట్లుకు మొక్కటం, పుట్లకు మొక్కటం లాంటి పనులు చేసి మీలోని ఆత్మను అంటే భగవంతుని అవమానించవద్దు. సృష్టిలో అన్నీ ఒక్కటే కాబట్టి అన్నిటిపట్లా స్నేహభావం ప్రదర్శించండి.

చేతులు చాపి అర్థించవద్దు, వేడుకోవద్దు, హీనంగా, దీనంగా ప్రవర్తించ వద్దు. ఏమీ చేయలేని వారిగా, ఏమీ సాధించలేనివారిగా ప్రవర్తించవద్దు. హీనమైన పనులు చేసి ఆత్మను అంటే భగవంతుని అంటే మన తండ్రి పరువు తీయవద్దు. మన తండ్రి పరువు తీసే హక్కు మనకు లేదు.

మన తండ్రి గౌరవాన్ని మనం కాపాడాలి. దానికి తగ్గట్లు మన ప్రవర్తన వుండాలి. మన పిల్లలే కాదు, మనం కూడా మన తండ్రి పరువు కాపాడాలి.

దీనికి ఒక్కటే మార్గం. అందరూ ధ్యానం చేయాలి. అప్పుడే ఈ సత్యం తెలుసుకుంటాం. శక్తివంతులు అవుతాం. హీనంగా, దీనంగా ప్రవర్తించం. హీనమైన పనులు చెయ్యం. మన తండ్రి అంటే భగవంతుని పరువు కాపాడుతాం. ఆయన అనుగ్రహం పొందుతాం. అందుచేత అందరూ ధ్యానం చేయండి.



# "మానవుని హీన ప్రవర్తనకు కారణం రాయిని దేవుడని భావించడం వల్లే!"

విగ్రహం దేవుడా అంటే చాలా మంది నేను విగ్రహాన్ని దేవునిగా భావిస్తూ ఆరాధిస్తున్నాను అంటారు. విగ్రహాన్ని దేవునిగా భావిస్తూ ఆరాధిస్తున్నాను అంటున్నారంటే విగ్రహం తనకంటే గొప్పదని భావిస్తున్నట్టే కదా? ఎప్పుడయితే తనకంటే విగ్రహం గొప్పదనే భావంలో వున్నారో తాను విగ్రహం కంటే అల్పుడనని భావిస్తున్నట్టే కదా? ఎప్పుడయితే అలాంటి భావంలో వుంటాడో గొప్పవాడైన మానవుడు "యద్భావం తద్భవతి" అన్న సూత్రం ప్రకారం విగ్రహం అంటే రాయి కంటే అల్పుడై పోతున్నాడు.

భగవంతుని సృష్టిలో ఏ జాతైనా, కొద్దో గొప్పో ఉపకారమే చేస్తాయి తప్ప, ఎవరికీ అపకారం చెయ్యవు. ఆఖరికి సృష్టిలో తక్కువ స్థితిలో వున్న రాయి కూడా ఎవరికీ అపకారం చేయదు. ఏమి చేసినా ఉపకారమే చేస్తుంది. గోడలు కట్టుకోవడానికి, భవంతులు నిర్మించుకోవడానికి, రోడ్లు వేసుకోవడానికి, నేల మీద పరచుకోవటానికి, ఇలా అనేక రకాలుగా ఉపయోగపడుతుంది. కానీ ఎవరికీ అపకారం చెయ్యడు.

**"సృష్టిలో అపకారం చేసిన వారికి ఉపకారం చెయ్యడం ఉత్తమోత్తమం. ఉపకారం చెయ్యడం ఉత్తమం. ఉపకారం చెయ్యకపోయినా అపకారం చెయ్యకపోవడం మధ్యమం. అపకారం చెయ్యడమన్నది అధమం. కానీ ఉపకారం చేసిన వారికి అపకారం చెయ్యడమన్నది అధమాధమం".**

గమనిస్తే మానవుడే అందరికీ అన్నిటికీ అపకారం చేస్తున్నాడు ఆఖరికి ఉపకారం చేసే జంతువులను కూడా క్రూరంగా చంపుతున్నాడు, భక్షిస్తున్నాడు. అందుకే లోకం ఇలా వుంది. అపకారం చెయ్యడమన్నది హీనగుణం. మరి మానవుని ఈ హీన ప్రవర్తనకు కారణం ఏమిటి?

దీనికి ముఖ్య కారణం, మానవుడు తాను అన్నిటికంటే తక్కువ అని భావించడం. అన్నిటిని ఆరాధిస్తున్నాడంటే అన్నిటికంటే తాను తక్కువవాడినని అంగీకరించినట్టే.

సృష్టిలో రాయి (ఖనిజ జాతి) కంటే తక్కువ స్థితి లేదు. కారణం రాయి చలనం లేనిది, శక్తి లేనిది. సృష్టిలో ఖనిజ జాతి కంటే వృక్ష జాతి గొప్పది.

కారణం వృక్షం చలిస్తుంది. ఎదిగే శక్తి వుంది. వృక్ష జాతి కంటే జంతు జాతి ఇంకా గొప్పది కారణం జంతువులు చలిస్తాయి, చరిస్తాయి ఎదిగి పునరుత్పత్తి చేసుకునే శక్తి వుంది.

వీటన్నిటి కంటే అంటే సృష్టిలోని 84 లక్షల జీవులలో ఒక్క మానవ జాతే గొప్పది. కారణం మానవుడు చలిస్తాడు. చరిస్తాడు. అంతేకాదు. ఆలోచిస్తాడు కూడా. సృష్టిలో ఏ జాతికి లేని యీ శక్తి ఒక్క మానవునికే ఉంది. అందుచేత సమస్త జీవులను తన ఆధీనంలో వుంచుకోగలుగుతున్నాడు. వాటిని ఉపయోగించుకుని తాను ఎన్నో లాభాలు పొందుతున్నాడు.

అంతే కాదు మానవుడు తన మేథాశక్తితో ఎన్నో సృష్టించ గలుగుతున్నాడు. ప్రయాణ సాధనాలైన, కార్లు, రైళ్ళు సృష్టించి ఒక చోట నుంచి ఇంకొక చోటుకు అత్యంత వేగంగా ప్రయాణిస్తున్నాడు. విమానాల ద్వారా ఆకాశ గమనం కూడా చేస్తున్నాడు. వినికిడి సాధనాలతో (దూరశ్రవణ) వినగలుగుతున్నాడు. టి.వి.లు, కంప్యూటర్లు సృష్టించి ఎన్నో విషయాలు, దృశ్యాలు ఒకే క్షణంలో ప్రపంచమంతటికీ అందించగలుగుతున్నాడు. ప్రత్యక్షంగా చూపించగలుగుతున్నాడు. (దూరదృశ్యం). రాకెట్లను సృష్టించి గ్రహాంతర యానం చేయగలుగుతున్నాడు.

పై వాటిని గమనిస్తే సృష్టిలోని అన్ని జాతుల కంటే మానవుడు ఎంత గొప్పవాడో అర్థమవుతుంది. అంతే కాదు యీ మానవులలోనే కొంతమంది ఆధ్యాత్మిక మార్గంలో సాధనలు చేసి, ఇంకా శక్తివంతులై సృష్టిలో కనపడని రహస్యాలనెన్నింటినో కనుగొన్నారు. కోటానుకోట్ల లోకాలను కనుగొన్నారు. యంత్రశక్తే కాదు తమ దివ్యశక్తితో ఎన్నో రహస్యాలు తెలుసుకున్నారు. యంత్రశక్తికి సాధ్యం కాని దుఃఖనివారణ, శాశ్వత ఆనంద మార్గాలను కూడా తెలుసుకున్నారు. అందుచేత భగవంతుని సృష్టిలోని అన్ని జాతుల కంటే మానవ జాతి చాలా, చాలా గొప్పది, విశిష్ఠమైనది, అత్యంత శక్తివంతమైనది.

ఆఖరుకు తాను ఆరాధించే విగ్రహం కూడా మానవుడు తాను సృష్టి చేసుకున్నదే. మానవుడు సృష్టి చేయకపోతే రాయికి అంత అందమైన రూపం ఎలా వస్తుంది. అందమైన విగ్రహ సృష్టికర్త కూడా మానవుడే. రాయిని విగ్రహంగా మార్చాలన్నా అది మానవునకే సాధ్యం. ఏ రకంగా చూసినా రాయి కంటే మానవుడు చాలా చాలా గొప్పవాడే కానీ అల్పుడు కాదు.

అసలు సృష్టి పరిణామ క్రమంలో ఖనిజ జాతి నుండి మానవ జాతి స్థాయికి రావాలంటే కోటానుకోట్ల సంవత్సరాలు పడుతుందని పండితులు

చెబుతుంటారు. అంటే ఖనిజ జాతి కంటే మానవ జాతి ఎంత ఎదిగిన జాతో మనకు అర్థమవుతుంది. అంటే ఒక రాయి కానీ, వృక్షం కానీ మానవ స్థితికి రావాలంటే ఎన్ని కోట్ల సంవత్సరాలు పడుతుందో కూడా మనం అంచనా వేయలేము.

సృష్టిలో ఒక్క మానవజాతికే దేవతలుగా, దేవుళ్ళుగా ఎదిగే అవకాశం వుంది. ఇంక ఏ జాతికీ ఆ అవకాశం లేదు. అర్హత లేదు. అందుకే అంటారు. **"ఎదిగిన మానవుడే దేవుడు"** అంతే కాదు **"ఎదగబోయే దేవుడే మానవుడు"** అని కూడా అంటారు. అంటే "మానవుడే మాధవుడు కాగలడు". అవుతాడు కూడా. **గొంగళీపురుగు సీతాకోక చిలుకగా మారినట్టు.**

గొంగళీ పురుగు, తినడం, తిరగడం మాని గూడు కట్టుకుని అందులోనే కొంతకాలం వుండి సీతాకోకచిలుకగా ఎలా మారుతుందో? అలాగే మానవుడు కూడా తినడం, తిరగడం మాని కూర్చుని ధ్యాన సాధన చేస్తే "మానవుడే చివరకు మాధవుడు" అవుతాడు. అలా మారిన వారే మనం అనుకునే దేవుళ్ళు. బుద్ధుడు, జీసస్, మహావీరుడు, రమణ మహర్షి, రామకృష్ణ పరమహంస పత్రీజీ లాంటి వారెందరో. అందుచేత రాయి కంటే మానవుడు ఎంతో, ఎంతో గొప్పవాడని తెలుసుకోవాలి. ఎంతో శక్తివంతుడని తెలుసుకోవాలి.

మరి అంతటి గొప్పవాడైన మానవుడు ఎందుకు ఇంత శక్తి హీనుడులా ప్రవర్తిస్తున్నాడు. ఏమీ చేయలేనివాడిగా, సాధించలేనివాడిగా, కనీసం తన కష్టాలను అధిగమించలేనివాడిగా ప్రతీ చిన్నదానికి చేతులు జోడించి నీవే దిక్కు, నువ్వే కాపాడాలి, నువ్వే ఆదుకోవాలి, నువ్వే రక్షించాలి. నువ్వే ఇవ్వాలి అని ప్రార్థనలు చేస్తున్నాడు. వేడుకుంటున్నాడు, అర్థిస్తున్నాడు. ఏ చిన్న సమస్య వచ్చినా తన వల్ల కానట్టుగా విలవిలలాడుతున్నాడు.

అన్నీ చెయ్యాలనుకుంటాడు. కానీ ఏదీ చెయ్యలేకపోతున్నాడు. సత్యం పలకాలనుకుంటాడు. పలకలేడు. ధర్మంగా జీవించాలనుకుంటాడు. జీవించలేడు. అందరినీ ప్రేమించాలనుకుంటాడు. ప్రేమించలేడు. హింసించకూడదనుకుంటాడు. కానీ హింసే చేస్తాడు. ఆఖరికి తన మాటల మీద, పనుల మీద, ఆలోచనల మీద కూడ తనకు అదుపు లేదు. ఎరుక లేదు. ఆఖరికి మానవుడై వుండి మానవుడిలా ప్రవర్తించక మానవత్వాన్ని మరచి అంతా ఒక్కటే అన్న సత్యాన్ని తెలుసుకోలేక స్వార్థంతో అందరికీ నష్టాలను, కష్టాలను కలుగ చేస్తున్నాడు. అందరినీ దుః ఖపెడుతూ తాను దుఃఖితుడవుతున్నాడు. ఇంత గొప్ప మానవుడికి యీ దుస్థితి

ఏమిటి? దీనికి కారణమేమిటి?

గొప్పవాడైన మానవుడు చివరకు ఇలా దిగజారిపోయాడు. అన్నిటికంటే హీనంగా ప్రవర్తిస్తున్నాడు. కారణం "తాను అన్నిటికంటే హీనమనే భావనలో వుండడం" అలాంటి భావంతో మానవుడు వున్నాడు అని చెప్పటానికి నిదర్శనం మానవుని ప్రవర్తనే. తానేదో తక్కువవాడైనట్టు, జంతువులు, వృక్షాలను, రాళ్ళను ఆరాధించడమే. అంటే మానవుడు విగ్రహాలను దేవుడని ఆరాధిస్తున్నంత కాలం మానవుని ప్రవర్తన ఇలాగే వుంటుంది.

అందుకే వేమన యోగి ఇలా అన్నారు.

**"పూజ సేయ సేయ పూజారి తానాయె –**
**పూజ్య వస్తువెన్న భువిని తానె!**
**యాడ పూజ సేయు? నెల్ల దిక్కులు తానె!**
**తానె నేను, నేను తానె, వేమ!"**

తా:– పూజ చేయగా, చేయగా పొట్ట పోసుకునే ఒక పూజారి అవుతాం. అంతకన్నా ఇంకేమీ కాదు. అసలు ఎవర్ని పూజించాలి? అసలు ఏది పూజ్య వస్తువు? నేను ఎవరిని పూజించాలి? ఆలోచించండి "పూజించ దగ్గ వస్తువు భూమి మీద నేనే!" అంటే "నేనే పూజ వస్తువు!". కారణం అంతా నేనే. "అహం బ్రహ్మాస్మి" అన్నారు కదా!

విగ్రహారాధన అంటే రాళ్ళ ఆరాధన వదలి ''తన్ను తాను ఆరాధించుకుంటే" మానవుని ప్రవర్తన మారిపోతుంది. పనులు శక్తివంతంగా వుంటాయి. ఉన్నతంగా వుంటాయి. ఉదాత్తంగా వుంటాయి. అందుకే యోగుల ప్రవర్తన అలా వుంటుంది. అందుచేత యోగులులా ధ్యానం చెయ్యాలి. రాయి కాదు తానే దేవుడని తెలుసుకోవాలి. 'అహం బ్రహ్మాస్మి' అన్న వేదవాక్కును అర్థం చేసుకోవాలి. ధీరుడిలా మారాలి.

**" సకల రోగాలకూ మూలకారణం**
**ఆత్మజ్ఞానం లోపించడమే ! "**
**- బ్రహ్మర్షి పత్రీజీ**

# మనం ఇహలోకవాసులమా? పరలోకవాసులమా?

సృష్టిలో రెండు రకాల లోకాలు వున్నాయి. 1. ఇహలోకము 2. పరలోకము. కనబడే ఈ భూలోకాన్ని ఇహలోకమంటారు. కనబడని లోకాన్ని పరలోకం అంటారు. అసలు మనం ఏ లోకానికి చెందినవారం? ఏ లోకవాసులం? ఇహలోకవాసులమా? పరలోకవాసులమా? ఈ విషయం తప్పనిసరిగా ఆలోచించవలసిన అవసరం వుంది.

కారణం మనం ఇహలోకవాసులమయితే ప్రస్తుతం మనమంతా ఆలోచించే, జీవించే విధానం ఒక రకంగా సరైనదే. కాని మనం నిజంగా పరలోక వాసులమయితే మనం ఆలోచించవలసింది, జీవించవలసిన విధానం వేరే విధంగా వుంటుంది. అందుచేత తప్పనిసరిగా ముందు మనం ఈ విషయం ఆలోచించి నిర్ధారణ చేసుకోవాలి. కారణం మనందరి ప్రవర్తన చూస్తే మనమంతా ఇహలోక వాసులమన్నట్టుగానే వుంది.

మనమంతా భూలోకవాసులమైనట్టు ఇక్కడే శాశ్వతంగా వుండిపోయేవారమైనట్టు ప్రవర్తిస్తున్నాం. ఇక్కడ వున్నవాటికి ప్రాముఖ్యం ఇస్తున్నాం. అంటే భూలోక సంపదలు, భోగభాగ్యాలు, పదవులు, పేరుప్రతిష్టలు సంపాదించడానికి ఎంతో ప్రాముఖ్యం ఇవ్వడమే కాదు, వాటిని సంపాదించ టానికి జీవితమంతా కృషిచేస్తున్నాం. ఆఖరికి అధర్మంగా వ్యవహరిస్తున్నాం. పాపాలు కూడా చేస్తున్నాం. మనం ఇక్కడి వారమైనట్టు. ఇక్కడ వున్నవన్నీ మనవైనట్టు, ఇవన్నీ శాశ్వతమైనట్టు భ్రమ పడుతున్నాం.

ఇక్కడ వున్నవారిలో కొందరు మన బంధువులయినట్టు, కొందరు శత్రువులైనట్టు, మరికొందరు మిత్రులైనట్టు భావిస్తున్నాం. ఇక్కడ ఏదైనా వస్తుంటే వస్తుందని సంబరపడిపోతాం. పోతుంటే పోతుందని బాధపడతాం. ఇతరులవి చూసి అసూయపడతాం. నాకు లేదని బాధపడతాం. ఎందులోనైనా విజయం సాధిస్తే గెలిచేనని పొంగిపోతాం. అంతా వేరు వేరు అనుకుంటాం. తాను, తమవారు బాగా వుండాలనుకుంటాం. అందరికంటే గొప్పగా జీవించాలను కుంటాం. ఇవన్నీ చూస్తే మనం 'భూలోకవాసులమని' అనుకున్నట్టుగానే వుంది. కానీ మనం అసలు ఏ లోక వాసులం? ఏ లోకానికి చెందిన వారం? భూలోక

వాసులమా? కాదా? అన్నది ముఖ్యంగా ఆలోచించాలి. కారణం మనం భూలోక వాసులం కాకుండా పరలోక వాసులమే కనుక అయితే మనం చేయవలసిన పనులు వేరే విధంగా వుంటాయి.

మరి ఇది తెలియాలంటే ముందు మనమెవరో తేల్చుకోవాలి. అంటే నేను దేహమా? లేక ఆత్మనా? దేహం నేనయితే నేను భూలోకవాసిని. ఒకవేళ ఆత్మ నేనయితే నేను పరలోకవాసి. మరి నేను దేహమా? ఆత్మా? అని తెలియాలంటే ముందు ఇంకొకటి తెలుసుకోవాలి.

అసలు నేను చనిపోయాక ఇంకా వుంటానా? వుండనా? అంటే ఇంకా జీవితం వుందా? లేదా? అంటే ఇంకా జన్మలు వున్నాయా? లేదా? అన్నది ముందుగా తేల్చుకోవాలి. ఇది తెలియాలంటే అందరికంటే గొప్పవాడైన శ్రీకృష్ణభగవానుడు చెప్పిన భగవద్గీతను చూడాలి. గీతలో

**శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మమృతస్య చ।**
**తస్మాత్ పరిహార్యేర్దేన త్వం శోచితు మర్హసి॥ (భ.గీ.2-27)**

తా:- ఏ విధంగా చూసినప్పటికీ పుట్టినవాడికి చావు తప్పదు. మరణించినవాడు పుట్టడం తప్పదు. మరో మార్గం లేని ఈ విషయంలో దుః ఖించడం నీకు తగదు.

దీనిని బట్టి చనిపోయాక ఇంకా వుంటామని తెలుస్తుంది. మరి చనిపోయేది ఏది? చనిపోయేది దేహం మాత్రమే. కారణం చనిపోయాక రెండు జరుగుతాయి 'ఒకటి కాలుతుంది'. 'రెండవది పైకి పోతుంది'. కాలేది 'దేహం'. పైకి పోయేది 'ఆత్మ'. అంటే కాలేది మనమా? పైకి పోయేది మనమా? అంటే ఖచ్చితంగా పైకి పోయేదే మనమని చెప్పవచ్చు. కారణం కాలే దేహం మనమైతే ఇక మనం లేనట్టే. కాని మనం ఇంకా వుంటాం కాబట్టి వుండేది పైకి పోయే ఆత్మ కాబట్టి. ఆత్మే మనమని అర్థమవుతుంది.

ఆత్మ మనమైనపుడు ఆత్మ యొక్క శాశ్వత స్థానం పరం. మరి మనమంతా ఇహంలో అంటే ఈ భూలోకంలో ఎందుకు వున్నాం? మన శాశ్వత స్థానమైన పరం నుండి ఇహానికి ఎందుకు వచ్చాం? అనే ప్రశ్న ఉదయిస్తుంది. ఈ ప్రశ్నకు సమాధానం తెలుసుకోగలిగితే మనం భూమిమీద ఏం చెయ్యాలో తెలుస్తుంది. ఎలా జీవించాలో తెలుస్తుంది. అలా తెలుసుకుని జీవించే జీవితమే సవ్యమైన

జీవితం. సద్వినియోగం చేసుకున్న జీవితం. అలా కాకుండా జీవించే జీవితం ఇహంలో ఎంత గొప్పదైనా అది వ్యర్ధమే.

మరి మనం పరం నుండి ఎందుకు వచ్చాం? ఇహంలో ఏం చెయ్యడానికి వచ్చాం? ఇది తెలుసుకోవాలంటే ముందు పరం గురించి కొంత తెలుసుకోవాలి. ఇహంలో రకరకాల గృహాలు ఎలా వుంటాయో పరంలో కూడా కోటానుకోట్ల లోకాలు వున్నాయి. అంటే భూమి మీద పాకలు, షెడ్లు, పెంకుటిళ్ళు, డాబాలు, మేడలు, భవంతులు, బంగళాలు, ప్యాలెస్‌లూ లాంటి రకరకాల గృహాలు భూమి మీద ఉన్నాయి కదా? అంటే సౌకర్యాలు లేనివి, అలాగే సౌకర్యాలు ఉన్న విలాసవంతమైన గృహాలు ఇహంలో ఎలా వున్నాయో! అలాగే పరంలో ఉన్నతమైన ఊర్ధ్వలోకాలు, వాటికి విరుద్ధమైన అధోలోకాలు కూడా వున్నాయి. సౌకర్యాలు కలిగిన వాటిని ఉన్నత లోకాలు అంటారు. లేని వాటిని అధోలోకాలు అంటారు.

ఈ కోటానుకోట్ల లోకాలను యోగులు 7 ఊర్ధ లోకాలుగాను 7 అధోలోకాలుగాను విభజించారు. అవి 1.భూలోకము, 2.భువర్లోకము, 3.సువర్లోకము, 4.జనాలోకము, 5.జనాలోకము, 6.మహాలోకము, 7.సత్యలోకము అనబడే ఊర్ధ్వలోకాలు అలాగే 1.అతలము, 2.వితలము, 3.సుతలము, 4.తలాతలము, 5.రసాతలము, 6.మహాతలము, 7.పాతాళ లోకాలనే అధోలోకాలుగా విభజించారు.

ఎవరైనా భూమిమీద దేహంతో మోసాలు, పాపాలు చేస్తూ! అపవిత్రంగా, అధర్మంగా జీవిస్తూ! నేరాలు, హింస, జీవహింస చేస్తే చనిపోయిన తరువాత అధోలోకాలకు వెళతారు. అలా కాకుండా పవిత్రంగా, ధర్మంగా జీవిస్తూ, ఎవరినీ మోసగించకుండా, హింసించకుండా భూతదయ కలిగి వుండి, అన్ని ప్రాణులను, అందరిని ప్రేమిస్తూ అందరికి మంచి జరిగేలా పుణ్యకార్యాలు చేసేవారు చనిపోయిన తరువాత ఊర్ధ్వలోకాలకు వెళతారు.

అందుకే అందరికి ఉపకారం చేసే దేవతలు స్వర్గంలో వుంటారని, అందరిని హింసించే రాక్షసులు పాతాళ లోకంలో వుంటారని అంటారు. దీనిని అంటే భూమిమీద చేసుకున్న దానిని బట్టి, దానికి సంబంధమైన పరలోక ప్రాప్తి కలుగుతుందని అంటారు.

అలా పరలోకంలో భూమిమీద చేసుకున్న దాన్ని బట్టి ఏదో ఒక లోకంలో

వుంటాం. పరంలో ఏ లోకంలో వున్నా మనం ఇంకా, ఇంకా పై లోకాలకు వెళ్ళాలనుకుంటాం. అంటే 'ఉన్న లోకం నుండి ఉన్నత లోకాలకు' చేరుకోవాలనే అక్కడ వున్నపుడు అనుకుంటాం. అంటే "ఉన్న స్థితి నుండి ఉన్నత స్థితి" పొందాలనే కోరుకుంటాం. అలా పరంలో ఉన్నత లోకాలకు చేరుకోవాలంటే ఎవరైనా భూమిమీదకు రావలిసిందే ! మానవ దేహం తీసుకోవలసిందే! ఆ మానవ దేహంతో ధ్యానసాధన చెయ్యవలసిందే! ఆ ధ్యాన సాధనా శక్తితోనే ఎవరికైనా ఉన్నత లోకప్రాప్తి కలుగుతుంది. అంతకు తప్ప పరంలో వేరే మార్గం లేదు.

ఆఖరికి దేవతలైనా ఇంకా, ఇంకా ఉన్నత లోకాలకు వెళ్ళాలంటే భూమిమీదకు వచ్చి మానవదేహం తీసుకోవాల్సిందే, ధ్యాన సాధన చెయ్యవలసిందేనని అంటారు. అందుకే మానవ జన్మ అంత గొప్పది అంటారు. అంతేకాదు మానవజన్మ లభించడమే దుర్లభం అని కూడా అంటారు.

పరంలో వున్నవారు ఎవరైనా సరే, పరంలో శాశ్వతమైన సత్యలోకానికి చేరుకోవాలనుకుంటారు. కారణం సత్యలోకానికి చేరేదాకా ఎవరైనా సరే, ఏ లోకంలో వున్నా సరే, మరల మరల భూలోకానికి రావలసిందే.

అందుకే శ్రీకృష్ణ భగవానుడు గీతలో

**శ్లో॥ ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తి నోర్జున!**
**మాముపేత్యతు కౌన్తేయ పునర్జన్మ నవిద్యతే॥ (భ.గీ. 8-16)**

తా:- ఓ అర్జునా! ఆ బ్రహ్మలోకం వరకు గల లోకాలకు వెళ్ళినా మరల జన్మ ఎత్తవలసి ఉంటుంది. కాని నేను ఉండే సత్యలోకానికి చేరుకుంటే మరల జన్మ ఉండదు.

అలా మరల, మరల భూమి మీదకు రావచ్చు కాని భూలోక జీవితంలో ఎన్ని భోగాలు వున్నా, భోగాలుతో పాటు రోగాలు, దుఃఖం కూడా వుంటుంది. అందుకే యోగులు భూలోక జీవితం నుండి శాశ్వతంగా బయట పడాలనే ప్రయత్నం చేస్తారు. ధ్యానసాధనకి ప్రాముఖ్యం ఇస్తారు.

మనమైనా సరే పరంలో వున్నపుడు, పరంలో ఉన్నత లోకాలకు చేరుకోవాలనే అనుకుంటాం. దానికోసం ధ్యానసాధన చెయ్యటానికి భూమిమీదకు వస్తాం. వచ్చి ఏదో ఒక దేహం తీసుకుంటాం. కాని దేహం తీసుకుని జన్మ తీసుకున్న తరువాత ఇదంతా మరచిపోతాం. మనం భూలోకవాసులమనే

అనుకుంటాం. భూలోకభోగాలు అనుభవించటానికి ప్రయత్నిస్తాం. ధనం సంపాదించి, పదవులు సంపాదించి, ఇహంలో అంటే భూమి మీద ఎంతో ఉన్నతిని పొందటానికి ప్రయత్నిస్తాం. కాని పరంలో మన ఉన్నతి కోసం ప్రయత్నించం. ఇహంలో సంపాదించటానికి కృషిచేస్తాం, కాని పరంలో కావలసింది పొంద టానికి కృషి చేయం. ఇహలోక భోగాలే గొప్పవనుకుంటాం. పరలోక భోగాలు అంతకన్నా గొప్పవని తెలుసుకోం. తాత్కాలికమైన వాటికి ప్రాముఖ్యం ఇస్తాం. శాశ్వతమైన వాటి గురించి మరచిపోతాం. ఇహలోక ధనానికి ప్రాముఖ్యం ఇస్తాం. కాని పరలోక జ్ఞానానికి ప్రాముఖ్యం ఇవ్వం. **"ఎంతసేపూ ఇహలోక వాసులమనే అనుకుంటాం. కాని అసలు మనం పరలోకవాసులమన్న సంగతి మరచిపోతాం"**. ఇహం గురించే ఆలోచిస్తాం. పరం గురించి ఆలోచించం.

అలా జీవితమంతా గడిపేస్తాం. జీవితంలో ఎన్నో సంపాదిస్తాం. సమకూర్చుకుంటాం. చివరకు ఎప్పుడో ఒకప్పుడు అన్నిటిని వదలి ఇహం నుంచి నిష్క్రమిస్తాం. అంటే శరీరాన్ని వదిలేస్తాం. అంటే చనిపోతాం. మరల పరంలోకి వెళతాం. అపుడు తెలుస్తుంది. మనం పరలోకవాసులమే కాని భూలోకవాసులము కాదని. భూలోకం తాత్కాలిక స్థానమని అర్థమవుతుంది. కాని అప్పటికే అంతా అయిపోతుంది. ఇక చేయగలిగింది ఏమీ వుండదు. అపుడు బాధపడతాం. ఎంత మంచి అవకాశం వ్యర్థం చేసుకున్నామని అనుకుంటాం. అపుడు ఎంత బాధపడినా ప్రయోజనం ఉండదు. ఇవ్వబడిన అవకాశం చేజారిపోతుంది. మరల ఇంకో అవకాశం కోసం ఎదురుచూస్తూ వుంటాం.

ఇలా జరుగుతుంది. మానవ జన్మ నిష్క్రమణ. అంతేకాదు ఇహంలో ఎంత సాధించినా అది పూర్తిగా వ్యర్థమవుతుంది. అది ఎంత మాత్రం పరానికి అంటే మనకు ఉపయోగపడదు. ఏదీ, కూడా రాదు. అందుకే అంటారు **"చనిపోయినపుడు ధనం పెట్టెలో ఉండిపోతుంది. భార్య గడప దాకా వస్తుంది. బంధువులు, మిత్రులు, శ్మశానం వరకే వస్తారు. కాని చేసుకున్న సాధనా ఫలితమే కూడా వస్తుందని"**.

అందుచేత ఇహంలో జీవించేటపుడే నేను ఇహలోకవాసినా? పరలోక వాసినా? అనే విషయం నిర్ధారణ చేసుకోవాలి. ఖచ్చితంగా అందరూ పరలోక వాసులే. కారణం అందరూ ఆత్మలే గనుక. మరి మనం పరలోకవాసులమైనపుడు,

మనం ఇహంలో ఏమి చెయ్యాలి? ఏమి చేస్తే పరంలో లాభం పొందుతాం? అన్నది ఆలోచించాలి. ముఖ్యంగా ధ్యానసాధన చెయ్యాలి. ధ్యానం ఒక్కటే ఆత్మకు, అంటే మనకు లాభించేది. ఉన్నతలోక ప్రాప్తి కలిగించేది. ధ్యాన సాధనే కాదు. ధ్యానభోధ కూడా పరానికి లాభమే. ధ్యానానికి సంబంధించిన కార్యక్రమా లలో పాల్గొనడం, వాటికి సహకరించటం, ఆత్మకు సంబంధించిన పుస్తకాలు చదవడం, అలాంటి వారితో సాంగత్యం చెయ్యడం, ఇవన్నీ కూడా పరానికి లాభమే. అందుచేత ధ్యానం చెయ్యండి. ధ్యానం గొప్పతనం తెలుసుకోండి.

ధ్యానం చేస్తే ఇహలోకంలో లాభాలే కాదు. పరానికి కూడా లాభమే. పరలోకం ఎలా కనబడదో ధ్యానసాధనా ఫలితం కూడా కంటికి కనబడదు. చిన్న ఉదాహరణ తీసుకుందాం. ఒక దేశానికి అధ్యక్షుడనుకుందాం అంటే ఆ దేశంలో అందరికంటే గొప్పవాడే కదా? లేక గొప్ప ధనువంతుడనుకుందాం. కానీ ఆయన ఇహంలో పరం గురించి ఆలోచించలేదు. ఏమీ చెయ్యలేదు. ఆఖరుకు ధ్యానం కూడా చెయ్యలేదు. అలాంటి వారు చనిపోతే ఏదో సామాన్యమైన లోకానికి వెళతారు. కాని ఒక రిక్షావాడు కాని, ఆటో డ్రయివరు కాని, సామాన్య గుమస్తా, కాని రోజూ 1 గంట ధ్యానం చేసాడనుకుందాం. ఇతడు చనిపోయిన తరువాత పరంలో భూలోకంలోని ప్రధానికంటే ఎన్నో లక్షల లోకాలు పైన వుంటాడు. అంటే ధ్యానం చేయని ఇహంలో గొప్పవాడు పరంలో తక్కువవాడు అయ్యాడు. కాని ఇహంలో తక్కువవాడు పరంలో గొప్పవాడయ్యాడు. అంటే “తాత్కాలికంలో గొప్పవాడు శాశ్వతంలో తక్కువ వాడయ్యాడు”. కాని “తాత్కాలికంలో తక్కువవాడు శాశ్వతంలో గొప్పవాడయ్యాడు”.

అందుచేత గుర్తుంచుకోండి **“తాత్కాలికంలో కాదు గొప్పవారు కావల సింది, శాశ్వతంలో గొప్పవారు కావాలి!”** మన తాత్కాలిక ఇహలోక జీవితం మన శాశ్వత పరలోక జీవితం కోసం మాత్రమే. ఇది ప్రతి ఒక్కరూ గుర్తు వుంచుకోవాలి. అందుచేత ఇక్కడ ఏమి వున్నా లేకపోయినా దానికోసం ఆలోచించ వద్దు. అంటే బాధపడవద్దు. ఇతరులకు వున్నాయని అసూయ చెందవద్దు. ధ్యానసాధన చెయ్యగలుగుతున్నామా? లేదా? అని ఆలోచించండి. ధ్యానం చెయ్య గలిగిన వారే గొప్పవారని తెలుసుకోండి “ధనం కాదు. ధ్యానమే గొప్పది”. “ధనం వెంట కాదు, ధ్యానం వెంట వస్తుంది. అందుచేత ధనం వెంట కాదు. ధ్యానం వెంటపడండి. మనమంతా పరలోక వాసులమని తెలుసుకోండి.”

# "ఆత్మశాంతి"

ఎవరైనా చనిపోతే అంతా కలసి ఒక సంతాప సభ పెట్టి వారి ఆత్మకు భగవంతుడు శాంతి కలిగించాలని ప్రార్థిస్తారు. రెండు నిమిషాల మౌనం పాటిస్తారు. అక్కడితో వారి విషయంలో వీరి ధర్మం పూర్తయినట్టు భావిస్తారు. ఇంక తరువాత వారిని తలచుకోరు. వారి గురించి ఆలోచించరు.

కాని ఆలోచించండి అసలు వారి ఆత్మకు శాంతి ఎందుకు కోరుకుంటున్నారు? ఆత్మకు శాంతి అవసరమా? వీరు ప్రార్థిస్తేనే శాంతి వస్తుందా? లేకపోతే ఆత్మ శాంతిగా వుండదా? మరి నిజంగా ఆత్మకు శాంతి అవసరమయితే అది చనిపోయిన తరువాత అందరూ ప్రార్థిస్తే వస్తుందా? లేకపోతే జీవించివున్నపుడే ఆత్మ శాంతికి కృషి చేస్తే వస్తుందా? ఆత్మకు శాంతి లేకపోతే ఏమవుతుంది? ఎందుకు వీరంతా చనిపోయిన తరువాత అలా శాంతిని కోరుతారు? బ్రతికి వుండగా ఆత్మకు శాంతి కోసం వారు ఎందుకు ఆలోచించరు? ప్రయత్నించరు? ఈ విషయాలు మానవులు ఆలోచించాలి? అసలు చనిపోయినపుడే ఆత్మకు శాంతి కావాలా? లేక జీవించి వున్నప్పుడే ఆత్మకు శాంతి కావాలా? జీవించి వున్నపుడు ఆత్మ శాంతిగా వుంటే వచ్చే లాభం ఏమిటి?

ముందుగా అందరూ తెలుసుకోవలసింది దేహం నేను కాదు ఆత్మే నేను అన్నది. ఆ 'ఆత్మ' అంటే తాను పరం నుంచి అంటే పై లోకాల నుంచి ఇహానికి, అంటే భూలోకానికి వచ్చి దేహం తీసుకుంటారు. కారణం ఆ దేహంతో ధ్యాన సాధన చేసి పరంలో, అంటే పై లోకాలలో ఉన్నతి పొందటానికి అంటే అంతకు ముందు ఉన్న స్థితి నుండి ఇంకా వున్నత స్థితి పొందటానికి. ఇంకా ఇంకా ఉన్నతంగా ఎదగటానికి. పరంలో గొప్పవాళ్ళు కావటానికి.

కాని దేహం తీసుకుని భూమి మీదకు వచ్చాక, ఈ విషయం మరచిపోయి దేహమే తాము అనుకుంటూ ఎంతసేపు దేహం కోసం పాటుపడుతూ వుంటారు. అంటే దేహ సుఖం, దేహ ఆనందం, దేహ అందం, దేహ ఆరోగ్యం, దేహానికి పదవులు, పేరుప్రఖ్యాతులు వంటి వాటికోసం ప్రయత్నం చేస్తూ వుంటారు. అలా చేస్తూ ఆత్మను మరిచిపోతారు. తాను భూమి మీదకు వచ్చిన కారణాన్ని మరిచిపోతారు. అంతేకాదు దేహం కోసం చేయకూడని పనులు చేస్తూ వుంటారు. పాపాలు చేస్తారు. అధర్మయుక్తంగా జీవిస్తారు. తాము చేసేదంతా సరైనదని

భావిస్తారు. అంతా సవ్యంగా చేస్తున్నామని భావిస్తారు. తప్పులు చేస్తూ కూడా చేయని వారిలా మాట్లాడుతుంటారు.

ఇలా జీవిస్తూ, వచ్చిన పని మరచిపోయి ఆత్మ ఉన్నతికి కావలిసిన పనులు చేయకపోవడం వల్ల, పైగా చేయకూడని పనులు చేస్తూ వుండడం వల్ల ఆత్మ క్షోభిస్తూ వుంటుంది. ఆత్మకు నష్టం కలిగించే పనులు చేస్తే ఆత్మ క్షోభించదా? ఆత్మకు శాంతి ఎక్కడ వుంటుంది?

అలా జీవితమంతా ఆత్మ శాంతి లేకుండానే వుంటుంది. కారణం ఆత్మకు శాంతి కలిగించే పని, ఆత్మకు లాభం కలిగించే పని ఒక్కటి కూడా చేయకపోవడమే.

మరి ఇలా జీవితమంతా వ్యర్థం చేసి, ఎప్పుడో చనిపోయిన తరువాత అందరూ కోరుకుంటే వాడి ఆత్మకి శాంతి ఎలా లభిస్తుంది? ఆత్మకు శాంతి లభించాలంటే జీవితంలో ఆత్మకు ప్రాముఖ్యం ఇవ్వాలి. ఆత్మను గుర్తుంచుకోవాలి. ఆత్మను పట్టించుకోవాలి. దేహానికి ప్రాముఖ్యం తగ్గించాలి. దేహాన్ని ఆత్మ కోసం వినియోగించాలి.

ఆత్మకు శాంతి చేకూర్చగలిగిన వాడు మోక్షం పొందినట్టే. 'ఆత్మ శాంతే మోక్షం' ఈ మోక్షం అన్నది ఒకరి తరపున పదిమంది కోరితే వచ్చేది కాదు. తనకు తాను జీవితంలో కృషి చేసి సంపాదించుకోవాలి.

అలాంటి మోక్షం, యోగులు సంపాదించారు. వారంతా వారి జీవితాన్ని, వారి దేహాన్ని, ఆత్మ కోసం వినియోగించారు. చివరకు ఆత్మ శాంతితో మోక్షాన్ని పొందారు. కాని భోగులు దేహానికి ప్రాముఖ్యం ఇచ్చి ఆత్మను విస్మరించి జీవితాన్ని దుఃఖమయం చేసుకున్నారు. ఇహపరాల్లో నష్టపోయారు.

అందుకే **"ఆత్మ కోసం దేహాన్ని త్యాగం చేసే వారు ధన్యులు. కాని దేహం కోసం ఆత్మను త్యాగం చేసే వారు మూర్ఖులు"** అని అంటారు.

మరి ఆత్మకు శాంతి కలగాలంటే మానవునకు మోక్షం రావాలంటే ఏం చేయాలి? చిన్న నాటి నుండి ఆత్మకు లాభం, శాంతి కలిగించే ధ్యానం చెయ్యాలి. 'శ్వాస మీద ధ్యాస'. ధ్యానం ఒక్కటే ఆత్మకు లాభించేది, ఆత్మకు శాంతిని కలిగించేది. అందుచేత జీవించి వున్నపుడే ధ్యానం చెయ్యాలి. అంతేకాని చనిపోయాక ఆత్మకు శాంతి కలిగించమని ఎంతమంది ప్రార్థించినా ప్రయోజనం లేదు.



# "అమృతం ఎవరికి దక్కుతుంది?"

దేవతలు అంతా శ్వాసాహారులు అంటే ధ్యానం చేసేవారు. రాక్షసులు అంతా మాంసాహారులు. అంటే జీవహింస చేసేవారు.

ఇద్దరూ అమృతం కోసం పోటీ పడ్డారు. పాలసముద్రాన్ని మధించారు. కారణం అమరులవ్వడానికి. పాలసముద్రాన్ని మధించగా, మధించగా మొదట హాలాహలం, కల్పవృక్షం, కామధేనువు, ఐరావతం, లక్ష్మీదేవి ఇలా ఎన్నో పుట్టాయి. చివరకు అమృతం కూడా పుట్టింది. అలా అమృతం సాధించడంకోసం దేవతలు, రాక్షసులు ఇద్దరూ కష్టపడ్డారు. కానీ భగవంతుడు, మోహినీ రూపంలో దేవతలకే అమృతాన్ని పంచాడు. రాక్షసులకు దక్కనివ్వలేదు. దీనిని బట్టి భగవంతుని అనుగ్రహం దేవతలకే వుంది కానీ, ఎంత కష్టపడినా భగవంతుని అనుగ్రహం రాక్షసులకు కలగలేదు. అంతేకాదు భగవంతుడు దేవతల పక్షపాతి అని కూడా అంటారు. అసలు దీనికి ముఖ్య కారణం ఏమిటి? కారణం రాక్షసులు జీవహింసాపరులు, మాంసభక్షకులు, లోకాన్ని హింసించేవారు. కానీ దేవతలు అహింసాపరులు. ధ్యాన నిష్ఠ, అంటే శ్వాసనే ఆహారంగా తీసుకుంటున్న వారు. లోకానికి ఉపకారం చేసేవారు అందుచేత వారు భగవంతుని అనుగ్రహం పొందగలిగారు. అమృతంతో అమరత్వం పొందారు.

కానీ మాంసభక్షకులైన రాక్షసులు కష్టపడినా అమృతం పొందలేక దుః ఖకరమైన జనన మరణ చక్రంలో చిక్కుకున్నారు.

అంటే మాంస భక్షణ చేసే వారు భగవంతుని అనుగ్రహం పొందలేరు సరికదా. జనన మరణాలనే దుఃఖకరమైన చక్రంలో చిక్కుకుంటారని పురాణాలు ద్వారా మనం తెలుసుకోవచ్చు.

**భగవద్గీతలో :-**

**శ్లో॥ తానహం ద్విషతః క్రూరాన్సంసారేషు నరాధమాన్।**
**క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు ॥ (16-19)**

తా॥ "సర్వ జీవుల యందు ఆత్మ స్వరూపుడి నైవున్న నన్ను హింసించు క్రూరులైన దుష్టులను, జనన, మరణములతో ఉండు దుఃఖకరమైన, ఘోర సంసార మందు, మాటిమాటికీ పడవేసి వారిని బహు దుఃఖకరమైన అసురయోను లందు

పుట్టించెదను”

**శ్లో॥ ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని।**
**మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం గతిమ్ ॥ (భ.గీ. 16-20)**

తా॥ ఓ అర్జునా ! అట్లు అసురయోనియందు పుట్టిన ప్రాణి హింసకులైన మూఢులు ప్రతి జన్మనందు నన్ను పొందు మార్గం తెలియక, అందుండి అధోగతి పొంది, బహుకాలం దుఃఖభూయిష్టమైన ఘోర నరకమును పొందుదురు.

ఈ విధముగా సాక్షాత్తూ శ్రీ కృష్ణ పరమాత్మ గీతలో “జీవహింస” గురించి తెలియ చేశారు.

దీనిని బట్టి ఎవరైనా భగవంతుని అనుగ్రహం పొందాలంటే మాంసభక్షణ మానాలి. దేవతలలా ధ్యానం చెయ్యాలి. లోకోపకారమైన పనులు చెయ్యాలి. అలా చేసిన వారు చావు పుట్టుకలు లేని జీవితం పొంది అమరులవుతారు. దుః ఖం నుండి శాశ్వతంగా బయటపడతారు.

అందుకే **“అమృతానికి మించిన ఆహారం లేదు. ధ్యానానికి మించిన సాధన లేదు”** అంటారు.

**“హింస చేస్తే, రాక్షసుడు!**
**హింసను వీడితే మానవుడు !**
**హంసను పడితే దేవుడు !”**

**- బ్రహ్మర్షి పత్రీజీ**

# "నిజమైన దేవాలయం!"

"ఆలయం" అంటే వుండే ప్రదేశం. "హిమం" అంటే మంచు. మంచు వుండే ప్రదేశాన్ని 'హిమాలయం' అంటారు.

అలాగే దేవాలయం అంటే దేవుడు ఉండే ప్రదేశం. అందుకే దేవాలయం అని పిలుస్తాం.

మరి దేవుడు ఎవరు? విగ్రహమా? ఆత్మా? గీతలో ఆత్మే నేను అని శ్రీ కృష్ణుడు చెపుతాడు. అంటే 'ఆత్మే దేవుడు' అందుచేత ఆత్మ వుండే ప్రదేశమే 'నిజమైన దేవాలయం'. ఆత్మ వుండేది దేహంలో కాబట్టి మానవుని, జంతువుల యొక్క దేహాలే నిజమైన దేవాలయాలు. అందులో వున్న ఆత్మే దేవుడు. అందుకే శంకరుల వారు "దేహో దేవాలయో ప్రోక్తః జీవో ద్దేవో సనాతనః" అన్నారు. అంటే "దేహమే దేవాలయం అందులో వున్న జీవుడే నిజమైన దేవుడు" అని అన్నారు. అందుచేత ఏ జీవి దేహమైనా పవిత్రమైన భగవంతుడుండే దేవాలయమని ప్రతీ ఒక్కరూ గుర్తుంచుకోవాలి.

మానవుడు పవిత్రంగా చూసుకునే ఆలయాలు "విగ్రహాలయాలు" మాత్రమే. అంటే అవి విగ్రహాలు వుండే ప్రదేశాలు. మానవుడు దేవుడిని చూడలేదు. కారణం దేవుడికి రూపం లేదు. అందుచేత మానవుడు దేవునికి ఒక రూపం వూహించుకుని, ఆ రూపాన్ని రాయితో విగ్రహంగా తయారు చేసి, ఆ విగ్రహాన్ని గుడిలో ప్రతిష్టించుకుని ఆరాధిస్తున్నాడు. అంతే తప్ప అక్కడ వున్నది దేవుడు కాదు. దేవుని విగ్రహం మాత్రమే. **"విగ్రహం వున్నది విగ్రహాలయమవుతుంది. దేవుడు వున్నది దేవాలయమవుతుంది".**

మరి నిజమైన దేవాలయాలు మానవుల, జంతువుల దేహాలే. అందుచేత దేహాలను పవిత్రంగా వుంచుకోవాలి. పవిత్రంగా చూసుకోవాలి. ఏ దేహాన్ని మలినం చేయకూడదు. హింసించకూడదు. నాశనం చేయకూడదు. 'ఆత్మ' అంటే 'దేవుడు' వున్నంతసేపూ అది పవిత్రమైనదే. కారణం అది సత్యమైన దేవాలయం. అలాంటి దేహాన్ని నాశనం చేస్తే అందులోని దేవుని అవమానించినట్లే. దేవుని పట్ల అపచారం చేసినట్టే. ఆ దేహాన్ని విచ్ఛిత్తి చేస్తే దేవుణ్ణి అక్కడ లేకుండా చేసినట్లే. దేవుణ్ణి మనం ఆహ్వానించాలి కానీ, దేవుణ్ణి మనం తరిమి వేయకూడదు. బలవంతంగా పంపి వేయకూడదు. అందుకే 'ఆత్మహత్య మహా పాపం' అన్నారు.

దేవుణ్ణి మనం తీసుకురాలేం. అందుకే దేవుణ్ణి బలవంతంగా పంపకూడదు. అందుకే ఆత్మహత్య మహాపాపం అన్నారు. **"దేవుణ్ణి మనం తీసుకురాలేం. తీసుకు రాలేని దేవుణ్ణి బలవంతంగా పంపే హక్కు కూడా మనకు లేదు".**

మరి అలాంటపుడు జంతువులను చంపడం. వాటిని హత్య చేయడం, వాటిని హింసించడం ఎంత పాపమో ఆలోచించండి.

ఒక్క రామాలయాన్ని కూలిస్తే, ఒక్క బాబ్రీ మసీదును కూలిస్తేనే, ఎంతో ఘోరమైన పాపం చేసినట్టు మానవులు భావిస్తున్నారు. దేశం ఎంతో అల్లకల్లోలమయ్యింది. మరి రోజూ ఎన్నో లక్షల పవిత్రమైన దేవాలయాలు నాశనం చేయబడుతున్నాయే? జంతువుల దేహాలు క్రూరంగా విచ్ఛిత్తి చేయబడుతున్నాయే? మానవులు దీని గురించి ఎందుకు ఆలోచించరు? పవిత్రమైన దేవాలయాలను ఎందుకు నాశనం చేస్తున్నారు? దేవుళ్ళను భూమి మీద వుండకుండా ఎందుకు చేస్తున్నారు? ఎందుకు అలా ప్రవర్తిస్తున్నారు? ఎందుకు అంత పాప కృత్యాలకు ఒడిగడుతున్నారు? ఇది మానవ జాతికి క్షేమమా? కళ్యాణకరమా? అందుచేత జంతువులను చంపకూడదు. వాటి మాంసాన్ని భక్షించకూడదు. భూమి మీద వున్న నిజమైన దేవాలయాల్ని మానవుడు రక్షించాలి. వాటిని పవిత్రంగా చూడాలి. వుంచాలి.

దేవాలయము అంటే 'దేహం'. అంతే కానీ మానవుడు రాతితో, సిమ్మెంటుతో నిర్మించినది కాదు. **భగవంతుడు తన కోసం అంటే తాను వుండటం కోసం నిర్మించుకున్న దేహాలే 'నిజమైన దేవాలయాలు'.** మానవుడు నిర్మించినవన్నీ విగ్రహాలు వుండే 'విగ్రహాలయాలు' మాత్రమే.

ఈ సత్యం తెలియాలంటే ప్రతీ ఒక్కరూ ధ్యానం చెయ్యవలసిందే. అప్పుడే దేహాన్ని పవిత్రంగా వుంచుకోగలుగుతారు. మద్య మాంసాలతో దేహాన్ని నింపి కలుషితం చెయ్యరు. జంతువుల్ని హింసించరు. కనీసం ఇప్పుడైనా ఈ సత్యాన్ని గ్రహించండి. ధ్యానాన్ని చెయ్యండి.

> **" మన జన్మలను మనమే ఎన్నుకుని వచ్చాం "**
>
> **- బ్రహ్మర్షి పత్రీజీ**



'మతం' అంటే 'మరల ఏకత్వం' అని అర్థం... అన్ని మతాల నిజమైన ప్రకాశత్వం అదే! సకల ప్రాణికోటి అందరిలోని ఏకత్వాన్ని దర్శించగలగటం .. ఆ అవగాహనతో జీవించగలగటం ! ప్రతి మతమూ **"ఆత్మశాస్త్రం"** యొక్క పూర్ణ సత్యాన్ని ఆధారంగా చేసుకునే ఆవిర్భవించింది. **"ఆత్మశాస్త్రం"** ద్వారా మాత్రమే మనమందరం అలాంటి మతాలన్నిటితోనూ ఏకత్వాన్ని సాధించగలం!

"అదే విధంగా మనకు ఎలాంటి పరిమితులూ, పరిధులూ లేవు" అన్న సత్యాన్ని మనం ఆత్మానుభవంతో గ్రహించగలుగుతాం!

అదే విధంగా "ఆత్మతత్వాన్ని" అనుభవించాలంటే, మనం "శ్వాసతత్వంతో" కలిసి వుండాలి! అదే అసలైన కేంద్ర బిందువు.

**– బ్రహ్మర్షి పత్రీజీ**

www.pssmovement.org